# చతుర




ఐ.కవిత

# జీవనఖేల

# చతురకతలు

## టెన్ వీక్స్

సమర్థత వుండటం ఒక ఎత్తు. దాన్ని ఉపయోగించుకుని ఫిల్మ్ ఇండస్ట్రీలో పైకి రావడం ఒక ఎత్తు. ఈ రెండింటినీ ఆకళింపు చేసుకున్నవాళ్ళే సినిమా ఇండస్ట్రీలో పైనవుతారు.

పాటల రచయిత మార్కండేయులు దీనికి ఒక ఉదాహరణ. నొప్పించక తానొ




వ్వక సినిమా వాళ్ళతో సన్నిహితంగా తిరుగుతూంటాడు.

అతన్ని ఓ సినిమా నిర్మాత తన కొత్తసినిమా ప్రొజెక్షన్‌కి పిలిచాడు. దాన్ని చూస్తున్నంత సేపూ నవ్వు దాచుకోలేదు మార్కండేయులు. పగలబడి మరీ నవ్వాడు.

సినిమా ఇంటర్వెల్‌లో బిస్కెట్లు తిని కాఫీ తాగుతుండగా అడిగాడు నిర్మాత మార్కండేయుల్ని పక్కకి పిలిచి.

"ఎలా వుంది?"

"హండ్రెడ్ డేస్ గ్యారంటీ'

సినిమా అయ్యాక ఇంటికెళ్లిపోయాడు మార్కండేయులు. మర్నాడు సినిమా రిలీజవడమేకాక ఆ మర్నాడే అది ఫ్లాప్ అని తేలిపోయింది కూడా. అయినా ఇంకో సినిమా తీసాడు ఆ నిర్మాత మళ్ళీ.

తన చేత పాటలు రాయించుకోమని అడగడానికొచ్చిన మార్కండేయులుతో అన్నాడు నిర్మాత కోపంగా.

"నువ్వు హండ్రెడ్ డేస్ అంటే హండ్రెడ్ అవర్స్ కూడా వుండకుండా బాక్స్‌లు వెనక్కి తిరిగి వచ్చేసాయి. ఆ మాత్రం సినిమాల సంగతి తెలీని నీచేత ఎలా పాటలు రాయించుకోను?"

"కోప్పడకండి. మీరు తొందరపడి

కవర్ ఫొటో గ్రాఫర్: వి.సత్యమూర్తి

ఇంట్రవెల్‌లో నా అభిప్రాయం అడిగారు. శుభం తర్వాత అడిగివుంటే హండ్రెడ్ అవర్స్ అనే చెప్పేవాడిని. కాని మీరడగ లేదది'' సమర్థించుకున్నాడు మార్కండేయులు.

సరే... ఆ సినిమాకి కూడా పాటలు రాసాడు మార్కండేయులు. సినిమా తయారయ్యాక మళ్ళీ ప్రొజెక్షన్‌కి పిలిచాడా నిర్మాత మార్కండేయుల్ని. సినిమా పూర్తయ్యాక అడిగాడు నిర్మాత నవ్వుతూ.

"ఇంటర్వెల్‌లో అడగడంలేదు. పూర్తయ్యాకే అడుగుతున్నాను. ఎలా వుంది సినిమా?"

"టెన్ వీక్స్'' చెప్పాడు మార్కండేయులు. అయితే ఆ సినిమా విడుదలయ్యాక పది వారాలు కాదు కదా, పట్టుమని పది రోజులు కూడా ఆడలేదు.

మార్కండేయులు ఇంటికి కారేసుకుని వెళ్ళి కోపంగా అడిగాడు సదరు నిర్మాత.

"నేనెలా కన్పిస్తున్నాను నీకు?"

"నిర్మాతలాగా!"

"మరి నిర్మాతకి అబద్ధాలు చెప్పడం దేనికి? ఆనాడే సినిమా బాగా లేదని చెప్పవచ్చుగా?"

"బాగా లేదని చెప్పాకదండి?"

"అబద్ధం ఆడకు. టెన్ వీక్స్ గేరంటీ అనలేదా నువ్వు?"

"అవును. అది నిజమేగా. దర్శకుడు వీక్, హీరో వీక్, హీరోయిన్ వీక్, కమెడియన్ వీక్, కథ వీక్, మ్యూజిక్ వీక్..."

–మల్లాది వెంకటకృష్ణమూర్తి

## భక్తి

ఆ దేశంలో అనేక ప్రాంతాలు వున్నాయి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క భాష మాట్లాడతారు. తూర్పున వున్న ఒక ప్రాంతంలోని ప్రజలకు వారి భాషమీద చెప్పలేనంత మక్కువేకాక వెర్రి వ్యామోహం.

ఆ దేశంలో ప్రాచీనమైన భాష సంస్కృతం. సంస్కృత భాషలో వున్న అనేక గ్రంధాలకు ఆ దేశంలో ఏనాడో ఆదరణ లభించింది. దేవాలయాలలో అర్చనలు సంస్కృతంలోనే జరగడం అక్కడి ఆచారం. అందరూ ఆ ప్రాంతంలో సంస్కృతం దేశభాష అని అంగీకరించి గౌరవించారు.

. అయితే ఉన్నట్టుండి ఆ దేశంలో తమ భాషనే ఎంతగానో ప్రేమించే తూర్పున వున్న ఓ ప్రాంతంలో దేవాలయాలలో అర్చనలు సంస్కృతంలోనే ఎందుకు చేయాలి, తమ భాషలోనే ఎందుకు జరుగకూడదని కొందరికి అనిపించింది.

ఆ ప్రాంతపు ప్రభుత్వాధినేత అర్చనలకు దేవాలయాలలో సంస్కృతమా? ప్రాంతీయ భాషా? అనే విషయాన్ని చర్చించి ఒక నిర్ణయం తీసుకోడానికి నిపుణులతో ఒక సంఘాన్ని ఏర్పరచాడు.

ఆ సంఘం ఏ భాషలో అర్చనలు జరగాలనే అంశాన్ని అనేక కోణాలనుంచి పరిశీలించి, అనేక మందిని సంప్రదించి అనాదిగా వున్న సంస్కృతానికి అపచారం జరపనూలేము. అలా అని ప్రాంతీయభాషనీ అగౌరవపరచలేము అనుకుని...

రెండు భాషలలోనూ అర్చనలు జరగవచ్చనీ, జరపవచ్చనీ తీర్మానించింది. ఆ తీర్మానం మీద ప్రభుత్వాధినేత ఆమోదము ద్రవేశాడు.

ఆ మర్నాడు ఒక భక్తుడు దేవాలయానికి వెళ్ళి దేవుని విగ్రహంముందు నిలిచి సంస్కృతంలో బిగ్గరగా ప్రార్థించడం మొదలుపెట్టాడు. దేవుని విగ్రహం ఒక్కసారి వెనుతిరిగింది. భక్తుడు ఆశ్చర్యపోయి నిరాశతో దేవాలయం వెలుపలికి వచ్చేశాడు.

కొంతసేపయిన తర్వాత మరొక భక్తుడు





దేవాలయంలోకి ప్రవేశించి దేవుని విగ్రహం ముందు నిలిచి ఆ ప్రాంతీయ భాషలో గొంతెత్తి ప్రార్థించడం మొదలుపెట్టాడు. దేవుని విగ్రహం ఈసారీ వెంటనే వెనక్కి



తిరిగిపోయింది. అర్థంకాక భక్తుడు ఆందోళనగా దేవాలయం బయటకు వచ్చాడు.

మరికొంతసేపటికి వేరొక భక్తుడు ఆలయంలోకి అడుగుపెట్టి భగవంతుని విగ్రహం ముందు నిలబడి కళ్ళుమూసుకుని మౌనంగా ప్రార్థించడం మొదలుపెట్టాడు.

భగవంతుని విగ్రహం కదలకుండా తన స్థానంలోనే వుండిపోయింది! ఆ భక్తుని పవిత్రభక్తికి మెచ్చి ప్రత్యక్షమయిన భగవంతుడు అలాగే నిలిచిపోయాడా అన్నట్లు.

**–తాజీప్రసాద్**

## డ్యూటీ

పట్టణంలో దోపిడీలు, దొంగతనాలు, మానభంగాలు, హత్యలు జరుగుతున్నాయని రోజూ కంప్లైంట్స్ కుప్పలుతెప్పలుగా వచ్చిపడుతున్నాయి డిస్ట్రిక్ట్ పోలీస్ హెడ్ క్వార్టర్‌కి. ఇంతమంది పోలీసులున్నప్పటికీ ప్రజల మానప్రాణవిత్తానికి రక్షణ లేకుండా పోయిందని పత్రికలు రోజూ హెడ్‌లైన్స్‌లో పోలీస్‌లపై విరుచుకుపడుతున్నాయి. ఇందుకు చలించిన యస్‌పి అరవింద్ వాటిని ఛేదించడంలో భాగంగా నాలుగు మొబైలు టీములు ఏర్పాటుచేసి ఒక్కో టీముకు లీడర్‌గా సర్కిల్ ఇన్‌స్పెక్టర్ స్థాయిగల అధికారిని నియమించాడు. పరిస్థితులను ఎప్పటికప్పుడు పరీక్షించి రిపోర్టు ఇవ్వడానికి ఇద్దరు డియస్‌పిలను నియమించాడు. ఇంతమంది సిబ్బంది కంటికి రెప్పలాగా పెట్రోలింగ్ చేస్తున్నప్పటికీ దొంగతనాలు, దోపిడీలు యథావిధిగా జరుగుతున్నాయి. పోలీసులకు ఇదో సవాలుగా మారింది. అనుమానమొచ్చిన ఏ వ్యక్తినైనా సరే నాలుగుతన్ని బొక్కలో తోస్తున్నారు. పాపం పోలీస్‌వారి పరిస్థితి అలాంటిది.

అర్థరాత్రి సమయం.

ఆరోజు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ మహేంద్రబా



# ముద్దొచ్చే మీనియేచర్ ఛెయిర్స్



స్టూవర్ట్ కింగ్ హాబీ కుర్చీలు చేయడం. అయితే పెద్దవాళ్ళకి కాదు పిల్లలకోసం, షోకేసులకోసం. పురాతన కాలంలో వాడిన యాంటీక్ ఛెయిర్స్ ఇతని స్పెషాలిటీ. బకింగ్‌హామ్ పాలెస్‌లోని ఇంగ్లండ్ క్వీన్ సింహాసనం మీనియేచర్ ఒకటిచేసి ఆవిడకు బహూకరిస్తే ఇతని కళను మెచ్చుకుంది. ఏ కుర్చీ ఏ రకం కలపతో చేస్తే, మీనియేచర్‌కి అదేరకం కలప వాడతాడు. అదేరకం వార్నీషు కూడా వాడతాడు.

వీటిధరలు 7 పౌండ్లనుంచి 30 పౌండ్లదాకా వుంటాయి. కెనడా, అమెరికా, ఆస్ట్రేలియా మొదలైన దేశాలనుంచి కూడా తమ కుర్చీల ఫొటోలు, చెక్‌లు ఇతనికి పోస్ట్‌లో వస్తూ వుంటాయి.

నాలుగు వారాల్లో, ఆ ఫొటో ఆధారంగా మీనియేచర్స్‌ని తయారుచేసి పోస్ట్‌లో పంపుతూ వుంటాడు. తనకి డబ్బు తెచ్చిపెట్టే ఈ పనిని ఎంతో ఇష్టంగా చేసే ఇతను తనని తాను అదృష్టవంతుడిగా పేర్కొంటాడు.

బుకి పెట్రోలింగ్ డ్యూటీ వుండడంతో మోటార్‌బైక్‌పై పట్టణ శివార్లకెళ్లాడు. అక్కడో వ్యక్తి అనుమానాస్పదంగా తచ్చాడుతున్నాడు.

"ఏంటయ్యా, అర్ధరాత్రిపూట ఒంటరిగా తిరగడం నేరమని నీకు తెలియదా! అసలు ఎవరు నువ్వు?" చేతిలోని లాఠీ వూగుతూ గద్దించింది సిఐ కంఠం.

"తె... తె... తెలుసుసార్. నా పేరు



శ్రీనివాసులు'' భయంభయంగా అన్నాడా వ్యక్తి.

"మరి తెలిసే ఎందుకు తిరుగుతున్నావ్?" రెట్టించాడు సిఐ సిగరెట్‌ని ముట్టించుకుంటూ.

"మరేంలేదుసార్! ఇంటిదగ్గర నేనూ మా ఆవిడ ఈ రోజు గొడవ పడ్డాం. అందుకని మనస్సు బాగాలేక ఇలా వచ్చాను'' చేతులు నలుపుకుంటూ అన్నాడా వ్యక్తి.

"రోజూ దోపిడీలు, దొంగతనాలతో ప్రజలంతా భయభ్రాంతులవుతుంటే నీవిలా అర్ధరాత్రి పూట తాపీగా పట్టణ శివార్లకు షికారుకొచ్చావా! ఇంకోసారిలా కనిపించావంటే బొక్కలో తోస్తా! జాగ్రత్త!'' అంటూ హెచ్చరించాడు సిఐ.

"సారీ సర్! ఇంకెప్పుడిలా రానుగాకరాను'' వినయంగా చెప్పాడు.

ఆ వ్యక్తి వెళ్లబోతూ "సార్! నాకో చిన్న డౌటు వుంది. అడగమంటారా?"

"దానిదేముందయ్యా అడుగు''

"మీరెక్కువగా నైట్ డ్యూటీలే చేస్తారని విన్నాను. ఎందుకని సార్?"

"రోజూ ఇంటిదగ్గర మా ఆవిడ గొడవ! ఏం చెయ్యనూ పారిపోయొచ్చి ఇలా నైట్ డ్యూటీలు చేస్తున్నాను'' అంటూనే నాలిక్కరుచుకున్నాడు సిఐ.

—నెట్టూరి లక్ష్మణరావు

## పోటీ

పట్టణంలోని ఓ మహిళా మండలికి ప్రతి రెండేళ్లకొకసారి అధ్యక్షురాలిని ఎన్నుకోవడం ఆనవాయితీ. అందులో దాదాపు 300 మంది మహిళలు సభ్యులుగా వున్నారు. అందరూ హైక్లాస్ సొసైటీకి చెందినవారే. అయితే పోటీ చేయడానికి వారి ఏకైక అర్హత వయస్సు నలభై నిండి వుండడమే. ఈసారి అధ్య





క్షురాలి పదవికోసం పోటీ చేయువారి సంఖ్య ఎక్కువగా వుంది.

పోటీ జరగడానికి ఇంకో వారం రోజులు గడువుంది. రంగంలోకి దిగిన అభ్యర్థిను లంతా తమ శక్తివంచనలేకుండా ప్రచార పర్వంలో మునిగిపోయి వున్నారు. పోటీచే యువారి హామీలవెల్లువకు సభ్యులు మంత్ర ముగ్ధులవుతున్నారు. దాంతో అభ్యర్థిను లంతా గెలుపు తమదేనన్న ధీమాను వ్యక్తప రుస్తున్నారు. ఇంక నాలుగు రోజుల్లో ఎన్నిక జరుగుతుందనగా సభ్యుల సమావేశం జరి గింది. అది ఆ సంవత్సరపు చివరి సమా వేశం కనుక ఎక్కువమంది హాజరైనారు. అందులో అభ్యర్థినుల సరిగమలు,

రెండూ నా దగ్గర పుష్కలంగా వున్నాయి. కాబట్టి నన్నెన్నుకోండి. లేదా నా తడాఖా ఏమిటో మీకు రుచిచూపిస్తాను'' మాజీ ఎమ్మెల్యే రంగారావు భార్య మంగతాయారు బెదిరింపు.

ఇలా ఎవరి అర్హతల్ని వారు గొప్పగా చెప్పుకుపోతున్నారు.

"ఈసారి అందరూ పోటీపడుతుంటే నీవు మౌనంగా వున్నావేం?" ప్రశ్నించింది సరో జిని వరలక్ష్మిని.

"పోటీ చేయిడానికి సత్తా లేకకాదు''

"మరి!"

"అధ్యక్షురాలిగా పోటీచేసే వయస్సింకా



"ఎక్కువ విద్యార్హతలున్నదాన్ని. నన్నె న్నుకోండి. మీ సేవే నా ధ్యేయం" భారతీదేవి అర్థింపు.

"పట్టణంలో ఎంతో చరిష్మా వున్నదాన్ని. నన్నెన్నుకోండి. నా ఇంటి పనులు మాను కుని మీ పనులు చేసిపెడతాను'' మాధవీ విన్నపం.

"అర్థబలం, పరపతి బాగా వున్నదాన్ని. నన్నెన్నుకోండి. అవసరంలో మీకు ఉపయో గపడతాను'' శ్రీలక్ష్మి భరోసా.

"ఈ రోజుల్లో మహిళలకు కూడా కావా ల్సింది గుండె ధైర్యం, రౌడీయిజం. అవి

నాకు రాలేదు'' ఎంతో లౌక్యంగా చెప్పింది వరలక్ష్మి తన అసలు వయస్సును దాచు కుంటూ.

వరలక్ష్మి మాటలు బాంబులా పేలినట్లు న్నాయి. పోటీలోని అభ్యర్థినులంతా గుసగు సలాడుకోసాగారు.

పది నిముషాలు గడిచిపోయాయి.

అంతే!

ఈసారి తీవ్రస్థాయిలో వుంటుందనుకున్న పోటీ ఏకగ్రీవంగా జరిగిపోయింది.

–ఎన్.ఎల్

చతుర
సంపుటి: 22
సంచిక: 6
జూలై 1999

ధనికుడూ, అందగాడూ అయిన యువకుడు ఖరీదైన కారులో వేశ్యావీధికి వేంచేశాడు.

చీకటిపడిన తర్వాత తప్ప మగవీరులు సంచరించని ఆ వీధిలో మిట్టమధ్యాహ్నం అందరూ అలిసి, సొలసి నిద్రిస్తున్న ఆ నిశ్శబ్ద వాతావరణంలో వేశ్యను వెతుక్కుంటూ వచ్చిన ఆ యువకుడిని తెల్లబోయి చూస్తున్నారు వృద్ధ స్త్రీలు.

అక్కడో ఇంటివద్ద ఆగి తలుపు తట్టాడు. తలుపు తీసిన వేశ్యమాత ఆశ్చర్యంనుంచి తేరుకుని విషయం కనుక్కునేలోగానే ఆ ఇంట్లో వుంటున్న "చిత్ర"ని అర్జంటుగా తనతో పంపమన్నాడు. కారణం చెప్పడానికి సమయం చాలదన్నాడు. ఆ యువకుడి మర్యాదకర ధోరణిని చూసి కాదనలేక, మరో ప్రశ్న వెయ్యకుండా అతడివెంట 'చిత్ర'ను పంపిందామె. అటుపైన చిత్రాతిచిత్రమైన మలుపులు తిరిగిన ఆ వేశ్య జీవితం చిట్టచివరికి ఏ గమ్యం చేరింది?

పడుపు వృత్తిలోని రీతిరివాజులను, ఆటుపోట్లను అక్షర రూపంలో ఆవిష్కరించిన **ఐ. కవిత** రచన **జీవనఖేల** ఈ నెల చతుర సమగ్ర నవల.

# జీవనఖేల

- ఐ.కవిత

హైదరాబాద్‌తో పోల్చితే అది చిన్నదేగానీ పోల్చకుండా చూస్తే మాత్రం పెద్దపట్నమే.

ఆ సాయంత్రం నాలుగు కాబోతున్న సమయంలో నగరమంతా చైతన్యంతో తొణికిసలాడుతోంటే ఆ వూరిలోనే ఒక భాగమయిన ఆ ప్రాంతం మాత్రం స్తబ్దంగా, బద్ధకంగా మిగిలి ఉంది. అందుకు కారణం, అదొక ప్రత్యేక ప్రపంచం!

ఆ ప్రాంతం సభ్యసమాజానికి సవాల్ నాగరికతకు దిష్టి బొమ్మ. వైవాహిక వ్యవస్థకు వెక్కిరింత.

అయితే అదంతా పగటిపూట మాత్రమే.

మిగతా ప్రపంచానికి పగలైతే, అక్కడ రాత్రి.

తక్కిన ప్రపంచానికి రాత్రైతే అక్కడ పగలు.

ఆ ప్రాంతానికెన్నెన్నో పేర్లున్నాయి.

సానివీధి... భోగంసందు, వేశ్యావాటిక, ఘాటీ, స్వర్గం, రెడ్‌లైట్ ఏరియా వగైరా!

కొందరు దానిని 'సెక్స్‌వర్కర్స్' కాలనీ అనీ అంటారు. అక్కడ అతి ప్రాచీనమయిన వృత్తి... అంటే వ్యభిచారం జరుగుతూంటుంది. అక్కడ సజీవ స్త్రీ శరీరం గంటల లెక్కనా రాత్రి లెక్కనా అద్దెకు దొరుకుతుంటుంది. అలా శరీరాన్నద్దెకిచ్చి డబ్బు సంపాదించుకుంటూ పొట్టపోషించుకునే వారికి ఎన్నెన్నో పేర్లున్నాయి.

వేశ్య, సాని, భోగంది, పడుపుగత్తె, కాల్ గర్ల్ అన్నవి వాటిలో కొన్ని. అసభ్యమయిన పేర్లు ఇంకెన్నో ఉన్నాయి.

అక్కడివారి బతుకులలానే ఆ ప్రాంతంలోని వీధులూ ఇరుకే.

అక్కడివారి భవిష్యత్తులా ఆ సందులలోనూ చీకటే.

రాత్రివేళ అది రంగుల ప్రపంచం.





సూర్యుడుదయించడంతో ఆ రంగులు వెలిసిపోతాయి.

'చీకటిసుఖం' అనే దానిపై ప్రతి రాత్రీ వ్యాపారం జరుగుతుంటుందక్కడ.

పరువు ప్రతిష్టలున్నాయనుకునేవారూ, పెద్ద మనుషులూ, సమాజానికి వెరిచేవారూ పగటి వెలుగులో అటువేపు చూసేందుకయినా సాహసించరు. చీకటిపడ్డాకయితే అది వేరే విషయం.

ఆ ప్రాంతంలోకి అలాటి సాయం సమయంలో ఓ ఖరీదైన కారు ప్రవేశించింది. కారులో ప్రసిద్ధుడూ, పెద్దమనిషిగా పేరున్నవాడూ ఐన ఓ యువకుడు.

ఆ సన్నని సందులో అటూ ఇటూ రెండు వేపులా ఇళ్లే. బొమ్మరిళ్లు, అగ్గిపెట్టెల్లాటి చిన్నచిన్న ఇళ్లు. ఒక్కో ఇంటికీ రెండే రెండు గదులు. గదుల ముందు చిన్నవాకిలి. ఆ చిరువాకిలిలోనే బాత్‌రూమ్ కమ్ లెట్రిన్ కమ్ డ్రెస్సింగ్‌రూమయిన చిన్నగది. ఆ చిరు వాకిలిలోనే మల్లెపందిరి. దానికింద నులకమంచమూ. వీధిలోనే ద్వారం. ప్రహరీ గోడ నొరుసుకుంటూ పారే మురికి కాలవ. దానిలో ఝుమ్మంటూ నాదం చేసే దోమలు. ఆ కాలవమీద ద్వారం ముందు రాతిపలక. ఆ ఇంటికా రాతిపలకే మెట్టు.

ఒకటిరెండు తప్పిస్తే ఆ వీధిలో అన్నీ అలాంటి ఇళ్లే. ఇచ్చట శృంగారం అమ్మబడును అని బోర్డులు లేకపోయినా అవన్నీ సుఖం దుకాణాలే.

ఆ సన్నని ఇరుకు సందులో కారయినా సరే నడవాల్సిందే తప్ప పరుగెత్తేందుకు వెసులుబాటుండదు. ఆ బాట అలాటి వీలివ్వదు. కారుని నడుపుతూ అతనటూ ఇటూ ఉన్న ఇళ్లని పరిశీలనగా చూస్తున్నాడు.

కొన్నిళ్ల వీధి గోడలకి చవకరకం నేమ్‌బోర్డులున్నాయి. వాటిమీద పేరుతోపాటు నటీమణి, రికార్డింగ్ డాన్సర్, బుర్రకథ ఆర్టిస్ట్, హరికథ ఆర్టిస్ట్ వంటి వృత్తి వివరాలు

న్నాయి. వాటిని చదువుతూ రోడ్డుకటూ ఇటూ ఉన్న ఇళ్లని పరికిస్తూ కారు నడుపు తున్న అతను ఓ ఇంటి ముందుకొచ్చేసరికి మెదడులో ఏదో మెదిలినట్లయి కారాపే శాడు. ఆ ఇంటిని చూస్తూ ఏదో జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్లు ఒక్కసారి కళ్లు చిట్లిం చాడు.

ఆ ఇల్లు మిగిలిన అగ్గిపెట్టె ఇళ్లకంటే కొంచెం భిన్నంగా ఉంది. వీధిలోకి వరండా, దాని వెనుక రెండు గదులు బయటకే కని పిస్తున్నాయి. వాటి వెనుక వంటిల్లూ బాత్ రూమ్ వగైరా ఉన్నాయేమో. అతను కారు లోంచే ఆ ఇంటిని పరీక్షగా చూడసాగాడు.

ఆగిన ఆ కారుని చూసి రోడ్డుమీద వెళ్తున్న వాళ్లు ముసిముసి నవ్వులు నవ్వు కుంటున్నారు.

"ఏదీకాని వేళ ఎద్దీనిందని ఇలాటి వేళలో వచ్చాడే ఇతనెవరో!"

"కొత్త బిచ్చగాడు పొద్దెరగడని ఇలాటివా ళ్లనే అంటారేమో"

"చీకటిపడేవరకూ సైపలేకపోయాడు కాబోలు. ఆరాటం పెళ్లికొడుకు పురోహితుడి మెళ్లోనే పుస్తె కట్టేసేడుట"

"ఎంత ధైర్యం! పట్టపగలు కారేసుకు మరీ వచ్చాడే పడుపు వీధిలోకి!"

ఆ వీధిలోకి వచ్చిన ఒక రిక్షా ఆ కారుని చూసి తోవలేదని వెనక్కి మళ్లింది. పిల్లలు కారు చుట్టూ మూగసాగారు. కారుని ముట్టుకుని చూస్తూ మురిసిపోసాగారు. అతనా ఇంటివైపు నిశితంగా చూశాడు.

వరండాలో ఒక వృద్ధురాలు కూర్చునే కునికిపాట్లు పడుతోంది.

అతను హారన్ మోగించాడు గట్టిగా. రెండు మూడు సార్లు... వరసగా...

ఆమె త్రుళ్లిపడి కళ్లు తెరిచింది. రోడ్డు వేపూ, కారువేపూ చూసింది. తమ ఇంటి ముందే ఆగిన కారుని చూసి ఆమె కళ్లల్లో ఒక్కసారి నమ్మలేనితనం... ఆశ్చర్యం. అంతలోనే ఆనందం. ఒక్క ఉదుటున లేచి చీర సవరించుకుని కారువద్దకు పరుగెత్తుకొ చ్చింది. కారులోని యువకుడిని చూస్తూ ఎంతో వినయంగానూ మృదువుగానూ ఆప్యాయతవొలకబోస్తూ అడిగింది.

"తమకెవరు కావాలి బాబూ"

"చిత్ర" చెప్పాడతను.

ఆ మాట వింటూనే ఆమె నుదురు చిట్లిం చింది. ఒక నిముషం అలా ఆలోచనలో మునిగాక "చిత్ర! అలాటి పేరు కలవారె వరూ లేరే! ఈ ఇంట్లోనే కాదు, ఈ వీధి లోనే లేరే!" అంది అలా లేనందుకు తెగ బాధపడిపోతున్నట్లే.

"మీకు బాగా తెలుసా? "

"ఈ వీధిలో పుట్టి ఈ వీధిలోనే పెరిగిన దాన్ని. నా జీవితమంతా ఇక్కడే వెళ్లమా రింది. నాకు తెలియని వాళ్లెవరున్నారి క్కడ? "

"ఈ ఇంట్లో మీరేనా. మీతోపాటు మరెవ రేనా కూడా ఉంటారా? " అని అడిగాడు.

"మాధవుంది. కాని దానికి వృత్తిమీద శ్రద్ధలేదు. మీలాటి గొప్పవాళ్లకీ పెద్దవాళ్లకీ తగిందికాదు."

"మాధవి వయస్సెంతుంటుంది? "

ఆ ప్రశ్నకామె నవ్వింది. "మీ అమాయ కత్వం కానీ ఈ రోజుల్లో వేశ్యలూ, సినిమా తారలూ అసలు వయసు చెబుతారా? మాధవికి పాతికకి ఒకటి రెండేళ్లటూ ఇటూగా ఉండొచ్చు అందుకే అది మీలాటి వారికి తగదంటున్నాను."

అతను జేబులోంచి ఇరవై రూపాయల నోటు తీసి ఆమెకందించి "నేనొక్కసారి మాధవిని చూడాలి. నేననుకున్న ఆమె ఆమే అయితే మీకు ఇంకా ఇస్తాను" అన్నాడు.



"దానికేం భాగ్యం బాబూ" అంటూ ఆ నోటు అందుకుని కళ్లకద్దుకుంది.

"త్వరగా... టైము లేదుమరి"

"మీరు లోపలికి దయచేయండి" అంటూ ఆమె అతణ్ణి ముందు గదిలో కూర్చోబెట్టి హడావిడిగా లోపలికి వెళ్లింది "మాధవీ!" అంటూ కేకవేస్తూ.

"ఏమిటలా హడావిడి పడిపోతున్నావ్?" పుస్తకం చదువుకుంటున్న మాధవి నవ్వింది.

"హడావిడే మరి. నీకోసం ఎవరో గొప్ప వారు, ధనవంతుడు కారులో మరీవచ్చారు. నిన్ను అరిజెంటుగా చూడాలట. తొందరగా ముందు గదిలోకి వెళ్లు" కచ్చులో కందులు వేసేసిందామె మాధవిని కుదిపేస్తూ.

"నాకోసం గొప్పవారా! ఎవరు?" నమ్మలేనట్లు చూసింది మాధవి.

"వారెవరో నాకూ తెలియదు. అసలే ఆయన తొందరపడుతున్నారు. ఆలస్యం చెయ్యకు"

"నాతో ఏం పని ఆయనకి?" ఆశ్చర్యంగా అడిగింది. "పొరపాటుగా..."

"కాదు, నీకోసమే వెదుక్కుంటూ మరీ వచ్చేరు. ఒక్కసారి వెళ్లి కనిపించేస్తే తెలిపో తుందిగా. ఇంటికొచ్చిన పెద్దమనుషులని నిలబెట్టడం మర్యాద కాదు. వారు కారులో వచ్చేరు సుమీ"

"పెద్ద మనుషులూ, గౌరవనీయులూ అయితే ఇక్కడికెందుకొస్తారు?" అంటూనే ఆమె లేచి ఒక్కసారి జుత్తు సవరించుకుని ఆ గదివేపు నడిచింది.

గదిలో కూర్చున్న అతను ఆ గది ద్వారానికున్న తెరవేపే చూస్తున్నాడు. ఆత్రంగానూ, ఆరాటంగానూ, అసహనంగానూ, ముళ్లమీద కూర్చున్నట్లూ, క్షణాలు లెక్కపెట్టుకుంటున్నట్లూ ఉన్నాడతను. తొందరగానూ తహతహగానూ ఉన్నాడు. దేనికో భయంగానూ, సంకోచపడుతున్నట్లూ కూడా ఉన్నాడు.

"నమస్కారం" అంటూనే ఆమె ఆ తెర తొలగించుకుంటూ ఆ గదిలోకి ప్రవేశించింది.

అతను తుళ్లిపడి లేచి నిలుచుని చేతులు జోడిస్తూ ఒక్కసారి ఆమెను ఆపాదమస్తకమూ కలయజూశాడు. కళ్లతోనే సాకల్యంగా పరీక్షించాడు. క్షణంలో సగంలో ఒక్క చూపులో ఒక్కసారతని ముఖంలోకి ఎంతో రిలీఫ్, వెలుగు, సంతోషం, అన్వేషణ సఫలమయినట్లు, నిరీక్షణ ఫలితాన్నిచ్చినట్లు ఆనందం.

"నమస్తే" అన్నాడు.

ఆమె కొంచెం ఆశ్చర్యానికి, అనుమానానికీ కూడా లోనయింది. ఒక వేశ్యకి నమస్కరించే సభ్యతా సంస్కారాలు అతని సహజ గుణమేనా? స్వభావమేనా? లేక అవసరార్థం తెచ్చిపెట్టుకున్న నటనా?

"నా పేరు వేణు... వేణుమాధవ్"

"కూర్చోండి. నా పేరు మాధవి" అంది. తన పేరు చెప్పించేందుకతను ప్రదర్శించిన గడుసుతనాన్ని అర్థం చేసుకుంటూ.

అతను వాచీ చూసుకున్నాడు.

"దయచేసి మీరు నాతో తక్షణం రావాలి"

అభ్యర్థిస్తున్నట్లే అన్నా అతని మాటలామెకు ఆజ్ఞలా వినిపించాయి.

"ఎక్కడికి? ఎందుకు?" సూటిగా వెలువడ్డాయా ప్రశ్నలామె నోటివెంట.

అతను కూర్చోకుండా నిలుచునే ఉన్నాడు. "నేనిప్పుడేమీ చెప్పలేను. టైమ్‌లేదు"

ఆమె అతని ముఖంలోకి పరిశీలనగా చూసింది. అందమయిన యువకుడు. ధనవంతుడిలా ఉన్నాడు. ముఖంలో తెచ్చిపెట్టుకున్నవో లేక సహజమయినవో కానీ అమాయకత్వమూ, మంచితనమూ తొంగిచూస్తు




న్నాయి. వయసు ఇరవై ఎనిమిదికి దగ్గరగా ఉండొచ్చు. ఆ కంఠంలో మాత్రం ఏదో ప్రత్యేకత, అసాధారణత. ఆ స్వరంలో శ్రోతని హిప్నటైజ్ చేసే, మెస్మరైజ్ చేసే ప్రభావం. అతనేమడిగినా కాదనడం కష్టం. ఆ కంఠస్వరంలో అలాటి మహిమ.

అయినా ఆమె కరిగిపోకుండా ఉండేం దుకు ప్రయత్నిస్తూ "మీకు తెలియదేమో నాకిపుడు వృత్తిమీద ఆసక్తిలేదు, శ్రద్ధాలేదు. ఆట్టే అవసరమూ లేదు" అందామె తన నిరాసక్తతనీ, నిర్లిప్తతనీ తెలియజేస్తూ.

అతని ముఖం ఎర్రబడింది. "నేను మిమ్మల్ని ఆహ్వానిస్తున్నది అందుకుకాదు" సిగ్గుపడుతున్నట్లన్నాడు.

"మరెందుకు? " ఆమె కంఠం మృదువు గానే ఉంది. అతన్ని కాదనలేని బలహీన తేదో తనలో ప్రవేశించినట్లనిపించింది.

ఆమెకేం చెప్పాలో తెలియనట్లు అతను తడబడి, నీళ్లు నమలసాగాడు.

అతనిమీద జాలిపడుతున్నట్లుందామె మళ్లీ. "నాలాటి వేశ్యతో శృంగారంకాక మరేం పనుంటుంది? "

"ఉంది... నాకుంది. నిజంగా ఉంది. మీకంతా ఇప్పుడే ఇక్కడే చెప్పే వ్యవధిలేదు. వీలుకాగానే మీకంతా చెబుతాను. ప్లీజ్... నన్ను నమ్మి నాతోరండి. అక్కడ మీకిష్టం లేనిదేమీ జరగదు. మీ అభీష్టానికి వ్యతిరే కంగా ఏమీ జరగదు. మీ ఇష్టయిష్టాలకి, గౌరవానికీ, భద్రతకీ అతీతంగా ఏ ముప్పూ వాటిల్లదు. ఇప్పటికే ఆలస్యమయింది. మీకు నా మీద నమ్మకం లేకపోతే ఎవరి నేనా తోడుగా తీసుకురండి. ఇద్దర్నీ కారులో తీసుకెళ్తాను. కారులో తీసుకొచ్చి దింపు తాను. మీ పూచీ అంతా నాదే. వెంటనే బయలుదేరండి, ప్లీజ్ దయచేసి మీరొకటి తెలుసుకోండి"

"ఏమిటి? "

"మీరాలస్యంచేసే ప్రతి నిముషమూ కొన్ని వందల వేల మంది నిరీక్షణకు హేతువౌతుంది" ఆమె నమ్మలేకపోయింది. తన కోసం అంతమంది ఎదురు చూడ డమా! నిజమేనా?

"మీరు నన్నెవరో అనుకుని పొరపాటుప డడంలేదుకదా? " సందేహాన్ని నివృత్తి చేసు కుంటున్నట్లడిగింది.

"లేదు... నేనెంత మాత్రమూ పొరబడ డంలేదు"

కానీ మీ మాటలు నాకర్థం కావడంలేదే! ఏమిటో అయోమయంగా ఉందే!"

"మీరు బయలుదేరితే అన్నీ అర్థమౌ తాయి. మాడమ్.. అంత మందిని నిరీక్ష ణకు గురిచేయడం మీకు భావ్యంకాదేమో" అతని కంఠంలో ప్రార్థన.. మాయా జాలం... మత్తు. ఇక కాదనలేకపోయిం దామె.

అతని ధోరణికి ఆశ్చర్యపడుతూనే "నా అవతారం చూస్తున్నారుగా? స్నానం చేసి బట్టలు మార్చుకుని వస్తాను"

"అవన్నీ అక్కడే చెయ్యొచ్చు. అన్నిటికీ ఏర్పాట్లున్నాయి. కారులోనే కనుక మీరెవరి కంటా పడరు ప్లీజ్ తొందరగా బయలుదే రండి"

మగవాడి తత్వం పసికట్టడం వేశ్యకి వెన్నతో పెట్టిన విద్య. ఆమె మనసుకతను వంచకుడూ, దుర్మార్గుడూ అనిపించలేదు. ఎక్కడికో ఎందుకో చెప్పకపోవడం ఆమెలో కుతూహలాన్ని రేపింది. స్తబ్దత నిండిన బతుకులో థ్రిల్ కలిగించడానికే వచ్చిం దేమో ఇలాంటి అవకాశం? స్త్రీకి రెండే రెండు భయాలు. మానమూ, ప్రాణమూ. తానెలాగూ చెడినదే కనుక మాన భయం లేదు. ప్రాణభయమా దాని గురించి ఆలో చించడం మరీ అనవసరం. బతికుండి సాధించేదేముంది? చచ్చిపోడంవల్ల నష్టమే

మొస్తుంది? తన కోసం నిరీక్షించే ఆ వంద లమందీ వేలమంది ఎవరు? వారి నిరీక్షణ ఎందుకు? అసలీ వేణుమాధవ్ ఎవరు? అతనెందుకిలా తనతో రమ్మని ప్రాధేయప డుతున్నాడు.

"అమ్మా!"

పిలిచిందే తడవుగా మాణిక్యం పరుగెత్తు కొచ్చింది.

"నేను వీరితో వెళ్తున్నాను"

ఆ మాటతో మాణిక్యం ముఖంలో ఎంతో సంబరం.

"ఒంటరిగా వెళ్తావా? "

"మరేమీ ఫరవాలేదు. పది గంటలకొచ్చే స్తాను. ఆలస్యమయినా కంగారుపడకు. నాలాటిదానికి కొత్తగా జరిగే అపాయాలూ అనర్థాలూ ఏమీ ఉండవు" అని నవ్వి అతని వేపు తిరిగి "పదండి" అంది.

"మీకు తోడు"

"మీ మాటలమీదా మీ మీదా విశ్వాసమే"

"థాంక్స్! థాంక్యు వెరీమచ్"

అతను మాణిక్యానికి ఓ వందనోటందించి కదిలాడు.

కారులో కూర్చున్నాక కూడా మళ్ళీ కృతజ్ఞ తలు తెలిపాడతనామెకు.

కారు బయలుదేరింది. పెద్ద రోడ్డుకి రాగానే వేగం పుంజుకుంది. ఆమెలో కారు కంటే వేగంగా పరుగెడుతున్న ఆలోచనలూ, అనుమానాలూ... అతను మాత్రం దృష్టినం తటినీ రోడ్డుమీద నిలిపి కారుని పరుగెత్తిస్తు న్నాడు మౌనంగా.

ఇందాకా అలా అన్ని మాటలు మాట్లా డిన మనిషేనా ఇతను? తనకయితే అతన్ని చాలా విషయాలడగాలని ఉంది. కానీ ఈ మౌన గంభీరముద్రుడితో మాట్లాడ్డం ఎలా? ఒక్కసారతనామెకర్థమై పోయినట్లని పించాడు.

స్త్రీ పురుష ఆకర్షణా సంబంధాలీమధ్య వెర్రి తలలు వేస్తున్నాయి. వాటిలో ఒకటి ఆంటీ కల్చర్. తనకంటే పెద్దదీ ప్రౌఢ అయిన స్త్రీమీద యువకులు మోజు పడటం అది. తాత్కాలికంగా ఆంటీ లవ్ ఫ్యాషన యింది. అమెరికాలో పుట్టే నాగరికత మరో పాతికేళ్లకి కాని బొంబాయికి రాదట. అలాగ ఆ ఫ్యాషన్ ఇతని వద్దకొచ్చేసరికి ఇంతాలస్యమై ఉంటుంది. వయసులో కాక పోయినా అనుభవంలో తను ఆంటీయే కనుక ఇతను మోజుపడి తనని వెదు క్కుంటూ వచ్చుంటాడు. అక్కడే ఆ విషయం చెప్పేందుకు సిగ్గేసి ఉంటుంది. అందుకని ఇలా తీసుకొస్తున్నాడు. వందల మంది వేలమందీ నిరీక్షించడం వగైరా కబుర్లు తనని ఆలోచించనివ్వకుండానూ, కాదననివ్వకుండానూ ఊదరగొట్టేసేందుక ల్లిన అందమయిన అబద్ధమే. తనలో ఇంకా స్త్రీత్వమూ ఆకర్షణా ఉన్నాయి. సన్నజాజిలా సుకుమారంగా ఉండే తను వయసు, వృత్తి వల్ల బొండుమల్లెలా అభివృద్ధి చెందింది. అయినా తన గుండ్రని సౌందర్యంలో మగ వాడిని ఆకట్టుకోగలిగే శక్తి పూర్తిగా అంత రించపోనూలేదు. అస్తమించనూ లేదు. అద్దమే అందుకు తార్కాణం.

హటాత్తుగా ఆమెకు ఒక విటుడు గుర్తు కొచ్చాడు.

అతను తనకంటే చిన్నవాడు. వీధి గుమ్మాల ముందు తనకంటే చిన్నవాళ్లెం దరో కాపుకాచి అతన్ని ఆహ్వానిస్తున్నా వారందరినీ కాదని తన దగ్గరకే వచ్చేవాడు తరచుగా. అది తనకి చిత్రమనిపించి ఒక సారడిగేసింది.

"నేను మీకంటే వయసులో పెద్దదాన్నని మీకు తెలుసా? "

"తెలుసు"

"మరెందుకూ నా దగ్గరకొస్తారు. చిన్నవాళ్లెందరో ఉండగా? "

"అందుకే"

"అంటే? "

"నాకు కావాల్సింది అదే. నిజమయిన సౌందర్యమంటే ఏమిటో నీకు తెలుసు"

"నిజమయిన సౌందర్యమూ నిజంకాని సౌందర్యమూ ఉంటాయా? "

"ఇప్పుడు సౌందర్యవతి అయిన స్త్రీ అంటే సన్నగా స్లిమ్‌గా ఉండేది అనేగదా!"

"ఔను, అందుకే చాలామంది అమ్మాయిలు సన్నబడాలని డైటింగ్ చేస్తుంటారట"

"కానీ నిజమయిన అందం వాళ్లలో ఉండదు. డైటింగ్ పేరుతో కడుపు కట్టుకునే ఎముకల గూడుల్లో మనిషీ కనిపించకపోగా సౌందర్యం కూడానా? సన్నగా పుల్లల్లా ఉండే స్త్రీలో సౌందర్యము కనిపిస్తుందా? మెడకింది ఎముక కనిపిస్తే అందమనుకోడమూ, సన్నంగా ఉంటే సౌందర్యమని భ్రమపడడమూ పాశ్చాత్య దేశాలనుంచి తెచ్చుకున్న అరువు ఫ్యాషన్లూ, అరువు భావాలూ" సీరియస్‌గా చెప్పాడతను.

తను శ్రద్ధగా వింటూంది.

"అసలు స్త్రీ అంటే ప్రకృతి. ప్రకృతికి ప్రతిరూపం ఔనా? "

"ఊఁ" అంది ఏమనాలో తోచక.

"ప్రకృతంటే శిఖరాలూ లోయలూ ఔనా? "

"ఊఁ"

"స్త్రీ గుండెలూ, బొడ్డూ, పిరుదులూ ఆ శిఖరాలూ లోయలే"

"చెప్పక్కర్లేదు తెలుసు"

"అలాంటి అందమైన శిఖరాలూ లోయలూ మైదానాలూ కలిగి ఉండడం రివటలకెలా సాధ్యమౌతుంది? ముద్దబంతి పువ్వులా ఉంటేనే సకల సౌందర్యాలకీ కాణాచికావొచ్చు సన్నపాటి అమ్మాయిని ముద్దు పెట్టుకోవాలన్నా, కౌగలించుకోవాలన్నా టీబీ పేషంటుతో శృంగారంలాగే అనిపిస్తుంది నాకు. నిండుదనం తనకీ ఎదుటి వాళ్లకీ కూడా సౌందర్యపరంగానూ శృంగారపరంగానూ కూడా తుష్టినిస్తుంది మరి"



ఐదు నక్షత్రాల్లాగ ఆకాశం ముక్కయితే

స్వర్గం గదులుగా మారి భువినుండి దివికి దిగివచ్చేదే అయితే హెవెన్ అనే ఐదు నక్షత్రాల హోటల్లోని ఆ గది స్వర్గమే. అసలే ఫైవ్‌స్టార్ హోటల్! ఆపైన ఆ గదికి అదనంగా ప్రత్యేక సదుపాయాలూ, అలంకరణలూ చేర్చి అత్యద్భుతంగా రూపొందించారు. వాళ్లిద్దరూ గదిలోకి రావడంతోనే,

"అది బాత్‌రూమ్... మీరు స్నానం చేసి వస్తే" అన్నాడతను సున్నితంగా.

నిజానికిది ఒక గదికాదు. రెండు గదుల సూట్. ఆ గదులకు తూర్పున సముద్రం

కనపడేలా కిటికీ, బాల్కనీ, ఓ పక్క సిటౌట్.

మాధవి బాత్‌రూమ్‌లోకి నడిచింది. మునుపు ఓసారి చూడబట్టి కానీ అదే మొదటి సారైతే ఆ బాత్‌రూమ్‌ని చూసి భయమూ, కంగారూ, అనుమానమూ వేసేవి. అంత ఖరీదుగా గొప్పగా హంగుగా ఉందది. ఒక వేపున బాత్‌టబ్. పాల రాతిలా ఉంది. స్నానం చేసే వారికందుబాటులో లోషన్లూ, లిక్విడ్‌లూ, షాంపూలూ, సబ్బులూ. వేడినీళ్లవీ చన్నీళ్లవీ కొళాయిలు. షవర్‌కిందా, టబ్‌లోనా అని ఒక్కక్షణం ఆలోచించి షవర్‌కిందే నిలుచుంది.

స్నానం చేస్తూంటే జ్ఞాపకం...

పూర్వాశ్రమంలో ఒక విటుడొచ్చేవాడు. విచిత్రవ్యక్తి. అతనెంత రాత్రి వొచ్చినా స్నానం చెయ్యవలసిందే. తలస్నానం చేస్తున్న స్త్రీని చూస్తే తప్ప అతనిలో శృంగార భావాలు కలగవట. స్నాన సుందరితోనే తప్ప సంయోగం జరపబుద్ధి కాదట. అందుచేత అతనితో పడకంటే స్నానమూ, పడకగదంటే స్నానాలగదీ. డబ్బు మస్తుగా ఇచ్చేవాడు కనుక ఆ డబ్బుకోసం అతనితో సరిగంగస్నానాలు తప్పవు. ఆ జలకాలాటల కోసమే అతనిలాంటి నక్షత్రాల హోటల్లో గది తీసుకునేవాడు. స్విమ్మింగ్‌పూల్ కూడా ఉండే హోటలులోనే రూము. ఎంత చలికాలమయినా ఎంత రాత్రయినా అతనితో గడపాలంటే స్నానమే. ఏవేవో పేర్లు పెట్టి పిలిచేవాడు. సినిమాల ప్రభావమయ్యుంటుందలాటి జలశృంగారాభిరుచికి. నిజానికి ఎవరి జీవనవిధానంవారిదీ, ఎవరి శృంగార పద్ధతులు వారివి. శృంగారంలో కూడా వ్యక్తిత్వం నిలుపుకోవచ్చు కాని కాలమూ, మనుషులూ, విలువలూ, వ్యక్తిత్వాలూ అన్నీ సినిమా వాహినిలో పూచిక పుల్లల్లా కొట్టుకుపోతున్నాయి. చాలామందికి జీవితమంటే వెండితెరని అనుకరించడమే అయిపోతూంది.

ఆలోచనలలా సాగుతున్నా స్నానం కూడా వేగంగానే సాగింది. అతను తొందర పడుతున్నాడని అలా ముగించేసింది కానీ వ్యవధుంటే మరికొంతసేపు స్నానసౌఖ్యం అనుభవించేదే. తను స్నానం చేస్తుండగా అతను వచ్చి అలనాటి విటుడిలా ఆక్రమించుకుంటాడేమో అని అనుమానమొచ్చింది. ఇతనూ ఆ బాపతేనేమో అందుకే ఇలా స్నానం సీను ఏర్పాటు చేశాడేమో అనుకుంది. కాని అతను ఇంతవరకూ ఇటు రాలేదు. వచ్చే జాడకూడా కనిపించకపోడంతో ఆమె స్నానం ముగించేసి టవలందుకుంది. మెత్తని టర్కీ టవలు., అదే పీల్చుకుంటూంది తడిని.

ఇలాంటి స్నానం చేసి మళ్లీ ఆ మైలగుడ్డలు కట్టుకోవాలా. అనుకుంటూ చూసేసరికి ఎదురుగా హేంగర్లకి మెరిసిపోతున్న రెండు పట్టుచీరెలు, మ్యాచింగ్ జాకెట్లు... దుస్తులు.

ఆశ్చర్యపోయిందామె. ఆ చీరెలను భుజం మీద వేసుకుని పైటంచూ, రంగూ, నాణ్యమూ చూసింది. అవి తక్కువ ఖరీదు వేంకావు. విలువైనవి, కలవారింటి స్త్రీలో, కోవెలలో దేవతలో మాత్రమే ధరించేంత ఖరీదైనవి.

తను పట్టుచీరలు కట్టుకోగలగడం!

మెదడనే జ్ఞాపకాల పుట్ట మళ్లీ రేగింది. ఆమె మనసు వశం తప్పి గతంలోకి జారింది.

తన విటశేఖరులలో ఓ పూజారుండేవాడు. ఆ గుడిదేముడు చాలా ప్రసిద్ధి చెందిన వాడవడంతో ఆ కోవెలకు వచ్చే రాబడి ఎక్కువగా ఉండేది. ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ కూడా. అలా వచ్చేవాటిలో పట్టుచీరెలూ, జాకెట్టు గుడ్డలూ కూడా నట! కోవెలలో స్వామికి నైవేద్యంగా నెయ్యికారే

చక్రపొంగలి, జీడిపప్పు నిండిన పులిహోర, వెన్న మీగడల పెరుగుతో చేసిన దద్ధోజనం. పూజారి భార్య అవి తెగతిని అడ్డంగా అభివృద్ధి చెంది ద్వారాలు పట్టకుండా తయారయి వుంటుంది. పూజారి గారికేమో బంగారు శలాకలా సన్నగా ఉండే స్త్రీ సన్నిధిలో తప్ప శృంగారం ప్రకోపించదట. అతని శృంగార తత్వం ఎంత చిత్రమైనదో! అతనే చెప్పాడు.

"నేను పగలంతా ఉండేది గుడిలో నా జీవితంలో రోజులో అధిక భాగం గడిచేదక్కడే. కోవెలలో ఎలా ఉంటుందని? స్థంభాలని చూడబోతే శిల్ప సుందరులు. సన్నని నాజూకయిన సుందరమయిన స్త్రీ శిల్పాలు, గుడిలో అగరొత్తుల ధూపం సువాసనలు, పూల పరిమళాలు, వచ్చే భక్తురాళ్లు ఎక్కువ మంది కట్టుకునేవి పట్టుచీరెలే. ఇక దేవి. దేముడి పక్కన ఆ దేవి ఎంత అందంగా ఉంటుందీ! చక్కని విగ్రహం... పట్టుచీర... అలంకరణలు. నేనెక్కువగా చూసేది అలాటి స్త్రీలనే శిల్పాలలోకాని, సజీవంగా కాని. అందుచేత నా మనసుకి స్త్రీ అంటే పట్టుచీరలో ఉండేదే. అలాటి స్త్రీనే నా మనసు శృంగారానికంగీకరిస్తుంది"

అందుకే అతనొచ్చినప్పుడల్లా పట్టుచీర పట్టుకొచ్చేవాడు. ఖరీదయిన పట్టుచీర. పడకగదిలో ధూపమేసి అగరొత్తులు వెలిగించమనేవాడు. పడకగదిని గర్భగుడిలా.. తనని పట్టుచీరె, అలంకరణలలో దేవతలా తయారు చేయమనేవాడు. మాణిక్యం మరీనూ పెద్ద బొట్టు, కాటుక పెట్టి, గంధం పూసి నిజంగా గుడిలో దేవతలాగే తయారుచేసేది తనని. అతనొచ్చాడంటే పట్టుచీరొచ్చిందనే. పూజారి తలుచుకుంటే పట్టుచీరలకు కొదవా? ఆయనొచ్చినప్పుడల్లా పట్టుచీరా, ప్రసాదాలూ, అగరొత్తులూ, కర్పూరం, పూజాద్రవ్యాలూ, పూలు, పళ్లూ.

ఇతనిది కూడా ఆ పూజారి తరహా ఏమో. పట్టుచీర కట్టినది తప్ప స్త్రీగా అనిపించదేమో.

ఆలోచనలనుంచి బయటపడిన మాధవి ఎదురుగా కనిపిస్తున్న స్త్రీమూర్తిని చూసి, ఒక్కసారి తుళ్లిపడింది. చేతులు జోడించి "నమస్కారం" అంది. తలంటుజుత్తు. ఒదులుగా జడవేసి పూలు, కుంకుమ బొట్టు, గాజులు, మెడలో ముత్యాలదండ, హుందాగా, గౌరవంగా చూడగానే నమస్కరించాలన్నట్లుంది.

ఆమె కూడా తనకి నమస్కరించింది. కాని నోరువిప్పి "నమస్కారం" చెప్పలేదు.

అప్పటికామె స్పృహలోకి వచ్చింది.

ఇక్కడ అద్దం ఉందా! తను బింబమూ ఆమె ప్రతిబింబమూ అన్నమాట! ఎంతగా రడీ చేసిందీ ఉండీలేనట్లగుపించే ఈ ఖరీదైన అద్దం! తన తయారీ పూర్తయిందన్నమాట. ఆమె తలుపు తోసుకుని గదిలోకి నడిచింది.

అతనామెకోసమే ఎదురు చూస్తున్నట్లు అటే చూస్తున్నాడు. ఆమెని చూడగానే "సరస్సులో అప్పుడే వికసించిన పద్మంలా ఉన్నారు!" అన్నాడు అభినందిస్తున్నట్లే.

"నేను వాడిపోయిన పద్మాన్ని. పవిత్రని కాదు, పడుపుకత్తెను. మరచిపోకండి"

అతని ముఖం ఒక్కసారి కళావిహీనమయింది. అంతలోనే కోలుకుని "మీరు టిఫిన్ తీసుకుందురుగాని" అన్నాడు.

బల్లమీద టోపీల లాటి గుడ్డమూతల కింద ఫలహారాలూ పానీయాలూ.

"మీరో? " అందామె ఆ బల్లముందున్న కుర్చీలలో ఒకదానిలో కూర్చుని.

"నేనిప్పుడేమీ తినకూడదు. మీరు తీసుకోండి. మీకు తోడుగా నేను పాలు తీసుకుంటాను"

"అలా అయితే నాకూ మానేస్తే సరిపో

యేది"

"మీరంతవరకూ ఆకలితో ఉండలేరు"

"ఎంతవరకూ? "

"సుమారు తొమ్మిది వరకూ"

ఆమె కాఫీ తీసుకుంటూంటే అతను పాలు తీసుకున్నాడు. ఆ పాలనుంచి ఏలకులూ, లవంగాలూ, మిరియాలూ, పచ్చకర్పూరం, కుంకుమ పువ్వు వంటి సుగంధ ద్రవ్యాలు కలగలసిన పరిమళం! శోభనపు పెళ్లి కొడుకులా ప్రత్యేకమయిన పాలు తాగుతున్నాడే! ఎవరితో అతని శోభనం? తనతోనేనా? అదే అయితే అతనికంటే అమాయకుడూ మూర్ఖుడూ అరసికుడూ మరొకరుండరు. సౌందర్యపు మిసమిసలూ యౌవనపు బుసబుసలూ అస్తమిస్తున్న ఈ వాడిపోతున్న పువ్వుతో శోభనం జరుపుకునే వాడు వెర్రివాడుకాక మరేమౌతాడు?

అప్పటికే అతను టేబులు మీద టెలిఫోనెత్తి ఎవరితోనో మాట్లాడాడు. ఐదు నిముషాలయినా కాకుండానే ఒకామెవచ్చింది గదిలోకి "సర్" అంటూ.

ఆమెకు పంథొమ్మిదేళ్లయినా ఉంటాయో ఉండవో. అందంగా, లేతగా, సన్నజాజి మొగ్గలా సుకుమారంగా ఉంది.

"నేను చెప్పింది వీరిగురించే. మాధవి వీరే" అతను పరిచయంచేశాడు.

"నమస్తే మాడమ్. నా పేరు మంజుల. మీరు దయచేసి నాతో రాగలరా? "

ఎంతో మృదువుగా గౌరవంగా అడిగిందామె.

"అలాగే" అంది అతన్నే చూస్తున్న ఆమె. సిల్కులాల్చీ.. పైజమా, మెడలో సన్నని బంగారు గొలుసు. చక్కగా దువ్విన వొంకుల జుత్తు. పచ్చని వొళ్ళు, చేతికి వాచీ. ఎంతో అందంగా ఉన్నాడు. యౌవనంతో మిసమిసలాడుతున్నాడు. ఆ వేషం కళాకారుడిని తలపిస్తోంది. అతనిమీంచి దృష్టి మరల్చుకోడం కష్టంగా ఉంది. పెళ్ళి కొడుకు కంటే అందంగా ఉన్నాడు ఇంత అందగాడూ యువకుడూ తనకోసం వెంపరలాడడమేమిటి?

"మీరీమెతో వొస్తారు కదూ" కళ్ళతో కూడా అర్థించి అతను వేగంగా గదిలోంచి వెళ్ళిపోయాడు.

ఎక్కడికి? ఎందుకు? అనే ప్రశ్నలామె గొంతులోనే ఆగిపోవలసి వచ్చింది.

ఆమెకీ గమ్యమూ ధ్యేయమూ తెలియని అంచెలంచెల ప్రయాణాలు ఆశ్చర్యమూ చికాకూ కూడా వేస్తున్నాయి. అయినా ఆమె అవేవీ బయటపడనివ్వడంలేదు. స్తబ్దంగా సాగుతున్న తన జీవితంలోకి ఈ అనుభవం ఎందుకొస్తోందో? ఒక కుదుపునీ, ఉత్సాహాన్నీ యిచ్చేందుకేనేమో. జరుగుతున్నదంతా తన మేరకు అనూహ్యామే. ఇందుకే అన్నారేమో 'ఏ నిముషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు' అని. జీవితం ఎదురు నిలుపుతున్న ఈ అనుభవాన్ని ఆనందించడమే మంచిది. చేయగలిగిందీ చేయవలసిందీ అంతే. జరిగే సంఘటనలకు సాక్షీభూతంగా నిలుస్తుందంతే. మనసా! నువ్వు కల్లుతాగి నిప్పుతొక్కిన కోతిలా మాటిమాటికీ గంతులు వెయ్యకు. నిన్ను బంధించి నిలపడం మహామహులకి కూడా అసాధ్యమే అని గీతలో కృష్ణపరమాత్ముడే చెప్పాడు. నేనెంతటిదాన్ని? జరగబోయే తమాషాని చూడడానికే నిశ్చయించుకుంటాను" అనుకుందామె.

మాధవిని మంజుల తోవచూపుతూ లిఫ్ట్ వద్దకు తీసుకొచ్చింది.

కిందకి దిగి ఆవరణలోకి రాగానే వారికోసమే సిద్ధంగా ఉన్న కారు వారినెక్కించుకుని వేగంగా పరుగెత్తసాగింది.

అలా అయిదు నిముషాలు వెళ్లగానే ట్రాఫిక్ జామ్ అంటూ ఆపేశాడు డ్రైవర్.

"ఓ పావుగంట పడుతుందేమో క్లియరవ డానికి" అంది మంజుల. ఆశ్చర్యంగా అడి గింది మాధవి. "ట్రాఫిక్ జామా! అంత పెద్దదయిపోయిందా వూరు? "

"సిరబ్బకపోయినా చీడబ్బుతుందని సౌక ర్యాలు రావుకానీ అనర్థాలు ముందొచ్చే స్థాయి పట్నాలకి" అంటూ,

"వాళ్ళు ఎదురుచూస్తుంటారేమో. అయినా ఈ యిరుకుతోవలో ఎందుకు తీసుకొచ్చావు? " మంజుల విసుక్కుంది డ్రైవ ర్‌మీద.

"పుణ్యానికి పోతే పాపమెదురయిం దమ్మా! దగ్గర తోవకదా తొందరగా పోగల మనుకున్నాను"

"ఎప్పుడేనా అడ్డదార్లు అడ్డదార్లే. రాజమా ర్గాలు రాజమార్గాలే"

"ఇకనుంచి మీ సలహాయే పాటిస్తాను" చిన్నపిల్ల తనకి చెప్పడమేమిటి, గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్లనుకున్నాడేమో డ్రైవరు. వ్యంగ్యంగా అంటున్నాడో, మామూలుగా అంటున్నాడో తెలియనివ్వకుండా అన్నాడా మాట!

మాధవి మౌనంగా ఉండిపోయింది.

"మాడమ్, మీరూ వేణుమాధవ్‌గారూ..."

ఎలాంటి సంబంధమని అడుగుతున్న ట్లుంది మంజుల.

ఆమె ఏమీ చెప్పలేదు. తెలిస్తే కదా చెప్పేందుకేనా?

ఇంతలో కారు కదిలింది.

★ ★ ★

ఐశ్వర్యవంతులు శుభకార్యాలను ఆడంబ రంగా జరుపుకుందుకనువయిన కళ్యాణమం డపమది.

రెండువేల మందివరకూ పట్టే విశాలమ యిన హాలు. దానికి తగిన కుర్చీలూ, ఫ్యాన్లూ, దీపాలూ, అలంకరణలూ.

అక్కడ జరగడమే ఏ ఫంక్షనుకయినా ప్రిస్టేజ్.

వేదికమీద మహారాజుల సింహాసనా ల్లాంటి కుర్చీలు, వాటిముందు వాటి పొడ వునా అందమైన గుడ్డ పరుచుకున్న బల్ల. దానిమీద మైకులూ, గాజు గ్లాసులూ, మిన రల్ వాటర్ బాటిల్సూ, కుర్చీలలో మను షులు. వేదికకి కుడిపక్కన మామూలు కుర్చీలు. ప్రత్యేకంగా విడిగానూ, వాటిలో రకరకాల వాళ్ళు.

మాధవిని ఆ వరసలోనే విడిగా ఉన్న కుర్చీలో కూర్చోబెట్టి వెళ్ళింది మంజుల.

వేదికకి ఎడమవేపు 'ప్రెస్' అనే బోర్డు. అక్కడి కుర్చీలో పత్రికలవాళ్ళు. వేదికకెదు రుగా ప్రేక్షకులు. వేదికమీది కుర్చీలలో మధ్యదానిలో ఓ పెద్దమనిషి. పెద్దబొజ్జ, రూపాయి కాసుల బస్తాలా ఉంది. అతను ఆ సభాకార్యక్రమ భారాన్ని వహిస్తున్నట్లు అతి గంభీరంగా ఉన్నాడు. అతనిపక్కనే వేణు. ఆ అందగాడు చుక్కల్లో చంద్రుడిలా మెరిసిపోతున్నాడు. మాధవి వచ్చేటప్పటికే కొంత కార్యక్రమం ఐనట్లుంది. "ఇప్పుడు ప్రముఖ సినీ గాయకులు వేణుమాధవ్ మాట్లాడతారు" అన్నాడు అధ్యక్షుడు. అలా ఏకవచన ప్రయోగం చేయడంవలన తన గొప్పతనం పెరుగుతుందనుకున్నాడేమో ఆయన.

మాధవికి ఒక్కసారి కుదిపినట్లయింది. వేణుమాధవ్ సినిమా గాయకుడా! సినిమా వాడు కావడం వల్లనే యింత హడావిడీ, ఆర్భాటమూ అయివుంటాయి. ప్రజలకి సిని మావాళ్లంటే వెర్రీ, పిచ్చీ తెరవేలుపులనారా ధిస్తారు. బ్రహ్మరథం పడతారు. అటు నుండి నిజం దేవుడూ, యిటునుండి సినిమా హీరో వస్తే ఎక్కువమంది ప్రజలు సినీ హీరో వేపే పరుగెడతారు. ఆఖరికి

సినిమాలకి లైట్‌బాయ్‌గా పనిచేసేవాడు వచ్చినా చాలు. అతనిచుట్టూ మూగేవారే. సినిమా అన్న పదానికే అంత గ్లామరూ ప్రభావమూ. అదిసరే... సినిమా పక్షయిన వేణుమాధవ్ తనని వెతుక్కుంటూ ఎందుకొచ్చినట్టు? వేషం వెయ్యమని అడగడానికా? హీరోయిన్ వేషమెలాగూ యివ్వరు. తనలాటిదాన్ని హీరోయిన్‌గా రానివ్వరు. అక్కవేషమో, అమ్మవేషమో కోసమా? ఆ వేషంలో తను పెద్దరికంతో కనపడుతుందో లేదో చూడాలనా పట్టుచీర కట్టించాడు? సినిమావాళ్ళకెంతసేపూ హీరో, హీరోయిన్లే ప్రధానంకానీ పక్కపాత్రలగురించి పెద్ద పట్టింపుండదే. సినిమావాళ్ళేం చేస్తే చెల్లదు? ఈ వేణుమాధవ్ గాయకుడే కాక సినిమాల్లో వాటాలు కూడా తీసుకుంటాడేమో? తన ఏ విటుడో అతని ఫ్రండయి ఉంటాడు. అభిమానం కొద్దీ తన గురించి చెప్పి అడ్రసిచ్చి ఉంటాడు. అందుకే వెదుక్కుంటూ వచ్చాడేమో. కానీ తను యిప్పుడు సినిమా వేషాలకి సిద్ధంగా ఉందా? జీవితమే విసుగూ, విరక్తీ, వైరాగ్యమూ కొల్పుతూందే, సినిమా తనని ఆకర్షించగలదా? ఆకట్టుకోగలదా? జీవితమే ఒక భ్రమయితే సినిమా ఆ భ్రమలో మరో భ్రమ. తెరమీద కదిలేవి వెలుగునీడలు. మనుషులు కారు. వారి నీడలు, ఆ కష్టసుఖాలూ, కథలూ, మాటలూ, పాటలూ... అన్నీ కల్పనలే తప్ప నిజంకావు. వెలుగునీడలనీ, కల్పనలనీ, నిజమని ఆత్మవంచన చేసుకోవడమే కాదూ సినిమా అంటే? ఇప్పుడు టూ లేట్. జీవితం తెలియని రోజుల్లో ఐతే సినిమా వెంట పరుగెత్తి ఉండేదేమో? ఇప్పుడు ఆసక్తి లేదు. అసలు జీవితంమీదే అట్టే ఆసక్తిలేదు.

"ప్రేక్షక మహాశయులారా! ఈవేళ ఎంతో సుదినం. మన వేణుమాధవ్‌కి ఈ సన్మానం ఎందుకంటే అతను సినిమాలలో ఇప్పటికి ఏభై ఎనిమిది పాటలు పాడాడు. మళయాళం, తమిళం, తెలుగు... మూడుభాషల గాయకుడు మన వేణు. కృషితో నాస్తి దుర్భిక్షం అనే దానికి నిదర్శనం మన మాధవ్. ఈ వర్ధమాన కళాకారుడు మన వూరి పేరు ప్రతిష్ఠలని పెంపొందించగలడని నేను సగర్వంగానూ, నిస్సందేహంగానూ చెప్పగలను. ఇతన్ని సన్మానించే భాగ్యం కలగడం నా పూర్వజన్మ పుణ్యం" అని చెప్పి సభాధ్యక్షులు వేణుమాధవ్‌ని ప్రత్యేకాసనంలో కూర్చోబెట్టి శాలువా కప్పి, దండవేసి ఘనంగా సన్మానించారు. స్థానిక కళాకారుల సంఘాలవారూ, సినిమాహాళ్ల వారూ, పూలమాలలు వేసి పుష్పగుచ్ఛాలందించి తమకతనిపట్ల గల అభిమానాన్ని ప్రదర్శించుకున్నారు. కార్యక్రమానికి ఫొటోలూ, వీడియో తీయబడుతున్నాయి. సన్మాన కార్యక్రమం ముగియడంతోనే "ఇప్పుడు వేణుమాధవ్ తనకి జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలుపుతారు." అని ప్రకటించారధ్యక్షులు. అతను మైకందుకుని మాట్లాడసాగాడు. "మీ అభిమానానికి నేను చాలా కృతజ్ఞుడిని. మీ సన్మానాన్ని నేనభినందనగానే స్వీకరిస్తున్నాను. సంగీతం నాతో మొదలవలేదు. నాతో అంతమూ కాదు. సంగీతమనే దివ్యసంపదకు అదృష్టవశాత్తూ నేనూ ఒక వారసుడిని కాగలిగాను. ఇవాళ గానకళను ప్రజలూ, సినిమా రంగమూ పోషిస్తున్నారు. సంగీతానికి భాష అవరోధంకాదు కనుకనే నేనితర భాషల్లో కూడా పాడగలుగుతున్నాను. నేనివాళ ఈమాత్రం ఎదిగానంటే అది ఎందరెందరిదో దయ. నేనీకార్యక్రమానికి అంగీకరించింది నిజానికి ఆ దయామయులకు కృతజ్ఞతలు తెలుపుకునే అవకాశం తీసుకోవాలనే. మొట్టమొదటగా నే చెప్పేది నన్ను తండ్రిలా కాపాడిన అనాధ శరణాలయం యజమాని అనంతరామయ్య గారికి నేనెంతో ఋణపడిఉన్నాను" అంటూ వారికి




పాదాభివందనం గావించాడు.

తరువాత

"అమ్మలేని నన్ను అంత అభిమానం గానూ పెంచిన ఆయా రుణం నేనేం చేసినా తీర్చుకోలేందే. బాలారిష్టాలు దాటి నేను బతికి బట్ట కట్టానంటే అపరమాతృమూర్త యిన ఆయా చలవా ఆశీర్వాదాలూ, దీవె నలే. చంద్రుడికో నూలుపోగులా ఆ అమ్మ కొక చిన్నకానుక" అంటూ ఆమెను కౌగలిం చుకుని పాదాలకు నమస్కరించి పట్టుచీరా, పర్సూ యిచ్చాడు. ఆ వృద్ధురాలెంతో సంతో షించింది. "బిడ్డా!" అంటూ అతన్ని పట్టు కుని ఏడిచేసింది.

"నేనివాళ గాయకుడిని కాగలిగానంటే కారణం సంగీతం మాష్టారు సత్యంగారే. మొక్క మొలవగానే నన్ను వారు సంగీతం వేపు వంచారు. వెదురును వేణువుగా మల చినట్లు, శిలని శిల్పంగా చెక్కినట్లు వారు నన్ను పాటగాడిగా రూపొందించారంటే ఏమాత్రమూ అతిశయోక్తి కాదు. గురు బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః, గురుస్సాక్షాత్ పరబ్రహ్మ... తస్మై శ్రీ గుర వేనమః..." అంటూ వారి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి గురుదక్షిణల ర్పించాడు. అలాగే తన కాశ్రయమిచ్చిన నాయర్‌కీ, అయ్యర్‌కీ కృతజ్ఞతలు తెలిపాడు. ఎవరూలేని తనకి తన బాల్యంలో స్నేహం అందించినందుకంటూ మరికొందరిని సత్క రించాడు. ఇతనికి కృతజ్ఞతా భావన ఎక్కువ అనుకుందామె.

ఇక ఆ వరసలో మిగిలింది తనొక్కతే. ఈ వరుస అతను కృతజ్ఞతలు తెలుపుకోవ లసిన వారినయితే తనూ ఆ వరసలో ఉంది మరి.

ఆమెలో ఉత్కంఠ పెరిగిందొక్కసారి.

అతను ఆమెవేపు చూశాడు. కానీ ఆమెను సమీపించలేదు. "నా కృతజ్ఞతలు తెలుపు కుందుకవకాశమిచ్చిన యీ సభకు ధన్యవా దాలు" అంటూ ఆ పర్వం ముగించేశాడు. వేదికమీద తన కుర్చీలోకి వెళ్ళి కూర్చు న్నాడు.

"కొద్ది నిముషాలలో వేణుమాధవ్ సంగీత విభావరి ప్రారంభమౌతుంది. ప్రేక్ష కులు దయచేసి యీ వ్యవధిని భరించ ప్రార్ధన" అంటూ మైకులో చెప్పారెవరో! వేదికమీదివారందరూ దిగిపోయాక తెరప డింది.

ఎవరో వేణుమాధవ్ వేపు దూసుకొ చ్చారు. "నాపేరు మురళి. సార్ధకనామధే యుణ్ణంటే నమ్మండి. ఫ్లూటు చాలా గొప్పగా వాయిస్తాను. అందెవేసిన చెయ్యన్న మాట. సినిమాల్లో చేరాలని నా కోరిక. నాలాంటివాళ్ళు ప్రతిభావంతులు ఉండవల సింది మీ ఫీల్డులోనే కదా? లోగడ రెండు మూడుసార్లు మద్రాసూ, హైదరాబాదూ వెళ్ళాను. కొందరు సంగీతదర్శకులు నాకు యింటర్వ్యూయే యివ్వలేదు. ఇంటర్వ్యూ యిచ్చినవారు తమ వాద్యబృందంలోకి ఆహ్వానించి చేర్చుకోలేదు. నాలాంటి వాడికే ప్రవేశం లేకపోతోందంటే రంగంలో అంతా రాజకీయమూ, ఆశ్రితపక్షపాతమూ, బంధు ప్రీతి, సిఫార్సులకీ పెద్దపీటని గట్టిగా నమ్మ వలసి వస్తూంది సార్. మీరేమంటారు? "

"ముందు మీ ఆత్మవిశ్వాసానికి నా జోహార్లు. రాజకీయం గట్రా అన్నారే... ఫీల్డులో సిఫార్సులూ అవీ అన్నారే... వాటి విషయంలో నా ఉద్దేశమూ అనుభవమూ మరోలా ఉన్నాయి. కోట్లకొద్దీ పెట్టుబడిపెట్టి లాభార్జన ధ్యేయంతో తీస్తారు కదా? అంతే తప్ప వ్యాళ్ళవాళ్ళని ప్రోత్సహించాలని కాదు కదా వాళ్ళంతంత పెట్టుబడిపెట్టి రిస్కు తీసుకునేది? ప్రజలకు నచ్చుతుందన్న విశ్వా సంలేకపోతే వాళ్ళెంతమాత్రమూ దేనినీ సిని మాలో అంగీకరించరు. అంచేత సినీరంగం ప్రతిభని వదులుకోదనే నా అభిప్రాయం.



నావరకూ వస్తే... రోడ్డుమీద పాడుకునే వాణ్ని పిలిచి తీసుకెళ్ళిందీ రంగం. ముందూవెనకా ఎవరూ ఏమీలేనివాణ్ణికదా నేను? "

"మరి నాలాంటి ప్రతిభాశాలినెందుకు పేక్షి స్తూందీ ఫీల్డు? నష్టపోడంలేదూ? "

"నేననుకోడం ఏమిటంటే ప్రతిభని వెదు క్కుంటూ సినీఫీల్డు వొచ్చేవరకూ ఆగకుండా సినీరంగాన్ని వెదుక్కుంటూ మీరూ, మీ ప్రతిభా వెళ్ళడంవలన చిన్నచూపు చూడబ డ్డారేమో అని" అన్నాడు మాధవ్.

అంతలోనే ఎవరో వచ్చి అతన్ని తీసుకెళ్ళి పోయారు. మాధవి ఒంటరిగా మిగిలిపో డంతో మళ్ళీ ఆలోచనలు. ఇతను ఈ వూరి వాడే అంటున్నాడు. ఎప్పుడేనా తనవద్దకు వచ్చాడేమో గతంలో. అందుకే... పిలుచుకొ చ్చాడేమో. కానీ... చివరిక్షణాలలో వివేకం కలిగి ఉంటుంది. ఒక వేశ్యకి తనలాంటి గొప్పవాడు వేదికమీద... వేలమంది ముందు కృతజ్ఞతలు చెప్పి బయటపడడం బాగుండదని గ్రహించి ఉంటాడు. తన ప్రయత్నం విరమించుకుని ఉంటాడు. ఇత న్నెప్పుడూ చూసిన జ్ఞాపకం లేదే! ఎప్పుడొ చ్చాడూ? "

తన ఆలోచలనకి తనకే నవ్వొచ్చింది. అతన్ని జ్ఞాపకం చేసుకోబోవడం వృధాప్ర యత్నమే. అప్పట్లో తన వాకిలి విటులతో కిటకిటలాడుతూ ఉండి ఉంటుంది. శతకోటి లింగాల్లో యితనొక బోడిలింగం అయివుం టాడు. ఎందరు విటులని గుర్తుంటారు? తను అలాగే తెలిసుంటుందతనికి. కళాకా రుడు కదా. చాలామంది కళాకారులు కామం విషయంలో విపరీతంగా వుంటా రట. అప్పటికి... వచ్చీరాని యౌవనంలో తనంటే కామమో, మోహమో కలిగి ఉంటుందితనికి. అప్పుడు యితను గొప్ప

వాడు కాదు. ప్రత్యేకత కలవాడు కాదు. అంచేత తన గుర్తింపుకి నోచుకుని ఉండడు. ఆ కంఠంలోని విలక్షణతకి, ప్రత్యేకతకీ కారణం గాయకుడు కావడమన్నమాట. మాటలో మాధుర్యముంది. పాట ఎలా వుంటుందో? కొన్ని నిముషాలలో వింటుం దిగా. ఔనూ... అనాథ శరణాలయంనుంచి అమాంతం సినీరంగంలోకి ఎలా ఎగరగలి గాడో? ఆ అల్లిబిల్లి సినీమాయాలోకంలోకి ఎలా ఛేదించుకు వెళ్లాడో? అక్కడెలా జండా పాతగలిగాడో? ...

ఆమె ఆలోచనాలోకం నుంచి యిహలో కంలోకి వచ్చేసరికి అక్కడ చాలామార్పులు చోటుచేసుకున్నాయి. వేదికమీద కుర్చీలూ అవీలేవు. సంగీత సభకి మల్లె తివాచి. వాద్యబృందం... మైకులు... మృదువైన కాంతిని ప్రసరిస్తున్న దీపాలు. హాలులో కూడా ప్రకాశవంతమయిన దీపాలు వెలగ డంలేదిప్పుడు. సూదుల్లా కళ్ళుపొడిచే వెలు గులు కాక సున్నితంగా మెత్తగా అనిపించే కాంతులు. వాతావరణమూ పరిసరాలూ సంగీత రసాస్వాదన కనువుగా ఉండాలని కాబోలు ఆ మార్పులు. ఆ చిన్నమార్పులకే అక్కడ కొత్తలోకం సాక్షాత్కరించినట్లుంది.

సంగీతసభను 'వాతాపి గణపతింభజే.. అంటూ వినాయక ప్రార్థనతో ప్రారంభిం చాడు వేణుమాధవ్. పాట మొదలవడమే మిటి ప్రేక్షకశ్రోతలు నిశ్శబ్దమైపోయారు. ఏదో అదృశ్యమూ మృదులమూ అయిన ప్రవాహం తమని హాయిగా ఎక్కడికో సుదూరాలకి... నవలోకాలకి... మెల్లగా తీసుకువెళుతున్నట్లనిపించసాగింది వారికి. గాయకుడు 'తెరతీయగరాదా' అంటూ త్యాగ రాయకృతి పాడుతూంటే శ్రోతల హృదయా లలోని తెరలు తొలగుతున్నట్లే అనిపిం చింది. మాధవి ఎంత ముగ్ధురాలయిందంటే ఆమెకు గాయకుడు కాక అతనిబదులు త్యాగరాజే గోచరించాడు. అతను మరీ ఛాదస్తంగానూ, శుద్ధశాస్త్రీయంగానూ కృతిని





సాగదీయక, అలాగని ఆధునిక రీతిలోనూ కాక మధ్యేమార్గం ఎన్నుకోడంతో కృతి సుదీర్ఘమూ కాక హ్రస్వమూకాక మధ్యేమార్గంగా సాగి... విసుగు కొల్పకుండా రాణించింది. సంగీత శాస్త్రం తెలియనివారిని కూడా మెప్పించింది. 'కొండలలో నెలకొన్న కోనేటి రాయుడువాడు...' అంటూ అన్నమయ్య కీర్తన ఎత్తుకునేసరికి అది చలనచిత్రంలో విన్న పరిచితమైన గీతం కావడంతో శ్రోతలకి మరింత ఉత్సాహం పెరిగింది. శ్యామ శాస్త్రి కృతి పాడాక ఒక తమిళ పాట పాడాడు. తరువాత ఎస్. రాజేశ్వర్రావ్ పాడిన శైలిలో 'చల్లగాలిలో... యమునాతటిపై శ్యామసుందరునీ మురళీ' అంటూ వేణుమాధవ్ పాడుతుంటే అక్కడ నిజంగా చల్లగాలే వీచింది. ఆ సభాస్థలి యమునాతటిలాగే గోచరించింది శ్రోతలకు. గాయకుడు శ్యామసుందరుడైన వేణుగోపాలుడిలాగే భాసించాడు వారి దృష్టికి.

ఈసారి ఒక మళయాళంపాట... భాష తెలియనివారికి కూడా పాటలోని భావం స్పష్టంగా తెలుస్తూ... దానిలోని కరుణకు వారికి కళ్ళు చెమర్చాయి. సంగీతానికి భాష హద్దు కాజాలదని నిరూపించిందాగానం.

"ముద్దుగారే యశోద ముంగిట ముత్యమువీడు' అంటూ అతను పాడుతూ శ్రీకృష్ణ లీలామృతాన్ని శ్రోతలకు అందించేసరికి వారు ధన్యులమయ్యామని పొంగిపోయారు. 'దోస్త్ దోస్త్ న రహా... ప్యార్ ప్యార్ న రహా' అంటూ హిందీలో పాడి అతను పలికించిన విషాదానికి శ్రోతల కళ్ళు మాత్రమేకాక హృదయాలు కూడా ఆర్ద్రమయ్యాయి. ఆ కంఠంలో కురిసిన విషాదానికి దుఃఖించని మనసూ మనిషీ లేనేలేరక్కడ.

మాధవయితే మరీను. మౌనంగా వెక్కి వెక్కి పడుతూ ఏడిచేసింది. అతను ఆమెకొక అత్యద్భుత యింద్రజాలికుడిలా, మాటల మాంత్రికుడిలా కనిపించాడు. అతని స్వరంలోంచి వెలువడే మాటల వెనుక మంత్రశక్తి వంటిదానికి కారణం అతను గాయకుడు కావడమన్నమాట... అనుకుంది.

ఈసారతను మంగళంపల్లి బాలమురళీకృష్ణ తత్వం- 'ఎక్కడి మానుష జన్మంబెత్తిన ఫలమేమున్నది' అంటూ పాడి శ్రోతల హృదయాల్లో వేదాంతమూ, వైరాగ్యమూ నింపాడు.

శ్రోతలు కోరిన పాటలు మరో రెండు పాడి సభ ముగిస్తూ మంగళం పాడాడు.

"వేణుమాధవ్ గానం అద్భుతంగా రక్తికట్టింది. శ్రోతలను మైమరిపించింది. సంగీతం ఎంత శక్తివంతమయిందో... దానికి భాషాభేదాలెలాలేవో నిరూపించింది. ఇంత చక్కని గాయకుడు మనవూరివాడవడం మన అదృష్టం. ఈ వర్ధమాన గాయకుడికి చక్కని భవిష్యత్ కోరుతున్నాను ప్రేక్షకులందరి తరఫునా..." అంటూ అభినందన సమర్పణతో సభ ముగిసింది. కార్యక్రమం ముగిసినా ఆ సంగీత ఝరి నుంచి బయటకు రాలేకపోతోంది మాధవి. ఆమె వివశురాలై ఉండిపోయింది కుర్చీలో. ఎంతచక్కని కంఠం! ఎంత తీయదనం దానిలో! ఎంత శ్రావ్యత! వేణుమాధవ్ ధన్యజీవి. ఎంతో అదృష్టవంతుడు. పైకి ఏమీ ఎరుగని అమాయకపు అందంతో కనిపించే ఆ మనిషిలో ఎంత సంగీతకళ! అతనిలో ఎంత అమోఘమైన గాయకుడున్నాడూ! ఈవేళ అతను తనకి అపూర్వమయిన వరమే ప్రసాదించాడు. భక్తి, శృంగారం, విషాదం, వైరాగ్యం, చిలిపితనం... ప్రతి భావాన్నీ ఎంత స్పష్టంగా పలికించాడూ తనకంఠంలో! నిజంగా ఘనతే అది. ఇలాంటి సంగీత కచేరికి తనని ఆహ్వానించి ఈ అవకాశం కల్పించినందుకు అతనికెన్ని కృతజ్ఞతలు తెలిపితే సరిపోతుంది?

ఇంత అమూల్యమయిన వరం ప్రసాదించినందుకు వారికేమిస్తే ఋణం తీరుతుంది?

"మాడమ్! మనం వెళ్దామా?" అంటూ వచ్చింది మంజుల.

"వారేరీ? నేను వెళ్ళేముందు వారికి చెప్పాలి... అదే... వారికి చెప్పి వెళ్లాలి"

"మిమ్మల్ని రూముకి తీసుకువెళ్ళమన్నారు. ఆయన కొంచెంసేపట్లో వచ్చేస్తారుట"

"సరే" అంటూ ఆమె వెంటనడిచి కారెక్కింది.

ఆమె యింకా సంగీత మాధుర్యపు మత్తు నుంచి బయటపడినట్లులేదు. ఇప్పుడామెకు మాధవ్ పట్ల భావాలే మారిపోయాయి. ముందులా నిర్లిప్తత, నిస్పృహకాక గౌరవమూ, భక్తీ, శ్రద్ధా ఏర్పడ్డాయి. ఒకరకమయిన అభిమానమూ, ఆరాధనా మొదలయ్యాయి. తేలికభావమూ, చులకనా స్థానంలో ఎంతగొప్పవాడో అనే అభిప్రాయం చోటుచేసుకుంది. ఒకమంచి కళాకారుడు తనకళతో ఎలా ప్రభావితం చేయగలడో మాధవ్ ఆమెనలా స్పందింపచేశాడు. సంగీత రసజ్ఞురాలయిన ఆమె ఆ కచేరీతో అతనిపట్ల పూర్తిగా మారిపోయింది. అంతకుముందు తనతనితో ప్రవర్తించిన విధానానికీ, అతనిమీద ఏర్పరచుకున్న అభిప్రాయానికీ, ఊహించిన ఊహలకి సిగ్గుపడింది. పశ్చాత్తాపపడింది. అపచారం అనుకుంటూ మనసులోనే లెంపలు వేసుకుని తనని తానే మందలించుకుంది.

కారు మెత్తగా పరుగెడుతోంది. రోడ్డు నిర్జనంగానూ నిశ్శబ్దంగానూ ఉంది. ఇంకా తొమ్మిది గంటల రాత్రయినా కాకపోయినా చల్లగాలి హాయిగా ఉంది. మంజుల మౌనంగా ఉండడంతో కారులో నిశ్శబ్దంగా ఉంది. సమయమూ అవకాశమూ చూసి ఆమె మనసు తెలుసుకొండిలా పొడిచింది. "ఇప్పుడు అదే హోటలు రూములో అతను నిన్ను కోరితే?"

"ఛా..."

"అదికాదు. ఈ పట్టుచీరలోనూ, అలంకరణలోనూ నువ్వు తక్కువ అందంగా ఏమీ లేవు. అతను కళాకారుడు. కళాకారుల కామవికారాలు కొంచెం అతీతంగా ఉంటాయికదా?"

"నిజంగా అలా జరిగితే నేను కాదనలేనేమో. నాకు వొద్దనడానికి నోరు పెగలదేమో. సంగీతం నన్ను నిలువునా కౌగలించుకుంటూంటే... గానం పెదవుల్ని ముద్దుపెట్టుకుంటుంటే ఎలా వుంటుందో! కళ వచ్చి తన కౌగిలిలో కరిగిపొమ్మంటే కాదనలేనేమో! కానీ... కానీ వద్దు..."

"ఏమీ?"

"నేను వేశ్యని. ఈ వేణుగానలోలుడు నాలాంటి వేశ్య సంపర్కంతో మలినపడకూడదు. అతని దివ్యసంగీతం నాలాంటి వెలయాలి స్పర్శతో అపవిత్రం కాకూడదు. ఆ విద్వత్తు ఓ వేశ్యవలన కళంకితం కాకూడదు. ఆ అమోఘసంగీతంలో అపశ్రుతి కలవకూడదు. అయినా అలాటి గొప్పవాడు నన్నెందుకు కోరతాడూ?"

"అతను గొప్ప గాయకుడు. ఈరాత్రి హోటలు రూములో నీవూ అతనూ ఒంటరిగాళ్ళు ఈ కార్యక్రమంవలన అతనిలో రేగిన ఉద్వేగం నీ ద్వారా ఉపశాంతిని కోరుకోవచ్చు గదా! అంటే కంపెనీ అన్నమాట"

★ ★ ★

మద్రాసులో ఉన్నప్పుడు సంగతి.

ఆవేళ సాయంత్రం రోజీ అడిగింది. "కంపెనీగా వెళ్తావా? మంచి అవకాశం ఒచ్చింది నీకు. నిజంగా అనుకోని అదృష్టమే నీపాలిట. ఎలాగూ పనేమీ లేదుగా? కాళీ

గానే ఉన్నావాయె. ఓ రాత్రి గడుస్తుంది, డబ్బూ వస్తుంది, అనుభవమూ వస్తుంది"

"కంపెనీ అంటే? " నిజంగానే తెలియదు మాధవికి.

"కాల్ గర్ల్... కంపెనీ... యివన్నీ వేశ్యకి పర్యాయపదాలే. కాకపోతే కాస్త గౌరవమైన పదాలు. డబ్బు బాగా కిడుతుంది. శ్రమతక్కువ ఫలమెక్కువ"

"కంపెనీ అంటే చెప్పలేదు" గుర్తుచేసింది.

"కంపానియన్ అనే ఇంగ్లీషు పదానికి కంపెనీ అనేది పొట్టిపేరూ ముద్దుపేరూ. మనలాటి వాళ్ళని పిలిచేది ఆ కంపెనీగానే. ఈ నగరంలాటి మహానగరాలలో ఎన్నో కంపెనీల హెడ్డాఫీసులుంటాయి. వాటిశాఖలు దేశమంతటా ఉంటాయి. ఈ హెడ్డాఫీసులు సమావేశాలు ఏర్పాటుచేస్తుంటాయి.

వ్యాపారాభివృద్ధి ధ్యేయుంగా ఆ సమావేశాలకి వివిధ ప్రాంతాలనుంచీ ఎగ్జిక్యూటివ్‌లూ మానేజర్లూ హాజరౌతారు. వ్యాపారం బాగా చేసేవారికి పొగడ్తలు... లేనివారికి చీవాట్లు. పగలంతా ఈ మీటింగులతో బోరెత్తి ఉంటారు. అంచేత సాయంత్రం నుంచీ వారికి విశ్రాంతి కావాలి. స్వర్గానికెళ్ళినా సవతి పోరెందుకనుకుంటూ వీళ్ళు భార్యని వెంటపెట్టుకురాకుండా ఒంటరిగా వస్తారు స్వేచ్ఛ అనుభవిద్దామని. చీకటిపడడంతోనే హోటలు రూములో వీరికి విశ్రాంతి. ఆ విశ్రాంతికర్థం తాగుడు... తిండి... స్త్రీ... రూములో ఒక్కడూ ఉండకుండా కంపెనీగా మనలాంటిదుంటుంది"

"అంటే యిదీ వ్యభిచారమేగా? "

"చిన్నవాళ్ళు తింటే చిరుతిండి, పెద్దవాళ్ళు తింటే ఫలహారం... అలాగే గుడిసెల్లోనూ, చవకబారు హోటలు గదుల్లోనూ జరిపితే వ్యభిచారం. ఫైవ్‌స్టార్ హోటళ్లలో చేస్తే కంపెనీ, సామాన్యులు చేస్తే సానివృత్తి. ఖరీదైనవాళ్ళు చేస్తే ఎంజాయ్‌మెంట్. ఈ ఫైవ్‌స్టార్ హోటళ్ళలోని పెద్దవాళ్ళ దగ్గరకి రావడాన్కి పోలీసులకి కూడా హడలే. వాళ్ళిటు చూడనైనా చూడరు. కంపెనీ అంటే కేవలం పడకచేస్తే చాలదు"

"ఇంకా ఏం చెయ్యాలి? "

"అతనానాటి సమావేశంలో చివాట్లు తిని ఉంటే ఆ కోపం ఈ కంపెనీమీద వొంపేస్తాడు. అతని ఆ చిర్రుబుర్రులని చిరునవ్వుతో భరించాలి. అతను తననితాను పొగుడుకుంటూన్నా, తన గురించి గొప్పలు చెప్పుకుంటున్నా నమ్మేస్తున్నట్టు నటిస్తూ అమాయకంగా అభినందిస్తూ అతన్ని ప్రోత్సహించాలి. అతను తాగుదామంటే తోడుగా తాగాలి. కంపెనీ అంటే తందాన తానన్నమాట. సాధారణంగా యీ ఎగ్జిక్యూటివ్స్ నడివయసువారూ, పెద్దవారే అయి ఉంటారు. అంచేత వీళ్ళు సెక్స్ ఎక్కువగా కోరరు. కాకపోతే వాళ్ళ కబుర్లు వినగలగాలి. వాళ్ళకి కబుర్లు చెప్పగలగాలి. అంటే... అతని భాష మనకొచ్చుండాలి. అనేక విషయాలు తెలియాలి. కంపెనీకి కనీసం ఇంగ్లీషైనా చక్కగా వచ్చుండాలి. ఎగ్జిక్యూటివ్స్‌ది హైక్లాస్ కనుక ఆ సమాజపు మానర్సూ, ఎటికేటూ తెలిసీ పాటించగలిగీ ఉండాలి కంపెనీ. ఒక్కముక్కలో చెప్పాలంటే కంపెనీ ఆ ఎగ్జిక్యూటివ్‌కి ఏక్ రాత్‌కీ పత్నీ. భార్యలాగా భరించాలతన్నా రాత్రి. అంచేత కంపెనీ అంటే అత్యంత విధేయురాలయిన భార్య. చెప్పుకిందతేలు. రబ్బరుబొమ్మ. తినమన్నది తినే, తాగమన్నది తాగే, ఆడమన్నట్లు ఆడే మనిషిబొమ్మ. ఏ స్త్రీ అయినా వేశ్య కాగలదు కానీ ఎవరు పడితే వారు కంపెనీకాలేరు. ఓసారయితే నేను కంపెనీగా వెళ్ళిన ఫ్రండ్‌కి రాత్రంతా టైం ప్రకారం మందులు వేశాను తెలుసా? వాళ్ళు మీటింగ్‌లో పొగడ్తలందుకుని ఉంటే ఆ ఆనందం మనమీద చూపి నలిపేస్తారు. వ్యాపారం బాగోలేక వాళ్ళ

క్కడ చివాట్లు తింటే ఆ కోపం మనమీద చూపుతూ మరింత నలిపేస్తారు... కొరికేస్తారు. అయినా భరించాల్సిందే. దూషణ భూషణ తిరస్కారాలకతీతంగా ఉండగలిగేదే మంచికంపెనీ..."

"ఇది వ్యభిచారం కాదంటావ్...? "

"నేనలా అనను. ఈ దేశంలో పేరుకే ప్రజాస్వామ్యం తప్ప ఐశ్వర్యానికీ, గొప్పతనానికీ ఒక న్యాయం, పేదరికానికొక న్యాయమూ. సామాజిక సూత్రాలు కూడా స్టార్ హోటళ్లలోని పర పురుష స్త్రీ సంబంధాలని వ్యభిచారమనడానికి సాహసించవు. నక్షత్రాల హోటల్లో జరిగే వ్యభిచారానికీ నాగరికత అని పేరు. సరేకానీ కంపెనీగా వెళ్తావా? ఇవాళ సరుకు తక్కువా డిమాండెక్కువా కనుక నీలాంటి కొత్తదానివరకూ వచ్చింది ఆఫర్. ఏదో పెద్ద కంపెనీది బోర్డాఫ్ డైరక్టర్స్ మీటింగు కాబోలు"

"నాకు వ్యభిచారం ఇష్టంలేదు" కచ్చితంగా చెప్పేసింది మాధవి.

రోజీ అదోలా నవ్వింది అమాయకురాలా అని కళ్ళతో అంటున్నట్టు.

"నువ్వు సినిమాల్లో ప్రవేశించాలని కదూ ప్రయత్నిస్తున్నావ్? "

"ఔను..."

"గొంగట్లో తింటూ వెంట్రుకలేరుకున్నట్లు సినిమాల్లో చేరాలనుకుంటూ శీలంగురించి చూసుకుంటే ఎలా? "

"...."

"మరోసారాలోచించు. మరోమాటను"

"అనేందుకేమీలేదు. అసలు నాకు తెలుగుతప్ప మరే భాషయినా వస్తేగా? ఇంగ్లీషూ అంతంత మాత్రమే. మాట్లాడ్డం మొదటేరాదు. నేనేం పనికొస్తానూ కంపెనీగా? "



"నిజమేలే" అనేసింది రోజీ. అలా తెలిసింది మొదటిసారిగా కంపెనీ అంటేఏమిటో, ఆమెకుండవలసిన లక్షణాలూ, అర్హతలూ ఏమిటో, ఆమె విధులేమిటో.



వేణుమాధవ్ కూడా అలాటివాడేనేమో! గానం చేయడమే అయినా అలసిపోయుంటాడు గదా శారీరకంగానూ, మానసికంగానూ. అంచేత అతను విశ్రాంతి కోరి తనని కంపెనీగా పిలిచి ఉంటాడలా అని పైకి చెప్పకుండా. ఈ పట్టుచీర, అలంకరణలలో తను ఆకర్షణీయమయిన ఆంటీలా కనిపిస్తుంది. ఆంటీ వెర్రి కూడా తీర్చుకోవొచ్చని తననెన్నుకుని ఉంటాడు. పూర్వమెప్పుడో వేశ్యగా తనని గురించి తెలిసి ఉంటుంది. లేకపోతే యిప్పుడు తను హోటలు గదికెందుకు? ఆ మాటకొస్తే తను యీ ఫంక్షనుకీ, గానసభకీ ఎందుకు?

చిత్తంకొద్దీ చిన్నెలు, విత్తంకొద్దీ వన్నెలు... అని ఊరికే అనలేదు పూర్వులు.

సరే. కానున్నది కాకమానదు. జరిగేది జరగనీ. కట్టె నిప్పునంటితే కట్టెకే నష్టం. పెద్దమనిషి వేశ్యను చేరితే పెద్దమనిషికే నష్టం. తనకు పోయేదేముంది?

"హోటలు కొచ్చేశాం మాడమ్"

కారుదిగి మంజులతో రూములోకి నడి

చింది మాధవి. ఆమెనక్కడ వొదులుతూ "నేనర్జంటుగా అక్కడికెళ్లాలి. పనుంది. సార్ తొందరగానే వచ్చేస్తారు. మీరు ఒంటరిగా..." ఉండగలరా అని ప్రాధేయపడుతున్నట్లడిగింది మంజుల.

"ఉండలేక? నేనేం చిన్నపిల్లనా? నన్నేమయినా పిల్లి ఎత్తుకుపోతుందా? " నవ్వింది. "నీకేమయినా పనుంటే చూసుకో వెళ్ళు"

"థ్యాంక్స్ మాడమ్" అంటూ ఆమె వెళ్ళింది. గదిలో ఒంటరిగా మాధవి మిగిలింది. సాయంత్రంనుంచీ జరిగినదంతా తలుచుకుంటుంటే ఆశ్చర్యంగా ఉందామెకు. ముఖ్యంగా గానకచేరీ. చిత్రమేమిటంటే సభలో యువకుడయిన వేణుమాధవ్ నేటితరం పాటలుకాక ఆనాటితరం పాటలు పాడడం! శాస్త్రీయత సంతరించుకున్నవి పాడడం. ఆ పాటలను గుర్తుచేసుకుందుకు ప్రయత్నించసాగింది. కొంతకొంత గుర్తొస్తూ మెదడులో మెదలసాగాయి.

"మాడమ్, మాధవీ!"

ఆమె తృళ్ళిపడింది. "మీరా! రండి...ఎంతసేపయిందీ వచ్చి? "

"ఇప్పుడే. ఐదు నిముషాలక్రితం. మీరేదో లోకంలో ఉన్నట్లుంటేనూ..."

"మీలోకంలోనే. అదే... మీ గానలోకంలోనే... అంటే... మీ పాటలు తలుచుకుంటూ..."

"ధన్యుణ్ణి. మీకు నా పాట అంత నచ్చడం నా పుణ్యం"

"మీ పాట విన్న నేనే ధన్యమయ్యాను. మిమ్మల్నొకటి కోరాలని..."

"ఏమిటి? "

"ఇవాళ్టి కచేరీ రికార్డ్ చేసినట్లుంది. నాకో క్యాసెట్ యివ్వగలరా? "

"తప్పకుండా. నిజం చెప్పాలంటే యివాళ్టి కచేరీ మీకోసమే. అది మీకే అంకితం. మరి నేనూ ఒకటి కోరుతాను. కాదనరుకదా? "

"మీరు నన్ను కోరడమా? ఏమిటీ? నేను తీర్చగలిగేదయితే తప్పకుండా అలాగే"

"మీరు తీర్చగలిగేదే. తలుచుకోవాలి కానీ..."

"ఏమిటి అదీ? " ఆత్రంగా అడిగింది.

"స్నానం చేసివచ్చి పవిత్రంగా చెబుతాను. ఈ లోగా మీరిది వింటూండండి" అంటూ అతను పాకెట్ సైజ్ టేప్‌రికార్డర్‌ని ఆన్‌చేసి స్నానాల గదిలోకి వెళ్ళిపోయాడు.

'ఇవాళ్టి కచేరీ మీ కోసమే. అది మీకే అంకితం' ఏమిటతని ఉద్దేశం? దేనికోసం అతని ప్రాధేయత? ఈ వేశ్య తీర్చగలిగిన కోరికేమిటతనికి?

టేప్‌రికార్డర్‌లో మాటలు ప్రారంభమయ్యాయి.

"ఇది నా కథ. నా కథ అని నేను చెప్పుకునేందుకు కూడా సిగ్గుపడవలసిన కథ. కాని మీకు చెప్పాలి. ఔను. మీరు నా కథ వినాలి. ఎందుకో తరవాత తెలుస్తుంది. నా కథని రాయగలిగినంత రచనా నైపుణ్యం లేదు నాకు. ఎదుటపడి చెప్పడానికి సిగ్గుతోనూ, మొహమాటంతోనూ నోరు పెగలకపోవచ్చు' తడబాటులో సరిగా చెప్పలేకపోవచ్చు అందుకిలాగ రికార్డింగ్ మార్గాన్నెన్నుకున్నాను-"

సినిమావాళ్ళ బుర్రే బుర్ర. ఏమైనా సినిమావాళ్ళు సినిమావాళ్ళే.

"కొంతవరకు జ్ఞాపకాలు, కొన్ని ఊహలు, అభిప్రాయాలు పెద్దయ్యాక చెప్పుకుంటున్న ఈ చిన్నతనం కథ అలా రూపొందింది. అంచేత తర్కానికీ హేతువుకీ అందని విషయాలు కొన్నుండొచ్చు. ఇక కథలోకి వెళ్దామా? "

చూడబోతే ఇతనేదో ప్రయోజనం ఆశించే



ఈ ఆత్మకథ చెప్పుకున్నట్లున్నారు. ఏమీ తోచనప్పుడు తనూ రాస్తూ వస్తోంది తన కథ. ఏదో ఆశించి కాదు. ఊరికేనే.

"సుమారు ఇరవయ్యేనిమిదేళ్ల కిందట ఓ రాత్రి.

"పట్నంలోనే రాచవీధి కాకుండా పక్క రోడ్డు. ఆ రోడ్డు నిర్జనంగా ఉంది.

"రాత్రి పదవుతోంది. వెన్నెల కాస్తూంది. రోడ్డుమీద వెన్నెల. పక్కన నీడలు.

"ఆ వెలుగు నీడలలో రహస్యంగా, దొంగలా నడుచుకుంటూ వస్తోందొక స్త్రీ.

"ఆమె చేతుల్లో చిన్న మూటలాటిది. నడుస్తున్న ఆమె ఆ డస్ట్‌బిన్ దగ్గరకు రాగానే ఆగింది.

భయంగా బెరుకుగా ఓసారటూ ఇటూ చూసి తన ప్రాణాన్ని తీసి అక్కడ పెడుతున్నట్లు చేతులలోని మూటని ఆ డస్ట్‌బిన్ మీదుంచింది.

ఒక్కసారి భోరున ఏడిచి అక్కడినుంచి పరుగెత్తి నీడలలో మాయమైపోయింది.

ఆ నిశీధిలో నిశ్శబ్దంలో డస్ట్‌బిన్‌మీంచి 'క్యార్ క్యార్'మంటూ పురిటికందు ఆక్రందన.

అంతలో అటునుంచొక పంది. పోతరించిన పంది. ఏదో వాసన తగిలినట్లు పరుగెడుతూ అక్కడికి వచ్చింది.

మరొక్కక్షణమయితే అది పైకెగిరి ఆ పసిగుడ్డుని నోట చిక్కించుకునేదే. కాని ఇటునుంచొక బలిష్టమయిన ఊరకుక్క. దానికీ వాసన తగిలినట్లుంది. సంధించి విడచిన శరంలా దూసుకొచ్చి ఆ పందిని ఢీకొంది. పోటీదారుడినెంతమాత్రమూ సహించేది లేదన్నట్లు అవి ఒకదానితో ఒకటి భీకరంగా తలపడ్డాయి.

అటు ఆ పసిగుడ్డు ఏడుపు.

అక్రమ సంతానమో, పోషించలేని కుటుంబంలో పుట్టిందో కావొచ్చు. ఏదయినా ఆ పసికందు ఎవరికీ అక్కరలేని బిడ్డ.

ఆ నెత్తుటిగుడ్డుతో విందు చేసుకోవాలన్న తీవ్ర కాంక్షతో ఆ జంతువులు రెండూ ప్రాణాలకి తెగించి పోరాడుతున్నాయ్. నెత్తుటికందు రోదిస్తోంది.

సరిగ్గా అప్పుడు రోడ్డుమీద ఒక కారు.

వెనకసీటులోని మనిషి- "ఆపు" అన్నాడు డ్రయివర్‌ని.

"వెళ్ళి ఏమిటో చూడు. ఎవరో చంటిపిల్ల ఏడుపులా ఉంది"

తమవేపు అతను రావడం చూసి ఆ జంతువులు గుర్రుమంటూ తోకముడిచాయి. దయామయుడైన ఆ డ్రయివరు డస్ట్‌బిన్‌మీది పొత్తిళ్లలోని పురిటికందుని చూసి మూటతోనే కారు వద్దకి తెచ్చాడు. "ఎవరో కనిపారేశారు బాబూ. మగపిల్లడు"

"ఇటిచ్చి పోనీ" అంటూ అతను పొత్తిళ్ల పసికందుని వొడిలో పెట్టుకున్నాడు. తన అనాధ శరణాలయానికి తీసుకెళ్ళి ఆయాకందించాడు పెంచమని.

ఇదేనేమో గుడ్డిలో మెల్ల. అంబులెన్సు కిందే పడ్డట్లు. ఆ శిశువు అనాధశరణాలయం మహారాజ పోషకునికంటే పడ్డాడు. బతికి బట్టకట్టాడు. లేకపోతే ఏమయ్యేవాడో? ఆ జంతువులే తినేసేవేమో.

"అందుకే నేనా అనాధశరణాలయం యజమానికి ఆజన్మాంతమూ రుణపడి ఉన్నాను"

టేపులోంచి వస్తున్నట్లుకాక ఎంతో నిర్దుష్టంగా భావస్ఫోరకంగా ఉన్నాయి మాటలు.

గాయకుడి కంఠంకదా. ప్రతి పదం వెనుకా భావం సుస్పష్టంగా పలికింది.

వేణుమాధవ్- అనాధన్నమాట! పుట్టుకతోనే అనాధ.

"అయినవారిచేత ఆఖరికి అమ్మచేత





కూడా పరిత్యక్తుడినయిన నన్ను ఆయా ప్రత్యేక శ్రద్ధతో పెంచింది. శిశువులని పెంచడం ఎంత మధురమో అంత కష్టం కూడానట. ఆయా అది తన డ్యూటీగా కాక ప్రేమానురాగాలతో వాత్సల్యం కురిపిస్తూ పెంచసాగింది నన్ను. డబ్బిచ్చేది అనాథ శరణాలయం యజమానే. కాని డబ్బు తనంతట తాను పిల్లల్ని పెంచదుకదా? అందులోనూ అంత చిన్న శిశువుని? శ్రద్ధా, ప్రేమా, మాత్రమే పెంచగలవు. వాటినే అందించిందా ఆయా. కన్నతల్లికంటె మిన్నగా. ఆ మాతృరుణం తీర్చుకోలేనిది"

"నన్నుంచిన గది కానుకుని వెనుకగా చిన్న ఇల్లుండేది. ఆ గదిలో చీమ చిటుక్కు మంటే ఈ గదిలో వినిపించేది. ఆ గదిలో ఒక సంగీతం మాస్టారుండేవారు. సంగీతం ఆయన జీవిక. రోజూ శిష్యులకు పాఠాలు చెప్తూండేవారు. అందుచేత నేను సంగీతం వినగలిగే అదృష్టానికి నోచుకున్నాను. నాకు లాలిపాటలూ, జోలపాటలూ అన్నీ ఆ సంగీతమే. అమ్మలేని నాకు అమ్మా అనే పిలుపు కంటె ముందుగా సరిగమపదనిసలే వచ్చాయేమో. అభిమన్యుడు మాతృగర్భంలో ఉండగానే అర్జునుడు చెప్పిన పద్మవ్యూహం గ్రహించాడట. ఒక శిశువుమీద వాతావరణ ప్రభావమూ పరిసరాల ప్రభావమూ తక్కువగా ఏమీ ఉండదనడానికదే తార్కాణం. అందుకే కాబోలు ఏ గూటి చిలక ఆ గూటి పలుకే పలుకుతుందంటారు. పసివాడిగా, బాలుడిగా నా చెవులలో ఎప్పుడూ సంగీతమే వినపడుతూండడంవల్ల మాటలకంటె అదే ముందు వచ్చిందేమో. అవతల మాస్టారూ పిల్లలూ పాడేవి- ఇవతల నా గదిలో నేననుకరించేవాడిని. వాటినలా పాడడానికి ప్రయత్నించేవాడిని. ఆరేళ్లకే సరిగమలతోపాటు జంట స్వరాలు. సరళ స్వరాలు, రాగాలు, ఆలాపనలు, కీర్తనలూ, కృతులూ నోట పలుకుతూండేవి. అనాథ శరణాలయంలోని పన్నెండుమంది అనాథ పిల్లల్లో నేనే చిన్నవాణ్ణి. మిగిలిన పిల్లలు నన్ను ముద్దుగానే చూసుకునేవారు. నాచేత పాటలు పాడించి ప్రోత్సహించేవారు. పాట లంటే- నేను వినడంవల్ల అలవడిన శాస్త్రీయ సంగీతమే.

ఆ తర్వాత నా గురించి విన్న సంగీతం మాస్టారు సత్యంగారు నామీద దయతో వారి పాఠాలకు నన్నూ అనుమతించేవారు. నా కోసం ప్రత్యేకంగా కాకపోయినా- వారి శిష్యులతోపాటే నేనూను. ఉచిత గానవిద్య ప్రసాదించేవారు. ఆనాడు వారు పెట్టిన భిక్షే నా తరువాత జీవితంలో ఉపాధ యింది. వారికెన్ని కృతజ్ఞతలు తెలిపితే చాలుతుంది? ఆశ్రమంలో చదువు. మాస్టారి దగ్గర సంగీతం. నేను పాడతానని విన్న శరణాలయం యజమాని అనంతరామయ్యగారొకసారి నన్ను వారి వద్దకు పిలిపించుకుని "రెండు పాటలు పాడు. చూద్దాం" అన్నారు. నేను పాడాను.

"బాగానే పాడావ్. గొంతు బాగుంది. సినిమా పాటలు పాడు"

"అవి రావండి" సిగ్గుపడుతూ, భయపడుతూ చెప్పాను.

"చూడు, ఈ శాస్త్రీయ సంగీతం మంచిదే కాని కడుపు నింపదు. సినిమా పాటలు నేర్చుకో. ఎప్పటికైనా ఎందుకైనా పనికొస్తుంది. నా సినిమాహాలుకి వెళ్ళి సినిమాలు చూస్తుండు. ఆ పాటలొస్తాయి. నేను వాళ్ళకి చెబుతాలే"

ఆయనకి సినిమాహాలుంది. దాన్లో నాకు ఫ్రీ ఏర్పాటు చేశారు. నా ఇష్టమొచ్చినప్పుడల్లా సినిమాకెళ్ళేవాడిని. పాటలు వినడమూ, ఇవతలికొచ్చి ప్రాక్టీసు చేయడమూ. అలాగని శాస్త్రీయ సంగీతం మానేవాడిని కాదు. దేని దారి దానిదే.

"ఆశ్రమ బాలురకు ఒక పాఠశాలలో ఉచితవిద్యా సౌకర్యముండేది. దానితో నేను



చదువుకునేవాణ్ణి. రోజులు బాగానే గడుస్తు న్నాయి. పదోతరగతి పరీక్షలు రాశాను. సంగీతం మాస్టారు పెద్దవారైపోయి పాఠాలు చెప్పడం విరమించుకున్నారు. అనారోగ్యం చేసిందాయనకి. నేను సినిమా పాటలని బాగా పాడగలుగుతున్నాను. ఆయా అమ్మగా... అనాధశరణాలయంలోని బాలబాలికలు సోదరీ సోదరులుగా. శరణా లయమే స్వగృహంగా నేను పదహారేళ్లు గడి పాను. నేను శరణాలయంలో చేర్చబడి నరోజే నా పుట్టినరోజుగా నమోదు చేయబ డింది. ఆ లెక్కన నాకు పదహారు సంవత్స రాలు నిండినరోజున ఆవేళ నా పుట్టినరోజు జరిపారు. శరణాలయం యజమాని వచ్చారు. నాకు స్వీట్లు తినిపించారు. శుభా కాంక్షలు చెప్పారు. తరువాత వారు నన్ను ఆఫీసుగదిలోకి పిలిచారు.

"చూడు బాబూ! నువ్వు పదహారేళ్లిక్కడ పెరిగావు. నీకు వేణుమాధవనే పేరు ఈ శరణాలయమే పెట్టింది. ఏ తల్లి కన్నబి డ్డవో... ఇక్కడ పెరిగావు. ఆశ్రమ నియ మాలననుసరించి పదహారేళ్లు నిండాక ఏ బాలుడూ ఇక్కడుండకూడదు. ఇలా చెబు తున్నందుకు బాధగానే ఉన్నా తప్పడంలేదు మరి. ఇక నువ్వు బయటి ప్రపంచంలోకి వెళ్ళిపోయి నీ బతుకు నువ్వు బతకాలి. పదోతరగతి పాసయ్యావు. నోట్లో పాటుంది. అంచేత నువ్వు ఎలా బతక డమా అని భయపడక్కర్లేదు. చురుకైనవా డివే కనుక ఎలాగైనా బతకగలవు. ఈ వందరూపాయలూ చేతికాపుగా ఉంచుకో. ఇదే నీకు వీడ్కోలు. రేపు ఉదయమే వెళ్లు"

"ఈ నియమం గురించి ఇదివరకే విని ఉన్నాను. అయినా పిడుగుపడ్డట్లే అనిపిం చిందామాట. నేను ఈ ఇంటిని విడిచివెళ్ళి పోవాలి.

"అమ్మలాటి ఆయానీ! ఇన్నాళ్లూ పెరిగిన ఇంటినీ! సోదరీ సోదరుల్లా మెలగిన శరణా లయవాసులనీ! తండ్రిలాటి శరణాలయ యజమానినీ వదిలి వెళ్ళిపోవాలి.

"రేపటినుంచి నాకెవరూ ఉండరు. నేను ఒంటరిని. పుట్టినప్పుడు లేని ఒంటరితనం ఇప్పుడు చుట్టు ముడుతోంది.

"రేపటినుంచి నాకిల్లుండదు. ఎక్కడుం డాలో, ఎలా బతకాలో. రేపటినుంచి నాకు ఆలయంలో అన్నం పెట్టరు. నా అన్నం నేను వెతుక్కోవాలి. నాకేడుపొచ్చేసింది. భోరున ఏడిచేశాను.

"నేను వెళ్లను. వెళ్లలేను, నన్నిక్కడే ఉండ నివ్వండి. మీరేం చేయమంటే అది చేస్తాను" అని ప్రాధేయపడ్డాను.

"నియమనిబంధనలు అనుల్లంఘనీ యాలు" అనేసి వెళ్ళిపోయారాయన.

రేపటినుంచి ప్రపంచంలో ఏకాకినని తలుచుకుంటూంటే నాకు దుఃఖమూ, భయమూ ఆగలేదు" టేపు ఆగిపోయింది.

"మాడమ్! ఆకలి వేస్తోందేమో. భోజనం చేద్దామా?" మాధవ్ కంఠం.

అప్పటికే గదిలోకి భోజనం వచ్చిఉంది. ఆమెకాట్టే ఆకలిగా లేదు.

"నేనింటికి వెళ్తాను. ఇక్కడ నా పనేమీలే దంటే"

"మీరు నా అతిథి. మిమ్మల్ని భోజనం చెయ్యకుండా వెళ్ళనివ్వడం నాకు తగదు. భోంచేస్తూనే మాట్లాడుకుందాం. పదండి. ప్లీజ్. నాకు ఆకలిగా ఉంది" అంటూ అతను భోజనాల బల్లవేపు దారితీసేసరికి అతన్ననుసరించడంకంటె మరో మార్గం లేక పోయింది.

భోజనం చేస్తూ- "ఇవాళ మీరు కచేరిలో ఎంతో బాగా పాడారు. చాలా మంచి గాయకులు" అందామె అభినందిస్తున్నట్లు.

"థాంక్స్. మీరు మెచ్చడమే మెచ్చడం"

"అదేమిటి?"




# ఏరిన ముత్యాలు

★ మనల్ని చూసి 'జాలి' పడేట్టుగాక 'అసూయ' పడేట్టు జీవించాలి.

–ఒక సూక్తి

★ ప్రజలు వేళ్లవంటివాళ్లు అయితే ప్రభుత్వం ఫలం అవుతుంది. వేళ్లు చక్కగా తమ విధిని నిర్వర్తిస్తేనే పండు తియ్యగా వుంటుంది.

–మహాత్మాగాంధీ

★ 'పుకారు' అనేది ఊహలు, భావనలు, అసూయ కలిపి ఊదే పిల్లనగ్రోవి.

– షేక్స్పియర్

★ నేను భవిష్యత్తు గురించి ఎప్పుడూ యోచించలేదు. ఎందుకంటే నేను యోచించేలోగానే అది నన్ను సమీపిస్తుంది.

–ఐన్స్టీన్

★ చారిత్రక సంఘటనలు రెండేసార్లు జరుగుతాయి. మొదటిసారి విషాదం గాను, రెండవసారి హాస్యాస్పదంగాను.

–మార్క్స్

★ ఆకార వికారాల్లో ఫ్యాషన్ ఒకటి. అది ఎంత అసహ్యమైనదంటే దాన్ని ఎప్పటికప్పుడు మార్చుకుంటూ వుండాల్సిందే.

–ఆస్కార్ వైల్డ్

★ బలమైన ప్రతిపక్షం లేని ప్రభుత్వానికి భద్రత లేదు. –బి. డిజ్రేలి

★ కొందరు గొప్పవారుగా పుడతారు. కొందరు గొప్పతనాల్ని సాధిస్తారు. చాలామంది ఎలాంటి చలనం లేకుండానే నిల్చిపోతారు.

–కిన్హల్బర్ట్

★ మన పూర్వపు ప్రముఖులను మాటలతో కీర్తించడంకంటే చేతల ద్వారా వారిని అనుసరించడం అత్యంత గౌరవంగా వుంటుంది.

–హ్యారస్మాన్

★ పరులనుంచి హాని పొందిన పిరికివాడి పగ ద్వేషంగా రూపుదాలుస్తుంది.

–బెర్నార్డ్షా

★ ద్వేషం, అపనమ్మకం అజ్ఞాన, అంధకారాల ముద్దుబిడ్డలు.

–విలియం నాట్సన్

★ ఎవరైనా ఒక వ్యక్తిపట్ల, ఏదైనా శక్తిపట్ల పదిమందికీ వుండే ద్వేషం, ఆ పదిమంది మధ్యా అసాధారణమైన ఐకమత్యాన్ని తీసుకువస్తుంది. అటువంటి ఐకమత్యాన్ని ప్రేమగానీ, స్నేహభావంగానీ మరేశక్తీ తీసుకురాజాలదు.

–యాంటల్పావ్ లోవిచ్ఛెతోవ్

★ ఇతరులను ద్వేషించడం, ఎలుకను చంపడం కోసం ఇంటిని తగలపెట్టుకోవడం వంటిది.

–హార్రీఎమర్సన్ ఫాస్డిక్

★ ద్వేషంతో చూసే చూపులు చాలా సునిశితమైనవి.

–జి.యస్. హిల్లర్డ్

సేకరణ: మాడుగుల రాము




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర' ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై చతుర నవల **జీవనఖేల**

............................................................

**సమీక్షకుని పేరు:** ............................................................

**చిరునామా:** ............................................................

............................................................

............................................................

............................................................

"అదేమిటంటే. నేనివాళ బతికున్నానన్నా ఈ పాటిగాయకుడి నయ్యానన్నా మీ చలవే"

"నిజంగానా! ఎలా? " నమ్మలేనట్లు చూసిందామె తినబోతున్న ముద్ద ఆపి.

"నా కథ... చరిత్ర. జీవితంలో గతం- చదివితే మీకే తెలుస్తుంది"

"చదివితే కాదు, వింటే" సరిదిద్దిందామె నవ్వుతూ.

"ఔను. వింటే... నా చరిత్ర ఎంత దారుణమంటే. దానిని రాస్తే కాగితాలు కూడా అపవిత్రమైపోతాయేమో. ఉహు... ఆ కాగితాలు కూడా నన్ను పరిహసిస్తాయేమో అనిపించేంత. మాధవీ! మీరు నాకు ఆరాధ్యులు. దేవత" ఉద్వేగంగా అన్నాడు.

"నా గురించి ఏమీ తెలియక మీరలా అంటున్నారు. నేను దేవతనేమిటి? వేశ్యని"

"మీరు వేశ్యని నాకు తెలుసు. మీరేకాని వేశ్యకాకపోతే నేనివాళ సజీవంగా ఉండేవాడిని కానేమో. మూడేళ్ల కిందటే ఆత్మహత్య చేసుకునేవాడినేమో. నా జీవితంలోనూ హృదయంలోనూ మీ స్థానం ఏమిటో మీకు తెలియదు. నా కథ విన్నాక తెలియవొచ్చు బహుశా. మాధవీ! మీరు వేశ్యేఔగాక. మీరెంత ఉన్నతులో మీకు తెలియదు. నాకు తెలుసు. మీరు దేవతే"

"నా కథ తెలిస్తే మీరు మీ మాటలు ఉపసంహరించుకుంటారేమో"

"ఏమిటి మీ కథ? " చెప్పమన్నట్లూ- వినడానికి తను సిద్ధమే అన్నట్లూ చూశాడు.

"మీలా నాకు అద్భుతమయిన కంఠం లేదు. అందుచేత నేను నా కథని రికార్డ్ చేయలేదు. కాకపోతే రాశాను. రాసుకున్నాను. ఎందుకో నాకూ తెలియదు. ఏమీ తోచనప్పుడల్లా రాశాను. డైరీలా కాదు కథలా"

"అది నాకొక్క సారివ్వగలరా? " భోజనం ముగించి అన్నాడతను.

"ఎందుకూ? నిజానికి నేనది ఎందుకు రాశానో నాకూ తెలియదు. ఆ కథ నాదే అనుకునేందుకు మనసొప్పక ఎవరిదో అన్నట్లు రాశాను" అందామె చెయ్యి కడుక్కుంటూ.

"నేనర్థం చేసుకోగలను. మాధవీ! మనం ఒకరి గురించి ఒకరు తెలుసుకోవలసిన సమయం వొచ్చేసింది. ఒక నిజం చెబుతాను. నమ్మండి"

"ఏమిటి? "

"సన్మానసభలో పొగిడినంత గొప్పవాడినేమీ కాను. సన్మానసభంటే అలా అతిశయోక్తులు వాడి పొగుడుతారని తెలిసినా ఎందుకంగీకరించానో తెలుసా? నిజానికి నేను పాడినవి అరవైపాటలకంటే లేవు సినిమాలలో. వాటిలో- తెలుగు సినిమాల్లో పాడినవి పదిహేనే. అలాటప్పుడు సన్మానమంటే టూ ఎర్లీ. అయినా ఒప్పుకున్నాను. మీ కోసం. మీ గురించి కాకపోతే నేనిప్పుడీ వూరుకొచ్చేవాడినే కాను. నమ్మగలిగితే ఇది నిజం. మీ కథ నాకివ్వండి. నేను చదువుతాను. నా కథ మీరు వినండి. మనం ఒకరిగురించి ఒకరు తెలుసుకోవలసిన అవసరమూ సమయమూ వచ్చేశాయని మళ్ళీ చెబుతున్నాను. మీ కథ నాకెలా ఇస్తారూ? నేను మీతో వచ్చేదా? "

ఆమె ఏమీ అనలేదు.

"చాలా అర్జంటుగా తేల్చుకోవాలి మనం. నేను రేపు సాయంత్రమే బయలుదేరి మళ్ళీ మద్రాసు వెళ్ళాలి. ఒక పాట రికార్డింగుంది. మనం ఈ రాత్రికే ఒకరి కథ ఒకరు తెలుసుకుంటే రేపు మాట్లాడుకోవచ్చు. మీ కభ్యంతరం లేకపోతే- ఇది ఎలాగూ రెండు గదుల సూటే కనుక అవతలిగదిలో

ఉండొచ్చు"

సరిగ్గా అదే సమయంలో మంజుల వచ్చింది మరో కార్యకర్తతో కలిసి.

"మీ రూములో మంజులని మీకు తోడుగా ఉంచుకోవచ్చు. ఒంటరిగా ఉండక్క ర్లేదు"

"సరే. నేనూ, ఆమె వెళ్లి కాగితాలు తెస్తాం మా ఇంటినుంచి. మా అమ్మకి చెప్పినట్లూ అవుతుంది నేనిక్కడుండిపోతానని"

"మంజులా! వీరిని కారులో వారింటికి తీసుకెళ్లి మళ్ళీ తీసుకురాగలవా? అలాగే ఈ రాత్రి నువ్వామెకు తోడుండవలసి ఉంటుందేమో" అన్నాడు మాధవ్.

"విత్ ప్లెషర్ సర్" అందామె.

మాధవి ఏదో చెప్పబోయి ఆగిపోయిం దంతలోనే.

ఆమే, మంజులా, కార్యకర్తా కారులో మాధవి ఇంటికి బయలుదేరారు. కారుని వీధి మొగదల ఆపించి తానొక్కతే వెళ్లిందిం టికి.

"వచ్చావా అమ్మా. ఇంకా రాకపోతేనూ నీ గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను" అంది మాణిక్యం.

"నేనేం చిన్నపిల్లనా అమ్మా? నా గురిం చెందుకు దిగులు? " నవ్వుతూనే గదిలోకి వెళ్లింది.

"తల్లి కంటికి బిడ్డెప్పుడూ చిన్నపిల్లే. ఈ పట్టుచీరేమిటీ? " ఆమె వెంట తను కూడా గదిలోకి వెళ్తూ అడిగింది. మాధవి తన బీరువాలోంచి చిన్న బొందులాంటిది తీసు కుని,

"నేను వచ్చాక అన్నీ చెబుతాను. ఈ రాత్రి నేను మాధవ్‌తో ఉండదలుచుకు న్నాను హోటల్లో" అంది.

"మాధవెవరమ్మా? " ఆత్రంగా అడిగింది.





ఆమె కంఠంలో ఆనందం.

"సాయంత్రం వచ్చారే వారు. వారెవరను కున్నావ్? సినీగాయకులు. వారికి నాతో పనుందట. చూడమ్మా... నేను రావడం ఆలస్యమయినా కంగారుపడకు. నేనక్కడ క్షేమంగా ఉంటాను. నువ్వు జాగ్రత్తగా ఉండు. తలుపేసుకో" అని బయటకు వచ్చే సిందామె.

ఆమె హోటలు గదికి రావడమేమిటి, మాధవ్ ఆమె చేతిలోని పుస్తకం అందుకు న్నాడు.

మంజుల మాధవిని పక్కగదిలోకి తీసుకె ళ్లింది. అక్కడ ఆడవాళ్ల నైట్‌డ్రెస్‌లున్నాయి. మాధవ్ ముందు చూపుకి తన గురించి తీసుకుంటున్న జాగ్రత్తలకీ మాధవెంతో మురిసిపోయింది. అతనంటే గౌరవం పెరి గిపోయిందామెలో. తన కోసమే సన్మానం అంగీకరించి ఈ వూరు వచ్చానంటాడు. సంగీత కచేరీని తనకంకితం చేశాడు. తను దేవతట. తను కరుణించి ఉండకపోతే అత నికి జీవితమే దక్కేది కాదట. ఏమిటో తన కేమీ అర్థం కాలేదు. అతని కథంతా విన్నాక అర్థమవుతుందేమో.

అప్పటికే మాధవ్ ఆమె కథని చదవడం మొదలుపెట్టాడు తన గదిలో.

ఆడపిల్లకి పెళ్లితో జీవితం ప్రారంభమవు తుందంటారు. లలితకి జీవితమనేది జీవి తంలా ప్రారంభమవలేదు. కాని పద్దెనిమిది రాగానే కష్టసాగరం ప్రారంభమయింది.

జీవితం అనుకున్నట్లూ ఆశపడినట్లూ కాక పోయినా వాటికి కొంచెం దగ్గరగా అయినా సాగాలికదా? అలాగని ఆమేమీ రంగులక లలు కనలేదు. రాకుమారుడు తనని వరిం చాలనుకోలేదు. ఆమె చాలా సామన్యమ యిన, నిరాడంబరమయిన కలలే కంది. మామూలు జీవితమే కోరుకుంది. తనని ఆ ఇంటినుంచి తనింటికి తీసుకుపోయే ఓ భర్త. మొగాడు. అతను తనకింత తిండి

పెట్టి, గుడ్డ ఇచ్చి గూడులో ఉంచితే చాలు. ఆ కనీస కోర్కెలను తీర్చినందుకు ప్రతిఫలంగా తను అతనికి కృతజ్ఞురాలిగా పడుంటుంది. అతనికి వండిపెడుతుంది. సేవలు చేస్తుంది. సుఖపెడుతుంది. అతను కోరితే సంతానం కంటుంది. ఆమె కోరుకున్నదలాటి సామాన్యమయిన మగాడినే.

ఈ లలిత ఎవరని ఆశ్చర్యంగా ఉందా? భగవంతుడి కొక్కొక్క అవతారంలో ఒక్కొక్క పేరు. నాలాటి దురదృష్టవంతురాలికి అంతే. మనిషి జైలుకి వెళ్ళినప్పుడల్లా ఒక్కో నంబరిస్తారు. వ్యభిచారకూపమనే జెయిలులోకెళ్ళిన ఆడవాళ్ళకి ఖైదీలాగే కొత్త నంబరుకి బదులు కొత్తపేరు.

లలిత వేశ్యాకుటుంబంలో పుట్టలేదు. ఆమె తల్లి వేశ్యకాదు. అయినా ఈ కథ నిజంగా సిగ్గుచేటు కథే.

ఈ కథలో వచ్చే ప్రధాన పాత్రలన్నీ సిగ్గుచేటువే.

ఏ స్త్రీ, ఏ పురుషుడినయినా ప్రేమించొచ్చు ప్రేమకి ఆంక్షలు లేవు.

ప్రేమించుకున్న స్త్రీ పురుషులు పెళ్ళీ చేసుకోవచ్చు పెళ్లికి హద్దులు లేవు.

కాని దంపతులందరికీ పిల్లలని కనే అర్హత మాత్రం ఉండదు. మాతృత్వమూ పితృత్వమూ బాధ్యతతో కూడినవి. వాత్సల్యం, సహనం, త్యాగభావన| ఉన్న దంపతులకే పిల్లలని కనే అర్హతుంటుంది. అవి లేనివారు కనే పిల్లల కర్మ మా అమ్మా నాన్నల పిల్లల కర్మలాగే కాలుతుంది. మా అమ్మా నాన్నల కిద్దరు పిల్లలు. మా దురదృష్టవశాత్తూ ఇద్దరూ ఆడపిల్లలే. లలిత రెండోది.

ఆ ఇల్లొక విచిత్రసత్రం. అది వాళ్ళిద్దరికీ ఇల్లు కాని పిల్లలకి కాదు. బాధ్యతా రాహిత్యానికీ నిష్పూచికీ, నిర్లక్ష్యానికీ ప్రతీకలా స్త్రీ పురుషులు. అవును. వాళ్లు స్త్రీపురుషులే. తల్లిదండ్రులు కాలేదు. పిల్లలు పుట్టినా. అలాటివాళ్ల విషయం చూస్తే ఆలుమగల అనురాగంకూడా అనర్థదాయకమే అని ఒప్పేసుకుంటారెవరయినా.

ఆ పురుషుడూ, ఆ స్త్రీ ప్రేమించుకున్నారట. మంచిదే. వాళ్లు కులాంతరమో మతాంతరమో కావడంతో పెద్దలనెదిరించవలసి వచ్చిందట. ఎదిరించీ పారిపోయీ పెళ్లి చేసుకున్నారుట. మరీ మంచిది. ప్రేమకి పెళ్లే మందు. సరే. పెళ్ళి చేసుకునూరుకుంటే వాళ్ళకీ బాగుండును. మాకూ బాగుండి పోను. కాని వాళ్లు అలా ఊరుకోలేదు. పిల్లల్ని కన్నారు.

ఒకసారి పొరపాటు చేశారంటే క్షమాపణుంది. మళ్లీ అదే పొరపాటు చేశారు. ఆ పొరపాటుకి ఫలితం లలిత.

పిల్లలు ముద్దుగా ఉంటారు. వాళ్ల అల్లరి అందంగా ఉంటుంది. వాళ్ల వచ్చీరాని మాటలు ఊరీ ఊరని ఉరగాయల్లా మహ రుచిగా ఉంటాయి. పిల్లలు తల్లిదండ్రుల ఆస్తి. అవన్నీ నిజమే. కాని ఈ కాలంలో, ముఖ్యంగా ఈ దేశంలో, పిల్లలు చాలా ఖరీదు. దేశానికి, మామూలు కుటుంబాలకీ కూడా పిల్లలని సవ్యంగా పెంచగల స్థోమతలేదు. దేశానికి అధిక జనాభా సమస్య. కుటుంబాలకి... మా నాన్నలాటి కుటుంబాలకి పేదరికం సమస్య. పిల్లలనికంటే వారి పెంపకమూ, భవిష్యత్తూ ఎలాగని బాధ్యతాయుతంగా ఆలోచించేవాళ్ల కటువంటి సమస్యలు.

మా తల్లిదండ్రులకటువంటి బాధలు లేవు. ఆయనకావిడ, ఆవిడకాయన. ప్రపంచమంటే అంతే. వాళ్లు మమ్మల్ని కన్నాక కూడా గాఢప్రేమికులే. తల్లిదండ్రులుగా ఎదగలేకపోయినవారు. వాళ్లకి వాళ్ళ ప్రేమ తప్ప ఏమీ పట్టదు. ఎవరి అదృష్టానిక వారు కూడా కొంత కర్తలు కాబట్టి, మా



అప్పచెల్లెళ్లం గాలికీ ధూళికీ అయినా పెరిగాం.

అంత వయసొచ్చినా మా అమ్మా నాన్న లకి బతుకెందుకంటే ప్రేమించుకుందుకే. మా నాన్న ఇంకేం చేసేవాడో నాకు తెలియదు. మేం ఒక గుడిసెలో ఉండేవాళ్లం. ఉన్ననాడు తిండం, లేనినాడు పస్తు. ఏంచేసేవాడో తెలియదుకాని మా నాన్న తరచుగానే డబ్బు తెచ్చేవాడు బుల్‌బుల్‌తార వాయిస్తూ పాటలు పాడేవాడనుకుంటాను.

అవీ- ప్రేమ పాటలు. ఆ పాటలకే మా అమ్మ అతని ప్రేమలో పడిందట. ఆయన పుట్టుక ముస్లిమ్ పుట్టుక కావచ్చు కాని ఆయన మతాతీతుడు. రంజాన్ నెలలో తెల్లవారు జామున ఆ పాటలు పాడేవారు వీధులంట. అలాగే క్రిస్మస్‌కి బుల్‌బుల్ వాయిస్తూ క్రీస్తు పాటలు పాడేవాడు. హిందువులలో కొన్ని కులాలలో తమవారు చనిపోతే రాత్రంతా శవజాగారం ఏర్పాటు చేసి శవం దగ్గర పాటలు పాడిస్తారు పాడేవాళ్ళకి డబ్బిచ్చి ఆ పాటలు తత్వాలే అవుతాయి. అవీ పాడేవాడు.

నాన్న తాగడు. బీడీ కూడా కాల్చడు. ఆయన ఏకైక వ్యసనం అమ్మపట్ల ప్రేమే. సంపాదించిన డబ్బు అయిపోయేవరకూ ఇల్లు కదిలేవాడు కాదు. అమ్మ కొంగు పట్టుకునే వేలాడేవాడు. అమ్మయినా ఆయనకి పెద్దరికమూ బాధ్యతా చెప్పేది కాదు. ఆవిడ ఆయనకంటే అన్యాయం. దంపతులలో ఒకరిటయితే మరొకరటవుతారంటారు. కాని ప్రేమించుకు పెళ్ళి చేసుకున్నందువల్ల కాబోలు వీళ్ళిద్దరూ ఒకటే! ఆడపిల్లలమున్నామనేనా లేకుండా వాళ్లిద్దరూ మాముందే ప్రేమించేసుకునేవారు. మేమంటూ ఉన్నామని మరచిపోయి వాళ్ళిద్దరూ కబుర్లూ, కితకితలూ, పకపకలూ. వెన్నెల రాత్రులొస్తే చాలు వాళ్లిద్దరూ రాత్రి షికార్లు వెళ్ళిపోయేవారు. తిరిగి రావడం ఏ అర్ధరాత్రికో, తెల్లవారుఝాముకో నిజంగా గాలికీ ధూళికీ పెరిగినట్లే పెరిగానా తల్లిదండ్రుల పెంపకంలో

ఆశ్చర్యమేమిటంటే అలాటి ప్రతికూల పరిస్థితుల్లో కూడా నేను పదోతరగతివరకూ చదవగలగడం. ఆడపిల్లలకి హైస్కూలు చదువువరకూ ఫీజులు లేకపోవడం అందుకు ముఖ్యకారణం. పదో తరగతి పాసైనట్లు సర్టిఫికెటందుకున్ననాడు నాకెంత ఆనందమూ, గర్వమూ వేశాయో. కొండెక్కినట్టే. కలక్టరు పరీక్ష పాసైపోయినట్లే సంబరపడిపోయాను. దానితోనే ఉద్యోగమొచ్చేస్తుందనుకున్నాను. కాని పద్ధెనిమిదేళ్లు నిండేవరకూ ఆగాలన్నారు.

నేను నాకూ ఇతరులకీ కూడా అందంగా కనపడేదాన్ని. లలిత చక్కనిదనేవారు నలుగురూ. నాకు పద్ధెనిమిదో ఏడు వచ్చింది. అదేమిటో- ఏసారీ పుట్టినరోజు జరపని అమ్మానాన్నలు ఆ పుట్టినరోజు మాత్రం స్వీటుచేసి జరిపారు. నన్ను వాళ్ళ ఎదుట కూర్చోబెట్టుకుని.

"లల్లీ! నువ్వు పదిహేడు నిండాయంటే పెద్దదానివీ, స్వతంత్రురాలివీ, వ్యక్తివీ అయిపోయావనే. ఇక నీ బతుకు నువ్వు బతకాలి. అమెరికాలో పదిహేనేళ్లు నిండిన పిల్లల్నే తల్లిదండ్రులు తమతో ఉండనివ్వరు. అది మంచి పద్ధతి. రేపే నువ్వు ఇల్లు వదిలి వెళ్ళిపోవాలి"

నెత్తిమీద సుత్తిదెబ్బల్లా పడ్డాయామె మాటలు. నాకు వీళ్లు స్వతంత్రంగా బతికేందుకవసరమైనవేమీ ఇవ్వలేదు. నేర్పలేదు. ఎగరడం నేర్పకుండా గూటిలోంచి తోసేయడం అన్యాయం కాదూ? పెళ్లిచేసి పొమ్మంటే న్యాయం. పోనీ బాగా చదువు చెప్పించినా ఫరవాలేదు.

"నేను ఒంటరిగా ప్రపంచంలోకి పోయి ఎలా బతకగలను? " బేలగా అడిగాను.

"నీకేం తక్కువ? పదోతరగతి పాస





య్యావు. చదువుకున్నదానివీ, అందమైనదానివీ, నువ్వు కాకపోతే ఇంకెవరు బతకగలరు? నాలుగేళ్ల కిందట మీ అక్క నీపాటి అందమైనదీ కాదు, చదువుకోనూ లేదు. వెళ్ళిపోలేదూ? రేపటిరయిల్లో నీకు మద్రాసుకి టికెట్టుకొన్నాను. సిద్ధంగా ఉండు" అదే చివరిమాటన్నట్లన్నాడు.

నాలుగేళ్లకిందట అక్క హఠాత్తుగా మాయమైపోవడం వెనుక రహస్యం ఇప్పుడు తెలిసింది. మా తల్లిదండ్రుల తత్వమూ తెలిసింది. వీళ్లు ఆడపిల్లలకి కూడా పెళ్ళిచేసే బాధ్యత తీసుకోరు. చదువు చెప్పించేపని అసలే చేపట్టరు. పదిహేడేళ్లు నిండేవరకూ ఉండనిచ్చి నిండగానే నీ కర్మానికి నువ్వు ఫో అని తగిలేస్తారు. ఆడపిల్ల అని జాలేనా ఉండని ఇలాటి విడ్డూరపు తల్లిదండ్రులు ఎక్కడేనా ఉంటారా? ఇంత నిర్దయులయిన తల్లిదండ్రులీ పృధివిలో ఉంటారా? ఇంటినుంచి తగిలేడమంటే ఇంతకంటె మరేమిటి?

"నిన్నటు రైలెక్కించి మేమూ మకాం మార్చేస్తాం. ఎక్కడికో మాకూ తెలీదిప్పుడు"

అంటే నేను వెనక్కి రావడానికి వీలులేదన్నమాట. వాళ్లెక్కడుండేదీ నాకు తెలిసే అవకాశం లేదు. అంటే ఇక ఈ జీవితంలో వాళ్లేమయినా నాకూ తెలియదు, నేనేమైనా వాళ్లకీ తెలియదు. నాలుగేళ్ల కిందట. అక్కని పంపేసి కూడా ఇలాగే మకాం మార్చారు. ఇందుకన్నమాట. రేపటినుంచి నాకు ఇల్లుండదు. నా అనేవాళ్లుండరు. ఒంటరిగా బతకాలి. నా బతుకు బాగున్నా, ఏమైనా నాది. అమ్మా, నాన్నా, అక్కా ఉండీ లేనట్లే. రోడ్డుమీద పడుతున్న ఒంటరిని. రేపటినుంచి ఎలా బతకాలి? ఏం కాబోతోంది నా బతుకు? జరుగుతున్నది నాకే నమ్మశక్యం గాకుండా ఉంది. భయం... దిగులు... దుఃఖం... నైరాశ్యం.

చదువుతున్న వేణుమాధవ్ ఆశ్చర్యపోయాడు. పరిస్థితులు వేరయినా మాధవి కూడా తనలాగే ఒంటరిపోరాటమే చేయవలసివచ్చిందన్నమాట. తనకి అమ్మా నాన్నా ఉండే ఉండొచ్చు ఎక్కడో, తనకి తెలియకపోయినా ఆమెకీ అంతే!

సరిగ్గా అదే క్షణంలో మాధవి వచ్చిందక్కడికి. పుస్తకంలో నిమగ్నమయిన మాధవ్‌ని పలకరింపుగా అడిగింది. "చదవడానికిబ్బంది పెడుతూందా నా రాత? ఏం చేసేదీ? నాకు బాగా రాయడం రాదు. నేను రచయిత్రిని కానుకదా. అందులోనూ కృత్యాదవస్థ"

"నేను పాఠకుణ్ణి కాను. నాకు కావలసింది విషయం తెలియడం. ఒకసారి లలిత మరోసారి నేను అనీ రాశారు కానీ దానివల్ల అర్థం చేసుకోడానికి ఏమీ ఇబ్బందవలేదు. నిజానికి మీ భాషా అదీ బాగానే ఉంది"

"పోను పోనూ కొంచెం మెరుగ్గా ఉండొచ్చనుకుంటాను. మీరు తరవాతి టేపు వేసిస్తే" అంటూ టేప్‌రికార్డరందించింది. "మీ కథనం మాత్రం చక్కగా ఉంది. సంగీతం వింటున్నట్లే. పాట వింటున్నట్లే"

"కాని నాకూ అట్టే భాష రాదు. సర్దుకుపోవాలి. శ్రమ అనుకోకుండా"

"మరేమీ ఫరవాలేదు" అంటూంటే మంజుల వచ్చింది. "భోజనం చేసేసి వచ్చాను" అంటూ.

మాధవీ ఆమే ఆమె గదికి నడిచారు.

కూర్చున్నాక మెల్లగా అడిగింది మంజుల "మేడమ్... మిమ్మల్నొకటడగాలనుకుంటున్నాను. మీరేమీ అనుకోనంటే"

"ఏమిటి? " ఆశ్చర్యపోయింది మాధవి. ఈ అమ్మాయి తననడిగేదేముంటుంది? మాధవ్‌కీ మీకూ ఏమిటి సంబంధమనా?



అదే అయితే తనేం చెప్పాలి?

"మీరు నాకో చిన్న ఉపకారం చేసిపెట్టాలి. ఉపకారమంటే సిఫార్సు. వేణుమాధవ్‌గారికి మీరంటే ఎంతో గౌరవం. భక్తి... శ్రద్ధ. మీరేం చెప్పినా కాదనరు. నాకు సినిమా ఛాన్సొచ్చేలా చూడమని మీరాయనకి చెప్పాలి. మీరు చెబితే వారు కాదనరు. వారు కాని నిజంగా తలుచుకుంటే నాకు సినిమాల్లో ఛాన్స్ ష్యూర్. ఢంకాబజాయించి చెప్పగలను. ప్లీజ్ మాడమ్"

"మంజులా! నువ్వేం చదువుకున్నావు? నీ వయస్సెంత? నీకెందుకు సినిమా పిచ్చి? "

"డిగ్రీ ఫస్టియర్ మాడమ్. కాని నేనెంత బాగా చదివి డిగ్రీ పాసయినా ఉద్యోగం రాదు. నేను ఓ.సి.ని. మాది మధ్యతరగతి కుటుంబం. మా అమ్మా నాన్నలకధిక సంతానం. అంచేత నాకు పెళ్లి కూడా చెయ్యలేదు. నేనా అందంగా ఉంటానని నలుగురూ పొగుడుతుంటారు. సినిమాలంటే డబ్బూ, కీర్తి. బోలెడంత డబ్బు. భవిష్యత్తే కాక వర్తమానం కూడా లేని మాకుటుంబాన్నుద్ధరించాలంటే సినిమాల్లో నేను చేరడమే మార్గం. అందుకు నేను తీవ్రంగా ప్రయత్నిస్తున్నాను. ఊళ్లోకి సినిమావాళ్లెవరొచ్చినా వారిని కలుసుకుని నా ఫొటోలిస్తాను. వారికి సన్మానసభలు జరిగితే గాడిదలా చాకిరీ చేసి వాళ్ళ దృష్టిలో పడతాను. వూళ్లో ఏ సాంస్కృతిక సభేనా జరిగిందంటే- చచ్చేలా కష్టపడి అన్ని పనులూ చేస్తాను. సినిమా స్వర్గంలో కాలు పెట్టాలని రెండేళ్లనుంచి ఎన్నెన్ని నిచ్చెనలు వేస్తున్నానో దేముడికెరుక"

ఆమె కళ్లల్లో నీళ్లు.

మాధవికి జాలేసిందామె మీద.

"నిజం చెప్పండి మాడమ్. నేను చాలా మంది హీరోయిన్లంత అందంగా లేనూ? "

"నువ్వందగత్తెవే, కానీ సినీరంగమంటే స్వర్గమనీ... డబ్బే డబ్బనీ ఎవరు చెప్పారు? "

"ఒకరు చెప్పాలా? నేను చాలా సినిమా పత్రికలు చదువుతుంటాగా? డిగ్రీ చదువు వల్ల ఎలాగూ ఉద్యోగమూ ఉపయోగమూ ఉండవని ఆ క్లాసు పుస్తకాలకి బదులు సినిమా పత్రికలే చదువుతూంటాను మాడమ్. అంచేత నాకు సినిమాల గురించి చాలానే తెలుసు"

సినిమాల గురించి అచ్చయిందంతా సత్యమని అపోహపడుతున్న ఈ అమాయకురాలికేం చెప్పాలి? ఎలా చెబితే అర్థమౌతుంది?

"నేను సినిమాతారనై డబ్బూ పేరూ సంపాదించాలనుకునేది స్వార్థంతోనే కాదు మాడమ్. నేను పైకొస్తే నా కుటుంబాన్ని పైకి తెస్తాను. నేను బాగా సంపాదిస్తే వారి దరిద్రాన్ని తీరుస్తాను. అదీ నా ఆశ మాడమ్"

ఆశలకేం? ఆకాశంలో నక్షత్రాలన్ని ఉండొచ్చు మనిషికి. కానీ అందులో అందేవెన్ని? ఓ యువతీ...! లోకమెరుగని పాపాయీ... కాంక్షలే తప్ప వాటి ఆంక్షలనెరుగని అమాయకురాలా! మనలాంటి సామాన్యుల జీవితాలలో ఆశల సాఫల్యాల కంటె అపజయాలే ఎక్కువ. మన బతుకుల్లో ముళ్లపొదలే ఎక్కువ. మొగలిపూవులాటి ఆశలు అందేది అరుదు. వాటి ముళ్ళు గుచ్చుకునేదే అధికం. అందేపూలు అతితక్కువా, అంట పొడిచే కంటికాంతి ఎక్కువా? మనలాంటి దురదృష్టవంతుల ఆశలకెరటాలలో తీరం చేరగలిగేవి అతిస్వల్పం. తీరని ప్రతి ఆశా ఒక అగ్నిపర్వతమై అది బద్దలౌతూ హృదయాన్ని కూడా బద్దలు చేస్తుందని తెలుసుకోగలిగితే...

"నువ్వందమయినదానివే చిట్టితల్లీ. కాని సినిమారంగమే అతి వికృతమైంది"





"అంటే? "

"ఆ రంగం ఒక పట్టాన మనలాంటివాళ్ళని ప్రవేశించనివ్వదమ్మా"

"ఎందుకని? "

"ఎందుకంటే... అదంతే! నీదింకా లేత ముఖం, రూపు పూర్తిగా దిద్దుకోని విగ్రహం. గోచీకి పెద్దా గావంచాకి చిన్న అంటారే, అలాగ బాలనటికి పెద్దా హీరోయిన్‌కి చిన్నా అయిపోతావ్. రెండుమూడేళ్ళు పోయాక కనిపించు అని మెత్తగా తిరస్కరిస్తారు"

"నన్ను చూశాక, నా చలాకీ తనమూ అవీ చూశాక... కాదనగలరనుకోను మాడమ్"

ఆ కంఠంలో ప్రమాదకరమైన ఆత్మవిశ్వాసం.

మాధవి తన అనుభవాన్ని ఆమెకు చెప్పాలనుకుంది.



మద్రాసు సెంట్రల్ స్టేషన్.

నిముషం కిందట ఆగిన రైలులోంచి దిగిన ఆ అమ్మాయి అంత పెద్ద స్టేషన్‌నీ, అంత జనాన్నీ, అంత కోలాహలాన్నీ ఎప్పుడూ చూడలేదు కాబోలు బిత్తరపోతూ ప్లాట్‌ఫామ్‌మీద నిలుచుంది.

ఎటుపోవాలో ఎక్కడికి పోవాలో తెలియనట్లుందామె వాలకం. రైలుదిగిన వారిలో చాలామంది వెళ్ళిపోతున్నా ఆమె మాత్రం తన చిన్నపెట్టెని చేతితో పట్టుకుని అలాగే నిలబడిపోయింది. తమిళంలో పోర్టర్ల పలకరింపులు, రైళ్ళకూతలు, రైళ్ళరాకపోకల ప్రకటనలు. వచ్చీపోయే జనం... ఆ స్టేషన్ పల్లెటూరి సంతకంటె పదింతలుగా ఉంది. అంతా అరవగోలా, అయోమయమూ.

"ఎక్కడికి పోవాలమ్మా? " తెలుగులో పలకరింపు. ఎడారిలో ఒయాసిస్‌లా అనిపించిందామెకి. "సినిమాల్లోకి" నోరు జారిపోయిందామెకి. అవతలి వ్యక్తి కంగుతిన్నాడా జవాబుకి. అతనికి నలభయి దాటి నలభయ్యయిదుకి లోపూ ఉంటుంది వయసు. మాట్లాడింది తెలుగయినా వేషధారణ తమిళుడిలా లుంగీ చొక్కా.

ఆమె పరాకుగా చెప్పిన జవాబుకి కలిగిన సంచలనంనుంచి తేరుకుందుకు కొంచెం సమయం తీసుకుని, అప్పుడు చిరునవ్వు నవ్వుతూ, "నీ పేరేమిటి? " అని అడిగాడు.

"లలిత" అందామె.

"మద్రాసులో సినిమాలు సరే. బంధువులూ, స్నేహితులూ ఎవరూలేరా? " మెల్లగా అడిగాడు.

"లేరు. ఉంటే ఇలా ఎందుకు నిలబడిపోతానూ"

"అయితే నాతోరా. నాపేరు విశ్వనాధం. నేనూ సినిమావాడినే. సినిమాలకి ఎక్స్ట్రాలను సప్లయ్ చేయడం నా వృత్తి. కావాలంటే నిన్ను దర్శకులకీ, నిర్మాతలకీ పరిచయం చేస్తాను"

"నేను ఎక్స్ట్రాని కాదల్చుకోలేదు. హీరోయిన్‌నే అవుతాను"

"హీరోయినే అవుదువుగాని అనుకూలిస్తే.



దేన్నికైనా ముందు యిక్కడినుంచి బయటకు కదలాలికదా? ఇవాళ మా యింట్లో విశ్రాంతి తీసుకుందువుగాని. రేపట్నించీ స్టూడియోల చుట్టూ ప్రదక్షిణలు ప్రారంభి ద్దువుగాని" నవ్వుతూనే అన్నాడు.

లలితకి మొన్ననే పద్ధెనిమిది వచ్చింది. ఆమెకు కాగితాలమీద చదువబ్బలేదు. అయినా పత్రికలూ, సినిమా పత్రికలూ మాత్రం తెగ చదివింది. మద్రాసు సెంటర్లో విశ్వనాథంలాంటి వాళ్ళు తగులుతారనీ, వాళ్ళమాటలు నమ్మితే అధోగతే అనీ కూడా చదివింది. కానీ ఎవరూ ఆసరా లేనప్పుడు ఏమి చెయ్యాలి? మంచివాడో వంచకుడో ఎవరో ఒకరి అండలేకుండా యిక్కడినుంచి బయటపడడమే బ్రహ్మప్రళయంగా ఉంది.

భారం దైవం మీద వేసేసి అతని వెంట నడిచింది. ఎలాగూ తనది నిండా మునిగిన బతుకే. గోచీకంటే దరిద్రమింకేముం టుంది?

ఆటో ఎన్నో రోడ్లు తిరిగి ఎట్టకేలకు ఓ యింటిముందాగింది. అది సగంషాపూ, సగం యిల్లూ. అంటే కింద దుకాణమూ, పైన యిల్లూ. ఇల్లంటే రెండుగదుల ఓ వంటిల్లు. తాళం అతనే తీస్తూండడం చూసి అడిగింది. "ఇంట్లో ఉండేది మీరొక్కరేనా? "

"నేనూ మా అమ్మాయీ. ప్రస్తుతం రోజీ వూళ్ళోలేదు. షూటింగ్‌కని బెంగుళూరు వెళ్ళింది. అలాగని నువ్వేమీ బయపడక్క ర్లేదు. నన్ను తండ్రిలాగే భావించు"

"మీరూ నన్ను అలాగే భావిస్తారా మరి? "

అతను ఫక్కున నవ్వాడు. అంతలోనే గంభీరం అయిపోయి "అలాగే. నేను చాలా విషయాల్లో మంచివాడినే" అన్నాడు అభ యమిస్తున్నట్లు.





"మీరు ఏ విషయాల్లో మంచివారు కారూ? "

"నీ అమాయకత్వానికి నవ్వా వస్తోంది. జాలీ వేస్తోంది. తాగుడు, జూదం విష యాల్లో నేను మంచివాడిని కాను" మాట్లా డుతూనే అతను కాఫీచేసి గాజుగ్లాసుల్లో పోసి ఒకటామెకందించాడు. కాఫీ తాగు తూనే "నువ్వు ఖచ్చితంగా సినిమా పత్రికలు చదివుంటావు. వాటిలో కబుర్లలోనూ, కథల లోనూ కొన్నిరకాల విలన్లలాంటి మనుషుల గురించీ చదివుంటావు. మెరిసేదంతా బంగారం కానట్లే ఆ పత్రికలలోని, కథల లోని చాలామంది మనుషుల పాత్రలూ కల్పితాలే తప్ప అందరూ నిజమైన మనుష లుమాత్రం కారు. అంచేత నా గురించి అపోహలు పెంచుకోకు. లలితా! నీ గురించి నిజం చెప్పు. దానిని బట్టి నేనేం చేయాలో ఏం చేయగలనో ఆలోచిస్తాను" అన్నాడు.

లలిత ఏమీ దాచుకోకుండా చెప్పేసింది. "ఈ ప్రపంచంలో నేను ఒంటరిని. అమ్మ, నాన్న, అక్క ఉన్నా లేనట్లే. నా బతుకు నేనే బతకాలి. నా దగ్గర వంద రూపాయలకంటే లేవు. సినిమాల్లో హీరోయిన్ వేషాలేస్తూ బతకొచ్చని యిక్కడికి వచ్చాను"

అతను జాలిగా చూశాడామెవేపు. "శుభం పలకకుండా అశుభం పలుకుతున్నానను కోకు. కీడెంచి మేలెంచమని కదా ఆర్యోక్తి. రోజూ సగటున పాతికమందేనా వస్తుం టారు నీలాగ. ఇక్కడికి అలా వచ్చేవాళ్ళలో వెయ్యిమంది కొకరేనా హీరోయిన్ కారు. ఒకవేళ నువ్వు హీరోయిన్‌వి కాలేకపోతే... మీ అమ్మానాన్నల దగ్గరకి వెళ్ళిపోతావా? "

"వెళ్ళను" స్థిరమయిన కంఠంతో అంది లలిత.

"ఎందుకని? "

"వాళ్ళు రానివ్వరు. అదీకాక వాళ్ళెక్కడుం డేదీ నాకు తెలియదు కనుక. నేను వెళ్ళ లేను. చావోరేవో యిక్కడే తేల్చుకోవాలి.

చెప్పానుగా నా బతుకునాదే. అంతే"

అంతలో ఎవరో కుర్రాడువచ్చి "విశ్వనాధంగారూ! మీకు టెలిఫోన్" అన్నాడు.

ఆయన వెళ్ళిపోతూ, "ఇల్లు జాగ్రత్త. తలుపేసుకుని ఉండు. ఇంట్లో అన్నీఉన్నాయి. వంటచేసుకో" అంటూ చెప్పేసి మరీ వెళ్ళిపోయాడు హడావిడిగా.

లలిత ఆ యింట్లో ఒక్కతే మిగిలింది. ప్రయాణపు బడలిక కాబోలు విపరీతంగా నిద్ర ముంచుకొచ్చింది. తలుపు గడియపెట్టి కనిపించిన మంచంమీద పడి నిద్రపోయింది.

మళ్ళీ తెలివిరావడం తలుపు దబదబా బాదుతున్న శబ్దాలకే.

అప్పటికి చీకటి పడుతోంది. విశ్వనాధం వచ్చాడు. అతని కంటె ముందు సారా కంపు. అతను వస్తూనే మంచంమీద కూర్చున్నాడు చాలా అలసిపోయినట్లు. "తాగున్నానని భయపడకు. తాగిన ప్రతివాడూ వాగి యాగి చేస్తాడనేది అజ్ఞానుల అపోహమాత్రమే. ఊ... మధ్యాహ్నం భోజనం చేశావా? "

"నిద్రలో పడి ఆకలి తెలియలేదు" సిగ్గుపడుతూ చెప్పింది.

"స్నానం చేసి వండు. అదే వంటగది. అది స్నానాలగది. నువ్వు నన్ను బాబాయ్ అని పిలవచ్చు. వంటయ్యాక లేపు. భోంచేస్తాను" అని మంచంమీద వాలిపోయాడు.

మర్నాడు "స్టూడియోకెళ్దాం" అని బయలుదేరదీశాడు. ఒక ఫొటోస్టూడియోలో ఫొటోలు తీయించాడు. రెండు ఫోటోలు మామూలుగా, ఫుల్ సైజులో, ఒకటి ముఖానికి క్లోజప్, ఒకటి ప్రొఫైల్, ఐదోది మాత్రం అర్ధనగ్నంగా. అది తీయించుకుందుకు లలిత సంకోచిస్తే "సినిమా అంటే ఎక్స్పోజరు. నీ ఎక్స్పోజరెలా ఉంటుందో వాళ్ళకి తెలియకుండా ఎలా 'బుక్ చేసుకుంటారూ? " అని నచ్చచెప్పాడు.

తరువాత అరవంలో స్టూడియో అతనితో ఏదో చెప్పాడు.

"నీ ఫొటోలు సినిమావాళ్ళ కోసమని బాగా తియ్యమని చెప్పాన్లే" అన్నాడామెతో.

"మరి నా దగ్గర... ఎక్కువ డబ్బుల్లేవే...'

తండ్రి తరిమేస్తూ వందరూపాయలే యిచ్చాడు మరి.

విశ్వనాధం నవ్వాడు. "డబ్బు గురించి ఆలోచించకు. నేను చూసుకుంటాను. నువ్వు సినిమాల్లో చేరాలి. అదీ ముఖ్యం. నీకు నేను గార్డియన్ని కదా. ఒక్క సినిమాకి సైన్ చేస్తివా... డబ్బుకేం కొదవ? ఆ... స్టూడియో చూద్దువుగాని. చూడాలి. సినిమాలో వేషంవేసేదానివి, స్టూడియో చూసి ఉండకపోతే అవమానం. స్టూడియోలు ఇక్కడకు దగ్గరే" అంటూ ఆటోని పిలిచాడు. డ్రయివర్కి తమిళంలో ఏదో చెప్పాడు. లలితనాభాష బాధిస్తోంది. భాష తెలియక ఏమీ తెలియడంలేదు.

"మద్రాసులోని మంచి పెద్ద స్టూడియోకి వెళ్తున్నాం మనం" అన్నాడతను ఆటో పరుగెడుతుంటే. గేటుదగ్గర పోలీసులా ఉన్న ఎవరో ఆటోని ఆపారు.

విశ్వనాధం తల బయటకిపెట్టి అతన్ని చూసి నవ్వాడు అంతే, అతనా ఆటోని వదిలాడు.

ఇతనికి చాలా పలుకుబడుందన్నమాట అనుకుందామె.

ఆటో ఆగింది. దిగారు.

"ఆ బేబీని మోసుకెళ్తున్నాడే... అతనికప్పగిస్తాను నిన్ను. షూటింగ్ జరిగే ఫ్లోర్కి తీసుకెళ్తాడు" అంటూ అతనివేపు నడవబోతుంటే...



"బేబీసేమిటి? అతను మోసుకెళ్తున్నవి లైట్లుకదా? పిల్లలు కారుకదా?" అడిగింది.

"ఆ లైట్లనే బేబీసంటారులే స్టూడియో భాషలో. నువ్వు స్టూడియో చూసి ఆటో ఎక్కి వచ్చెయ్. ఇదుగో అడ్రస్కార్డు"

"నాకు అరవం రాదుగా"

"ఆటో వాడికి కార్డు చూపించు. తీసుకొచ్చేస్తాడు. ఏమీ ఫరవాలేదు" అంటూనే అతన్నాపి తమిళంలో మాట్లాడాడేదో.

"ఇతను నిన్ను తీసుకెళ్తాడు. ఫ్లోర్లో షూటింగ్ చూపిస్తాడు. అన్నీ చూడు. తెలుసుకో"

అలాగే అన్నట్లు తలూపింది. చుట్టూ చూస్తే అది మరోప్రపంచంలా ఎన్నడూ చూడని లోకంలా ఉంది. పార్కులూ, గొడౌన్లూ, భవనాలూ... అరణ్యాలూ...

"ఈ డబ్బు ఉంచు"

"వద్దు" పైవాళ్ళ దగ్గర తీసుకుందుకు సిగ్గేసింది.

"టీలూ అవీ తాగవూ? ఆ వేళకి భోజనం చెయ్యవూ? స్టూడియోలో క్యాంటీన్లుంటాయి. కానీ వాళ్ళేమీ ఉచితంగా యివ్వరు. ఫరవాలేదు. ఉంచు నువ్వూ నేనూ స్నేహితులమే. తరవాత చూసుకుందాం" అంటూ నవ్వి వెళ్ళిపోయాడు.

"ఉంగళ్ పేరెన్న?" అడిగాడు అతనామెను చూస్తూ. ఆమె అయోమయంగా చూడడం చూసి, "తెలుగుదానివా? ఏంపేరు? సినిమాల్లో చేరాలని వస్తివా?" అంటూ టక్కున తెలుగులోకి మారిపోయాడు.

ఆమె ఊపిరి పీల్చుకుంది.

"తెలుగు అమ్మాయినే. నాపేరు లలిత. హీరోయిన్ వేషంకోసం వచ్చాను" చెప్పింది.

"మంచిది. నేనిప్పుడయితే లైట్ బాయ్ని. కానీ..."

అతని మాటలకడ్డుపడిందామె.

"మీరు బోయ్ ఏమిటి? మ్యాన్... ఎమ్ ఏ ఎన్ - మ్యాన్. మనిషి పెద్దవాగుకదా?

"స్టూడియోల్లో అంతేలే" నడుస్తూనే చెప్ప సాగాడు. "ఇప్పుడయితే బోయ్నే కానీ తొందరలో కెమేరామేన్నైపోతున్నాను. ఛాన్సొచ్చేసింది. కెమేరామేనంటే ఏంటో తెలుసా?"

"ఏమిటి?"

"అన్నీ మన యిష్టమే. మనకి నచ్చివాళ్లని తీసుకుంటాం మన సినిమాలోకి. పాపా! నువ్వు అందంగా ఉన్నావ్. నా సినిమాలో నువ్వే హీరోయిన్వి. ఇప్పుడు షూటింగ్ చేస్తున్నది చిన్న బిట్. గంటా రెండుగంటలపని. అదయ్యాక నాకు ఖాళీ. మనం మాట్లాడుకుందాం ఏం?" అలాగే అన్నట్లు తలూపింది. అతని వెనకే ఒక రైస్మిల్లులా ఉన్న గోడౌన్లోకి నడిచింది.

ఆమెను ఒకవారగా నిలుచోమని అతను తన పనిలో పడిపోయాడు. అతనికి నలభయ్యేళ్ళుంటాయి. ఆమెకతను తనని సినిమా హీరోయిన్గా చేసేవాడిలాగే కనిపించసాగాడు.

అయ్యో... పేరడగలేదే... అని చింతిస్తూ అతన్నే చూస్తూ నిలుచుందామె.

ఆమెకా పరిసరాలెంతమాత్రమూ నచ్చడం లేదు. గొడౌన్కంటే అధ్వాన్నంగా ఉందక్కడ. గాలిలేదు. వెలుగులేదు. నిలువునా చెమటలు పోసేస్తున్నాయి. నేలలో చాలా భాగం వైర్లూ అవీ. ఒకవేపు గది తాలూకు సెట్ కాబోలు. పెద్ద పెద్ద దీపాలు దెయ్యాల్లా, భూతాల్లా. సీనులో పెద్ద యాక్టర్లు లేరు కాబోలు. విజిటర్స్ నిలుచునే స్థలంలో ఆమెతప్ప ఎవరూ లేరు. ఎంతకీ ఏర్పాట్లతోనే సరిపోతుండడంతో ఆమెకు విసుగొస్తోంది. కప్పునుంచి కూడా పెద్ద దీపాలు వేలాడతీస్తున్నాడు తన ఫ్రెండ్. అతనితో మాట్లాడడం అనే పనే పెట్టుకోక




పోతే ఎప్పుడో వెళ్లిపోయుండేదామె అక్కడ నుంచి. మేడమెట్లు పేర్చాడెవడో వచ్చి హాలు సెట్ లో. ఎవరో వచ్చి సెట్ ని పరీక్షించాడు. లైట్లు ఆన్‌చేసి చూశారు. తల పంకించి వెళ్ళారు. పావుగంటలో బిలబిల్లమంటూ వచ్చారు. కెమెరాని నిలబెట్టారు. దీపాలన్నీ వేశారు. మేకప్‌లో ఉన్న గెడ్డాల వాడు విలన్ కాబోలు అటూఇటూ దొంగ చూపులు చూస్తూ హాలులోకొచ్చి అక్కడి నుంచి మేడమెట్లుమీదకి దొంగలా ఎక్కసాగాడు. ఆ చిన్నముక్కని ఒకసారి స్టెప్స్ సరిగా లేవని, మరోసారి మీసం వూడిందనీ... యింకోసారి మేకప్ చెరిగిందనీ... మళ్ళీ మళ్ళీ తీశారు పాడిందే పాట అన్నట్లు.

ఆమె సహనం పూర్తిగా చచ్చిపోయింది. చెమటతో నిలువునా నీరుకారిపోతోంది. దాహంతో పెదవులెండిపోతున్నాయి. కళ్ళు తిరిగి పడిపోతానేమో అనిపించింది. ఏ దేవతో కరుణించి అంత ప్రమాదం జరిగేలోగానే ఆ షూటింగు పూర్తయింది. అతను తన పని ముగించుకుని వచ్చాడు "పద... టీ తాగుదాం" అంటూ.

బయటికొచ్చేసరికి స్వర్గంలో కొచ్చినట్లే అనిపించింది. గొడౌనులో యిరుకు, పైనుంచి వేడి, లోపల దీపాలవేడి... ఉక్క. ఇవతల చక్కగా మొక్కలు. ప్రకృతి సహజమయిన గాలి. ఆరుబయలు. ఆమెకి ప్రాణం లేచివచ్చింది.

అతను దగ్గరలోనే ఉన్న క్యాంటీనుకి తీసుకెళ్ళాడు. ఒక చెట్టుకింద తాత్కాలికంగా ఏర్పాటు చేయబడిన టీ దుకాణమది. టీతో పాటు తినుబండారాలూ, కూల్‌డ్రింకులూ కూడా ఉన్నాయి. ఆమె కూల్‌డ్రింకు తీసుకుంది.

"పక్కఫ్లోరులో దేవిగారి షాట్స్ ఔతున్నాయిట. చూద్దువుగాని..."

"మళ్ళీ షూటింగా!" భయపడిపోయింది. మళ్ళీ నరకంలోకి వెళ్ళడమన్నట్లు.

"దేవిగారంటే ఎవరనుకున్నావ్? ఇవాళ యిండస్ట్రీలో టాప్. రేపు హీరోయిన్ అవవలసినదానివి. స్టూడియోకొచ్చి కూడా షూటింగ్ చూడకపోతే..."

వెళ్ళకతప్పలేదు లలితకి. దారిలో ఆమెకి చెట్లకింద నిలబడ్డ పులులు, సింహాలు, ఎలుగుబంట్లూ కనిపించాయి. పుట్టలూ వాటిలోంచి బయటకొస్తున్న పెద్ద పాములూ కూడా కనిపించాయి. ఆమె బెదిరిపోయినట్లు కనిపిస్తే అతను నవ్వాడు.

"అవేమీ నిజంవికావు. స్టఫింగ్ చేయబడ్డవి. అంటే లోపల గడ్డీ గాదమూ... పైన వాటితోలూ. పైన పటారం లోన లొటారం అన్నమాట. కెమేరా ముందు అదే...తెర మీద నిజంవిలాగే కనిపిస్తాయి. జానపద సినిమా షూటింగది"

ఓహో! అనుకుందామె. చెట్లకింద కొందరు మగాళ్ళూ ఆడవాళ్ళూ నిలుచునీ, కూర్చునీ ఉన్నారు.

వాళ్ళలో కొందరు బీడీలూ మరికొందరు సిగరెట్లూ కాలుస్తున్నారు.

"ఎక్స్ట్రాలు... ఎప్పుడో పిలుపొస్తుంది. అంతవరకూ యిలా నిరీక్షిస్తారు. రోజుకి వందిస్తారు. గుంపులో వాళ్ళన్నమాట. బుర్రల లెక్కకే. డైలాగూ అవీ ఏముండవు. డైలాగుంటే ఎక్కువిస్తారు. నువ్వయితే డైరెక్ట్‌గా హీరోయిన్‌వే కాబోతున్నావ్ నా పిక్చర్‌లో. నూటికీ, కోటికీ ఒకరికి తప్ప అలాంటి అదృష్టయోగం పట్టదు. చక్కని రాజమార్గమది. రేపు నీకెలాంటి ట్రీట్‌మెంటూ గౌరవమూ లభిస్తాయో యిప్పుడు షూటింగ్‌లో దేవిని చూసి తెలుసుకోవచ్చు"

లలిత అతని మాటలు వింటూనే ఆలోచించసాగింది. ఆ నిలుచున్న వాళ్లలో ఎక్స్ట్రాలలో ఒకామె తనకంటె కూడా చాలా అందంగా ఉంది. ఆమె ఎందుకు హీరో

యిన్ కాలేదూ? బహుశా ఆమెలో అందమే తప్ప అదృష్టమనేది ఆవగింజంతయినా లేదేమో. మరి... తనకి అదృష్టయోగ ముందా? ఎవరు చెప్పగలరు? తన సందే హాన్ని అతని ముందుంచింది. అతను ఫక్కున నవ్వేసి,

"చంకలో పిల్లిని పెట్టుకుని వూరంతా వెదికినట్లుంది నీ తంతు. అమ్మాయ్... నేను హస్తసాముద్రికం కూడా చూడగలను. ఎందరిచేతులలో చూసి చెప్పాను. అవి అలా దిగిపోయాయి. అందుకే నన్నిక్కడ గురూజీ అంటారు చాలామంది. నీకూ చూసి చెబుతాలే"

వీళ్ళు వెళ్ళేసరికే అక్కడ సెట్ సిద్ధంగా ఉంది. అదీ ఇన్‌డోర్ షూటింగే. ఒక పాట లోని బిట్‌కి ప్యాచ్‌వర్క్. సెట్ ఇంద్రలో కంలా ఉంది. నకిలీ ఇంద్రలోకం. దానిలోకి పొగలు పంపుతున్నారు. ఆ పొగల మధ్య హీరోయిన్ నాట్యం. ఆ పొగలలో ఆమె కనిపించడంలేదు. ఆమె వంటిమీద దుస్తులూ కనిపించడంలేదు. ఒక కుక్క మొరిగేటప్పటికి మరో పదికుక్కలు అందు కున్నట్లు ఆమె ఒక భంగిమ నర్తించేసరికి వెనక పదిమంది తయారు. సెట్ దిగువ ఒక పక్కనుంచి రికార్డులోంచి మ్యూజిక్కు. షరా మామూలే. అదే మ్యూజిక్ బిట్టూ, అదే డ్యాన్సు బిట్టూ. హీరోయిన్‌కి నిముషనిముషానికీ మేకప్ దిద్దడమే. దర్శ కుడు, కెమేరామేనూ, నృత్య దర్శకుడూ ఆమెకు అడుగులకి మడుగులొత్తుతున్నారు. ఎలా అయితేనేం అయిందా బిట్. కట్ చెప్పడమేమిటీ అందరూ హీరోయిన్‌కి అభి నందనలు చెప్పడమూ కూల్ డ్రింకూ అవీ అందించి సపర్యలు చేయడమూ మహారాణి లాగా చూస్తున్నారు.

లలితకి విసుగొచ్చేసింది. కానీ అతను మెల్లగా అడిగాడు.

"ఇంకో బిట్ ఉంది. సెట్ కొంచెం మారుస్తారు. చూస్తావా? కానీ కొంచెం టైము పడుతుంది మరి"

ఆమె వద్దన్నట్లు చూసింది. నిజానికామె దృష్టంతా హీరోయిన్‌తో నాట్యం చేసిన ఎక్స్ట్రాల గుంపు మీదే ఉంది. వాళ్ళకి అద్భుత మైన మేకప్పేమీలేదు. అయినా వాళ్ళలో కొందరు హీరోయిన్‌కంటే తామే అందంగా ఉన్నారు. తన కంటేకూడా!

ఆమెకి తన అందంమీద తనకే అపన మ్మకం కలిగింది.

ఇద్దరూ నడుస్తూంటే అతనొక గది చూపించి "హీరోయిన్ మేకప్ రూమ్" అన్నాడు.

"మరి ఎక్స్ట్రాలకీ? " అనాలోచితంగా అడి గిందామె.

"వాళ్ళకి ప్రత్యేకంగా గదులుండవు. ఎక్కడో ఓచోట యింత రంగు పులిమేస్తా రంతే"

"అయినా వాళ్ళే కొందరు హీరోయిన్ కంటె ఎక్కువ అందంగా ఉన్నారు"

"అందమా! గొర్రెల గోత్రాలు గొల్లకెరుకని నాకీ హీరోయిన్ల నిజసౌందర్యాలు చాలా మందివి తెలుసు. బయట కూడా బాగుండే హీరోయిన్‌లు అరుదు. గంధం వొలిచేసిన ఉగ్ర నరసింహస్వామిలా, మేకప్ తీసేస్తే చాలామంది సినిమాతారలు భయంకర పిశాచులే" నవ్వాడు.

లలిత తానతనితో మాటలలో పడి నడుస్తూ ఒక నిర్జన ప్రదేశానికి వచ్చినట్లే గమనించలేదు. చుట్టూ చెట్లు, మధ్యన లాన్.

"ఇక్కడ కూర్చుందాం" అని ఆమెని కూర్చోబెట్టి "నీ చెయ్యి చూసేదా? అదే హస్తసాముద్రికం చూడ్డానికి. నేనెలాగూ నా పిక్చర్‌లో హీరోయిన్ వేషమిస్తాననుకో ఊరిస్తున్నట్లన్నాడామె చేయందుకుని. ఆమె చేతిని పట్టుకుని హస్తరేఖలను పట్టిపట్టి





చూస్తూ, "తప్పదు... నీకు హీరోయిన్ యోగం తప్పదు. స్పష్టంగా రాసిపెట్టి ఉంది. ఇండస్ట్రీనేలేస్తావ్. నీకు గుండెలమీద పుట్టుమచ్చుండాలే" అన్నాడు.

"ఏమో నేనెన్నడూ చూసుకోలేదు"

"పోన్లే, నేను చూస్తానిప్పుడు. ఆ పుట్టుమచ్చ ఉంటే అష్టయిశ్వర్యాలు నీవే. అరె! ఎందుకలా సిగ్గుపడతావ్? నేనేగా? నీ పిక్చరుకి కెమేరామెన్‌ని" అంటూ అతనామె జాకెట్ విప్పెయ్యబోయాడు.

అప్పటికి తెలిసిందామెకు. అతని ఉద్దేశమూ, తనపరిస్థితీ. హారి ముసలిపీనుగా! నీ మనసులో యిలాంటి ఊహలున్నాయా అంటూ లేచి పరుగెత్తింది. అతన్నుంచి తప్పించుకోడమూ, దూరంగా పోవడమే ధ్యేయంగా పరుగెడుతున్న ఆమె ఎక్కడికి పోతూందో ఎటు పోతోందో ఆమెకే తెలియదు. అతని బారినుంచి బయటపడ్డాననే ధైర్యం కలిగాక ఆమె ఆగింది. అప్పటికామె చిన్న పార్కులా ఉన్న ప్రదేశపు కంచెమొక్కల కివతల ఉంది. కంచెవతలినుంచి ఒక స్త్రీ కంఠమూ, ఓ పురుషకంఠమూ. రొప్పుతూ నిలబడిన ఆమెకామాటలు స్పష్టంగా వినపడుతున్నాయి.

"నాటి సినిమాలకీ నేటి సినిమాలకీ తేడా ఏమిటంటారు?"

"నా సమాధానం మొరటుగా ఉంటుంది మరి"

"ఫరవాలేదు. నిస్సంకోచంగా చెప్పండి"

"నాటి సినిమాలు జ్ఞానేంద్రియాలను వికసింపచెయ్యడానికి కాగా నేటి సినిమాలు ప్రేక్షకుల జననేంద్రియాలను వికసింపచెయ్యడానికే పనికొస్తున్నాయి. నేటి సినిమాలలోని హీరోయిన్ బట్టలు ఆమె మోకాళ్ళ మీద ఎంత ఎత్తువరకూ తొలగితే నిర్మాత అంతగా బతికి బట్టకడుతున్నాడు. అంటే... యివాళ సినిమాని బతికిస్తున్నది బూతు!"

"ఎందుకిలా జరుగుతుందంటారు?"

"ప్రేక్షకులలో వచ్చినమార్పు, సినిమావాళ్ళలో వచ్చినమార్పూ"

"ఏమిటా మార్పు?"

"ప్రేక్షకులు మునుపు సినిమాకి కథకోసం వెళ్ళేవారు. ఇప్పుడు నటీనటులని చూసుకుందుకు వెళ్తున్నారు"

"ఈ పరిస్థితి మారుతుందా?"

"తప్పకుండా మారుతుంది. ఇంకా దిగజారుతుంది. తెలుగు సినిమా బూతు సినిమా అయ్యే బంగారురోజు ఆట్టే దూరంలో లేదనే నా విశ్వాసం"

"మీరు చాలా యాంగ్రీ యంగ్ ఓల్డ్ మాన్! అయినా ఇంటర్వ్యూ యిచ్చినందుకు చాలా థాంక్స్"

"నేను మీకు యింకా ఎక్కువ థాంక్స్ చెప్పాలి. ఫేడౌటయిన నన్ను ఇంటర్వ్యూ చేసినందుకు"

ఆమె అక్కడనుంచి కదిలింది. ఎవరో తనలాగే స్టూడియో చూడడానికి వచ్చినవారిలా ఉన్నారు, మాట్లాడుకుంటున్నారు తెలుగులో.

"ఇప్పటి సినిమాలో పాత్రధారి గాత్రధారి కానక్కర్లేదు. నిజానికి నటీనటుల్లో చాలా మంది అసలు కంఠం వింటే ప్రేక్షకశ్రోతలు ఆమడదూరం పరుగెడతారు. పూర్వకాలపు కెనెడియన్ రైలింజను చప్పుడే నయమంటారు"

"రూపం మేకప్‌మేన్ ప్రసాదం, కెమేరామెన్ నైపుణ్యమూ. గాత్రం డబ్బింగ్ ఆర్టిస్ట్ దయ."

మాటలు రాసిచ్చేది రచయిత. మరి నటీనటులు చేసేదేమిటో?

"నటిస్తారు"

"ఏం నటనో"



"మనవాడిని కలిసొద్దాం పదండి"

లలిత కూడా వాళ్ళతోనే నడవసాగింది. విశాలమయిన ఆ స్టూడియోలో ఆమెకెన్నో అందాలూ అద్భుతాలూ ఎదురయ్యాయి. ముఖ్యంగా ఆ చిట్టడవులూ పార్కులూ ఆమెకి తెగ నచ్చాయి. ఆమె ఆలోచిస్తూ పరధ్యానంగా నడవసాగింది. హఠాత్తుగా ఎవరివో కంఠాలు.

"ఈ సీనులో నువ్వేడవాలమ్మా, రోదించాలి" బతిమాలుతున్నాడతనెవరో సహాయ దర్శకుడిలా ఉన్నాడు.

"ఏడవడమా! వాడ్డూ యూ మీన్? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నంబర్‌వన్ తో..."

"అలా అంటే ఎలా అమ్మా? "

"మరెలా అనమన్నావు? ఏడవడం... క్రయింగ్ నాకు చేతకాదే" మండిపడిందా నటి.

"అలా అనకండి మాడమ్. మీరేడవాలి. ఏడ్చితీరాలి. నాకోసం కాదు, సీనుకోసం" అతను ఏడుస్తున్నట్లు దీనంగా అడిగాడు. "మీరెప్పుడూ ఏడవలేదా? "

"ఎప్పుడేనా ఏడిచానేమో. జ్ఞాపకంలేదు. నేను పుట్టిందైశ్వర్యంలో. పెరిగిందైశ్వర్యంలో. నాపేరే ఐశ్వర్యం. నాకు ఏడిచే అవసరమూ కర్మా ఏమిటి" చికాకుపడింది.

"మీవాళ్ళు... అమ్మగారో... నాన్నగారో పోయినప్పుడు..."

"మా నాన్నగారెవరో నాకు తెలియదు. మమ్మీ నిక్షేపంలా ఉంది"

"పోనీ... బంధువులలో ఎవరేనా" గొణిగాడతను.

"నాకు బంధువులూ లేరు చెప్పుకోదగ్గవారు"

"మరెలా అబ్బా... ఆc అమ్మా... మీ పెంపుడు కుక్కలలో ఏదేనా ఎప్పుడేనా..."

"ఆc... ఒకసారి ఒకటి చనిపోయింది. నా కళ్ళముందే డైడయిపోయింది"

"అప్పుడు మీకు దుఃఖం వచ్చిందికదా? "

"ఊc..."

"అది జ్ఞాపకం తెచ్చుకుని... అచ్చంగా అలాగే ఏడవండమ్మా చాలు. ఒక్కసారి ఫ్లాష్‌బ్యాక్‌లో ఆ కుక్క చనిపోయిన సీనునీ అప్పుడు మీరు రోదించడాన్నీ గుర్తుతెచ్చుకుని"

"అలాగే...కానీ ఎందుకు? సీనేమిటీ? "

"స్టోరీలో మీ భర్త చనిపోతారు. మీరు దుఃఖించాలి. ఆ సీను తీస్తారివాళ"

"ఒహో! ఎందుకేనా మంచిది. మీరోసారి ఏడిచి చూపించండి. నేర్చేసుకుంటాను"

అతను ఏడవసాగాడు ఆమెకు చూపించేందుకో, లేక తన కర్మ అలా కాలినందుకో.

అదే సమయంలో విశ్వనాథం ఎక్కడినుంచో అటు రావడంతోఅతని వెంట నడిచింది తను కూడా.

"భోజనం చేశావా ఎక్కడేనా? "

"లేదు" అనేసింది సిగ్గూ మొహమాటాలూ వదిలేసి. కడుపులో ఎలకలు పరుగెడుతున్నాయి. ఎండ... తిరుగుడు... కనిపించని అలసట.

"తింటావా? "

"ఊc..."

అతనామెను క్యాంటీన్‌కి నడిపించాడు. ఆకలిమీదుందేమో ఆమెకా భోజనం అమృతంలాగే అనిపించింది. ఆకలి తీరి ఆత్మారాముడు శాంతించాక మెల్లగా అంది. "స్టూడియోలో అదే... ఇన్‌డోర్ షూటింగులు... కష్టమే. చూడడానికి విసుగెత్తింది. వాళ్ళు... నటించేవాళ్లకి మరెంత కష్టమో. ఆ లైట్లకాంతి కళ్లలో పడుతుంటే, ఉక్కకి చికాకేస్తూంటే వేడికి చెమటలు పోసేస్తూ మాటిమాటికీ మేకప్ దిద్దవలసి వస్తుంటే




నటించడానికి నైపుణ్యం మాట దేముడె రుగు, ముందు ఎంతో సహనముండాలి"

"అంతాయింతాకాదు. గాడిదకుండేంత సహనముండాలి" నవ్వాడతను.

"తీసిందే తియ్యడం. ఏ చిన్న పొరపాటు జరిగినా రెడ్డొచ్చె మొదలాడడమే"

"మరేమనుకున్నావ్? సినిమావాళ్ళ బతుకులు పూల బాటలేమీకావు. వాటిలోనూ రాళ్ళూ ముళ్ళూ తక్కువేమీ ఉండవు"

"నిజమే. దూరపు కొండలే. అయినా వీళ్ళ కొచ్చే డబ్బూ, పేరు ప్రఖ్యాతులూ తక్కువ కావు"

"వాటికోసం వీళ్ళు చెల్లించవలసిన మూల్యమూ తక్కువకాదు" ఒకసారాగి, "ఇంకా చూస్తావా యిక్కడ? " అడిగాడు.

"అక్కర్లేదు. బాగానే చూశాను. మావూరు పెద్దదేమీకాదు. నాకు తెలిసి అక్కడ సినిమా షూటింగులు చెయ్యలేదు. అందు కని కొత్త"

"ఇంటికి వచ్చేస్తావా అయితే? నేనటే వెళ్తున్నాను"

"ఓ" అందామె మహదానందంగా అర వంలో ఆటో బేరమాడడం తప్పినందుకు.

గేటులోపలే కాళీ ఆటో తగిలింది. కొంత దూరం పరుగెత్తాక ఒక బ్రిడ్జి దగ్గర ఆగిపో యిందది. "ట్రాఫిక్ జామ్" అన్నాడు డ్రైవరు. విశ్వనాథం కిందకి దిగి సంగతే మిటో కనుక్కొచ్చి "లలితా, ఇక్కడ షూటింగ్ జరుగుతోంది. ఔట్ డోర్ కూడా చూసేసినట్లవుతుంది దిగిరా" అన్నాడు.

"ప్రేమ విఫలమై హీరోయిన్ బ్రిడ్జిమీంచి నదిలోకి దూకేసేషాట్. ఎవరో రక్షిస్తారు. ఇలాంటి సీనుల్లో హీరోయిన్‌లు నటించరు. ఇటువంటి షాట్లకి రారు వారు" అంటూ జనంలోంచి ముందుకి తీసుకెళ్లాడు.

"మరి... ఆమె... హీరోయిన్‌లాగే ఉందే! అచ్చంగా హీరోయిన్‌లాగే ఉందే"

"లా ఉంది కానీ కాదు. డూప్. హీరోయిన్‌లా ఉంది కాబట్టే ఆమెకి డూప్ కాగలిగింది"

"ఆమె పేరు? "

"సాధారణంగా డూప్‌లకి పేర్లుండవు. అట్టే పేమెంటూ ఉండదు"

"మరేముంటుంది? "

"కష్టం"

మేకప్ చెరిగిందనీ, యాంగిల్ సరిగాలేదనీ, తీసిందే తీస్తూ ఆ చిన్న బిట్‌కి పక్కా గంటచేశారు. అప్పుడు క్లియరయింది ట్రాఫిక్ జామ్. ఇదీ ఒకందుకు మంచిదే అయిందనుకుంది లలిత. వైద్యుడూ పాలే చెప్పాడు, రోగీ పాలే కోరాడన్నట్లు యీ ట్రాఫిక్ జామ్ తన మనసులో కోరిక తీర్చేసింది. ఔట్ డోర్ షూటింగ్ కూడా చూసింది.

విశ్వనాథం బాబాయ్ తనని దింపేసి వెళ్ళిపోయాడు. ఇంటికి రావడమేమిటి, మంచంమీద పడిపోయింది. కనిపించదు కానీ స్టూడియోలో తను తక్కువ తిరగలేదు. అందులోనూ ఆ కెమేరామెన్ కీచకుడినుంచి తప్పించుకుందుకు పరుగొకటి. ఎంత ధైర్యం వాడికి! అంత వయసుండి ఆబగా తనని కోరాడు. స్థానబలం కొద్దీ కాబోలు. తనదీ తప్పుంది. ఎవరికి పడితే వారికి చెయ్యివ్వడమేమిటీ బుద్ధిలేకపోతే? ఏం చేస్తుందీ తనుమాత్రం? బలహీనత. వర్తమానం అయోమయంగా అడవి పంచాంగంలా ఉండడంతో భవిష్యత్ గురించి భయమూ ఆత్రుతా. రేపయినా హాయిగా ఉంటుందో లేదో తెలుసుకోవాలనే కుతూహలం. తనకి సినిమాల్లో స్థానం దొరుకుతుందో దొరకదో తెలుసుకోవాలనే

ఆరాటం.

తనకి సినిమారంగంలో ప్రవేశం లభిస్తుందా? ఏమో. ఆ ఎక్స్ట్రాలలోనే తనని తలదన్నిన అందగత్తెలున్నారు. వాళ్ళని చూశాక తన గురించి సందేహమూ భయమూ కలిగాయి. నిజంగా తనకి ఛాన్సు నేది వస్తే, అందువల్లకాక అదృష్టంకొద్దే రావాలి. ఔనూ... ఆ స్టూడియోలో మేకప్ చేసి మరీ ఫొటోలు తీశాడే! ఆ అర్ధనగ్న ఫొటో కూడా ఎందుకూ? తనకి చచ్చేంత సిగ్గేసింది. తనకి సినిమాయోగం ఉందా?

ఆలోచనలలోనే నిద్ర కమ్మేసింది... అల సిసొలసి ఉన్న ఆమెని.



'మూడవ రోజున ఫొటోలు తెచ్చాడు విశ్వనాధం. వాటిని చూసి తెగ మురిసిపోయింది లలిత. అవి అంత బాగున్నాయి. తానేనా అంత అందంగా ఉంది అనిపించిందామెకే. వాటిని చూశాక ఆమెలో ఆత్మవిశ్వాసం కలిగింది. అర్ధనగ్న ఫొటో చూస్తే మాత్రం అదోలా అనిపించింది.

"ఇవాళ చాలా వార్తలున్నాయి. మొదటిది ఫొటోలు. ఇవి చూశాక నిన్నెవరూ ఫొటో జెనిక్ కాదనలేరు. బయటకంటే ఫొటోలో అంటే తెరమీద బాగా కనపడడమే సినీతార కావలసిన వారి మొదటి అర్హత. రెండో వార్త రోజీ రావడం ఆలస్యం కావొచ్చు మూడోది ఈ ఫొటో కాపీలు ఓ ప్రొడక్షన్ ఆఫీసుకి ఇచ్చాను. నాలుగోది కాకతాళీయంగా ఈ ఫొటోలు చూసిన ఓ నిర్మాత రేపు నిన్ను స్క్రీన్‌టెస్టుకీ, వాయిస్ టెస్టుకీ తీసుకురమ్మన్నాడు. ఈ శుభవార్తలు ఇంతటితో సమాప్తం" విశ్వనాధం మహోత్సాహంగా ఉన్నాడు.

లలిత సంగతి చెప్పనే అక్కర్లేదు. గాలిలో తేలిపోతోంది. కలలలో విహరించేస్తోంది.

"స్క్రీన్‌టెస్టుకి పిలిచిన ప్రొడక్షను ఆషామాషీదికాదు. నీ ఫొటోలిచ్చినదీ మంచి కంపెనీకే" చెప్పి సీసా తెరిచాడతను. ఆమె గ్లాసూ నీళ్లూ తెచ్చిపెట్టి.. "మీ మేలు జన్మలో మరచిపోలేను బాబాయ్. ఇదంతా మీ చలవే" అంది కృతజ్ఞతా సూచకంగా.

మర్నాడామెకొక సమస్య ఎదురయింది. తన దగ్గర ఒక్కటంటే ఒక్క మంచి చీరయినా లేదు. సినిమావాళ్ల దగ్గరకి సాదాచీరతో ఎలా వెళ్లడం? ఏం బాగుంటుందీ అలా? ఆ సమస్యని విశ్వనాధం పరిష్కరించేశాడు.

"రోజీ ఏమీ అనుకోదులే. ఆమె చీరల్లో నీకు నచ్చింది తీసి కట్టుకో" అన్నాడు.

లలిత రోజీ వార్డ్‌రోబ్‌నుంచి మంచి బట్టలెన్నుకుంది. ఆటోలో ప్రొడక్షనాఫీసు చేరుకున్నారిద్దరూ. రోజీ చీరకట్టుకోవలసి వచ్చినందుకు వీచారిస్తూ సినిమా స్టార్ కాగానే మంచివి ఓ వంద చీరెలు కొనెయ్యాలనుకుందామె.

ప్రొడక్షన్ వాళ్లు ఆమెకు మేకప్ చేశారు. వారి బట్టలు వేశారు. వివిధ భంగిమలను ప్రదర్శించమంటూ షూటింగ్‌లాగే తీశారు. అక్కడినుంచి రికార్డింగ్ సెక్షన్‌కి తీసుకెళ్లి

రకరకాలుగా మాట్లాడించి వాయిస్ రికార్డు చేశారు. అదంతా చూస్తుంటే ఆమెకప్పుడే తార అయిపోయిన భావన కలిగింది. వాళ్లెంతో మర్యాదగా, గౌరవంగా పెద్ద సినీ తారని గౌరవించినట్లే గౌరవించారు. భోజనం వారే ఏర్పాటు చేశారు. కాఫీలూ అవీ చెప్పనే అక్కర్లేదు. విందులాటి భోజనం అయ్యాక వాళ్లే కారులో ఇంటి దగ్గర దింపారు. ఆ ట్రీట్‌మెంట్‌కామె పొంగిపోయింది.

చీకటిపడుతోంటే విశ్వనాథం పూజకి కూర్చున్నాడు. "టెలిఫోన్" అంటూ కింద నుంచి మెసేజ్. వెళ్లి ఒక్క నిముషంలో ఆమెని రమ్మని కబురు చేశాడు.

"ఉదయం స్క్రీన్ టెస్ట్ చేశారుకదా. సఖ్య ప్రొడక్షన్స్ ప్రొడ్యూసరూ, డైరెక్టరూ, ముఖ్యు లంతా కలసి నీ గురించి నిర్ణయం తీసుకుం టారట. రాగలవా? అని అడుగుతున్నారు"

అలా అడిగితే ఆలోచించుకుందుకు వ్యవ ధేముంటుంది? "రాగలను" అంది.

"నాలుగార్లు నంబరుగల కారొస్తుంది. దాన్లో వచ్చెయ్యండి సుమారు ఏడున్నరకి"

"అలాగే నమస్కారం"

మేడమీదకి వచ్చాక "మరో గంటలో మనం వెళ్లవలసుంటుంది. దయచేసి తాగ కండి బాబాయ్" అంటూ ప్రార్థించింది. ఎంతో అయిష్టంగానూ, మొహమాటపడిపో తూనూ. ఎంత అసహాయత తనది! ఆడ పిల్ల... ఒంటరిగా రాత్రివేళ వెళ్లలేదు. తోడు తీసుకెళ్లకపోతే అవతలివాళ్ల దృష్టిలో కూడా తేలికగానే కనిపిస్తుంది. ఎవరో పరా యివాడిని సాయం కోరాలి. ఎంత ఇబ్బంది కరమైన పరిస్థితి.

"పని పాడుచేసేంత పూటుగా తాగనులే" అన్నాడతను. కొంచెం విసుక్కుంటూనూ, నువ్వు నాకు చెప్పేదానివా అన్నట్లూ. తన తాగుడిమీద ఆక్రమణలనతడు క్షమించడు.

ఏడున్నరకన్న కారు ఎనిమిది దాటాక వచ్చింది. విశ్వనాథం కారులో కూడా తాగు తూనే ఉన్నాడు. కారు నగరం దాటిపో తూంటే గమనించి కాబోలు అడిగాడు. "ఎక్కడికెళ్తున్నాం?"

"మహాబలిపురం... గెస్ట్ హౌస్‌కి" కొంచెంసేపు సముద్రతీరంలోనూ శిల్పాల ప్రాంతంలోనూ షికారు తిప్పి కాటేజీకి తీసు కెళ్లాడు. ఎక్కువ గదులుగల ఇంద్రభవనం లాటి కాటేజది. ఎంతో గొప్పగా ఉంది. తను ఆ గది తలుపు తోసుకుని వెళ్లడమే మిటి,

"వెల్‌కమ్ మిస్ లలితా! వుడ్‌బి సినీ స్టార్" అంటూ ఆహ్వానించాడు అక్కడున్న పెద్దమనిషి.

"నమస్కారమండీ"

"నేను డైరెక్టరు యయాతి" అప్పటికే తాగున్నట్లు మాట ముద్దగా ఉంది. "కమాన్, కూర్చో" ఆ గదిలో తామిద్దరే. ఆమెకు భయమేసింది. గది ఏసి అయినా చిరు చెమటలు పట్టాయి. "దగ్గరగారా... నిన్ను క్లోజప్‌లో చూడాలికదా?" అంటూ మంచంమీద తను జరిగాడు. "ఊఁ నాటకా నుభవమేమయినా ఉందా?"

"లేదం...డీ" అంది జంకుతూ. ఆ అను భవరాహిత్యం తన అవకాశానికడ్డుపడదు కద?

"మరీ మంచిది. తాజా పుష్పం. నీలాటి అందాల గులాబీ మొగ్గకి... తాజా పుష్పా నికి అనుభవంలేకపోతేనే మంచిది"

"థాంక్స్..." గొణుక్కుంది.

"సినిమాలు బాగా చూస్తూంటావా?"

"ఊఁ"

"చూడబోగా నువ్వు మరీ బిడియస్తురా లిలా ఉన్నావే! ఇలా అయితే రేపు సిని మాల్లో ఎలా నెగ్గుకురాగలవూ? ప్రెట్టీలిల్లీ"

అంటూ చటుక్కున ముద్దుపెట్టుకున్నాడు మెరుపులా.

దానికెలా స్పందించాలో, చిరునవ్వు నవ్వాలో? చెంపదెబ్బ కొట్టాలో? తెలియ లేదు. "నీ ఫొటోలు స్క్రీన్ యిమేజీ చూశాను. ఎక్సలెంట్. నువ్వు వెండితెరకి చక్కగా సూటవుతావు. కాని ఇలా ముడుచు కుపోతే మాత్రం కుదరదు" అంటూ తన చుట్టూ చేయిపోనిచ్చి దగ్గరకు తీసుకుని "ప్రొడ్యూసర్‌కి నేను సిఫార్సు చేస్తాను. నేను చెప్పాక కాదనడు. ఏవీ నీ అందాలు? "

ఏం జరుగుతోందో తెలియని మైకం ఉందా గదిలోని పరిమళంలో. చిన్న వయసు, ఒంటరిదాన్ని. ఆశలపల్లకీలో ఊరే గుతున్నదాన్ని. అమాయకురాలిని. అభమూ శుభమూ తెలీనిదాన్ని. అతనా అన్నివిధాలా గొప్పవాడు. పెద్దవాడు. అను భవశాలి. ఎందరినో చూసినవాడు. నాలాటి అమాయకపు లేడిని వశపరచుకోడం అతని కెంత?

"నా పిక్చర్లన్నిటిలోనూ హీరోయిన్‌వి నువ్వే" అన్నాడు.

"నీలాంటి స్లిమ్ అండ్ బ్యూటీ ఫీల్డుకే వరం" అన్నాడు.

నా అందాలను చూడకుండా ఉండలేకపో తున్నానన్నాడు. "అలా మాటలలో నన్ను కలలలోకి ఎగరేసి మునగచెట్టెక్కించేసి అక్కడినుంచి నేను దిగేంతలో తన కార్యం తాను కానిచ్చేసుకున్నాడు.

నేనీలోకంలోకి వచ్చేసరికి నా ఒంటిమీద నూలు పోగులేదు.

నా అందాలతో అతను విందులు చేసేసు కుంటున్నాడు. అంత వయసువాడూ అతి ఆబగా.

దొంగలతల్లికి బయటికేడవ భయమని.. నేను మనసులోనే ఏడ్చుకున్నాను. నా శీలం... కన్యత్వం మురికి గుంటలో పోసి నట్లు ఈ ముసలివాడికి నైవేద్యమయిందా! నా ఇష్టమూ అధీనమూ లేకుండా నా కన్యాత్వం ఇలా దోచుకోబడిందా!

అతను తనివి తీరేవరకూ నా తనువుతో ఆడుకుని "నేను సిఫార్సు చేస్తాననుకో. కాని ఈ ఫీల్డ్ హీరోది. ఏ హీరోయిన్‌ని రానివ్వా లన్నా అతనిష్టమే. హీరోలదే సినీరాజ్యం. అంచేత అతన్ని కూడా మంచిచేసుకో" అనేసి నా కన్యాత్వపు మరకని మరోసారి తృప్తిగా చూసుకుని అతను ఆ గదిలోంచి వెళ్ళిపోయాడు.

బాత్‌రూమ్‌కెళ్ళి బట్టలు కట్టుకుంటూ ఒక్క ఏడుపయినా ఏడ్చుకున్నానో లేదో బజర్... గబగబ పౌడరూ చిరునవ్వూ పులుముకుని గది తలుపు తీశాను.

అతను... అతనిలో ఏదో పోలికలు కన పడ్డాయి ముఖంలో. అతను బనీనూ లుంగీల్లో ఉన్నాడు. ఆ దుస్తులే చెబుతు న్నాయి అతనికి ఎంత నిర్లక్ష్య భావముందో.

"హాయ్ బేబీ! యూ... స్వీటీ.. వెరీనైస్.. నీలాటి హీరోయిన్ కోసమే కలలుకంటు న్నాను. వాటే బ్యూటిఫుల్ రోజ్!" అంటూ బుగ్గలమీద ముద్దు పెట్టుకున్నాడు. అతని నుంచి కంపు. మద్యం కంపు. మేకప్‌లోనూ డ్రెస్‌లోనూ లేడతను. కండలు వేలాడు తున్న శరీరం, బొజ్జ. ముడతలు పడుతున్న ముఖం. ఈ భీకరాకారుణ్ణి తెరమీద అలా చూపగలుగుతున్న మేకప్ మాన్, కెమెరా మాన్‌లు నిజంగా గొప్పవారే. రాక్షసుణ్ణీ, రౌడీనీ, గూండానీ చూస్తున్నట్లే ఉంది.

"ఐ లైక్ యు బేబీ. నో ప్రాబ్లెమ్... నా హీరోయిన్‌గా నీకు రెండు పిక్చర్లు శాంక్షన్" అంటూనే నన్నాక్రమించుకున్నాడు. ప్రతి ఘటించడానికి కూడా ఓపిక లేకపోయింది.

ఆ మృగం మానభంగమూ అత్యాచా రమూ చేసి "ఏమయినా ప్రొడ్యూసర్





ప్రొడ్యూసరేకదా పాపం. వాడి గురించి కూడా మనం కాస్త ఆలోచించాలి. నా వరకూ నీకు గ్రీన్ సిగ్నలే. ప్రామిస్" అంటూ పెదవులమీద ముద్దుపెట్టుకుని "వాడిని కూడా జాగ్రత్తగా చూసుకో" అని వెళ్లిపోయాడు.

నేను మళ్లీ బాత్‌రూమ్‌లోకి నడిచాను. ఈసారి ఏడుపు రాలేదు. మనసు శూన్యమూ ఎడారీ అయిపోయింది. అయితే ఒకందుకు మాత్రం బాధేసింది. చివరకొక మృగం కూడా నన్ను బలాత్కరించింది. రెండుసార్లు!

మళ్లీ బజర్...

మళ్లీ మంచంమీద కొత్త దుప్పటి. మళ్లీ టీపాయి మీద కొత్తవిస్కీ గ్లాసు.

ఈసారి గదిలోకి వచ్చింది మనిషికాదు. మనీ!

డబ్బుని అస్తవ్యస్తంగా ఓ పెద్ద బస్తాలో కూరితే అతనిలా ఉంటుంది. లేదా అట్నించి టు. బస్తా నుంచి గబ్బుకంపు. ఇతను ఒక్క లుంగీతోనే వచ్చేశాడు. బానపొట్ట... గుండెలమీదా భుజాలమీదా వొత్తుగా రోమాలు. పరాకుగా చూస్తే ఎలుగుబంట నుకునే ప్రమాదముంది.

"రంజుగున్నవే రావే, బొమ్మలా బాగుంట వుగానీ పడకెలా చేస్తవో కూడా చూస్తానే చిలకా" అంటూ ముందుకొచ్చాడు. డబ్బు తప్ప అతనికి సంస్కారంకాని, సభ్యతకాని, రూపంకాని ఏమీ ఇచ్చినట్లు లేదు దేముడు. నిండా ములిగాక చలేమిటనుకున్నాను మన సులో. ఎలాగూ ఈ బతుకు కుక్కలూ పందులూ చింపిన విస్తరే అయింది. ఇంక కొత్తగా చెడేందుకేముంది?

ఆ ఎలుగుబంటి నన్ను వదిలివెళ్లలేక వెళ్ల లేక వెళ్లింది.

ఇంకా ఎవరు? ఎందరు? అది ఆలో చిస్తూ బాత్‌రూమ్‌లోకి వెళ్లాను. ఎంతకీ బజర్ మోగకపోడంతో మానభంగ పర్వా నికి తెరపడిందనుకుని స్నానానికుపక్రమిం చాను. మనసువరకూ అంటిన మాలిన్యం ఎన్ని నీళ్లు పోసుకుంటే వదులుతుంది? చివరకి గంగాస్నానం చేసినా తొలిగేనాయీ మాలిన్యం?

తరువాత తెలుస్తుంది తమాషా అన్నట్లు అత్యాచారానికి అంతం ప్రాప్తించాక ఇప్పుడు ఒళ్లంతా సలుపు. చితక్కొట్టినట్లే అలసట. శరీరమంతా పచ్చిపుండులాగే ఉంది. స్నానం చేసి బట్టలు కట్టుకునేటప్పటికి బజర్! ఒళ్లుమండిపోయింది. వచ్చిన వాడె వడవనీ, ఒక్క లెంపకాయ కొడదామని చెయ్యెత్తి మరీ తలుపు తీసింది. ఎదురుగా విశ్వనాథం!

తెగతాగి ఉన్నాడని వాలకమే చెబు తోంది.

"మనం వెళ్లిపోదామంటే కారు రెడీగా ఉంది" ఒక్కో మాటా నొక్కినొక్కి పలికాడు.

"ఇంతవరకూ ఎక్కడికి పోయారు బాబాయ్!"

"నాలోకంలోకి నాటు సారాలోకంలోకి. నాకంలోకి నా హాయిలోకి"

ఇక అతన్నేమన్నా ప్రయోజనం లేదని "పదండి" అంది.

"ఒచ్చిన పనయిందా విజయవంతంగా? "

నేనేమీ చెప్పలేదు.

ఇంటికెలా వచ్చిపడిందీ కూడా తెలి యదు. వస్తూనే మంచం మీద పడిపో యాను. ఎడతెగని దుఃఖమొస్తుంది కాని కన్నీళ్లు మాత్రం రావడంలేదు! కళ్లు మండు తున్నాయి. భరించలేని బాధ! జరిగిన దంతా కలలోలాగ. కాని నిజంకంటే దారు ణంగా కలచివేస్తోంది. భోరున ఏడవాల నుంది. ఫక్కున నవ్వాలనీ ఉంది. జుత్తుపీ క్కోవాలనుంది. నగ్నంగా గెంతాలని ఉంది.

అనేక భావాలు ఒకేసారి కలగడంవలన ఏర్పడిన గందరగోళం మనసులో! ఆ భావాలతి తీవ్రమైనవి. వివరించలేనివి.

ఒక కుక్క, ఒక పంది... ఒక ఎలుగు బంటి మూడు మృగాలు తన కన్యాత్వం దోచుకున్నాయి. వాటికెంగిలిలేదు. కుక్క ముట్టిన కుండని తెలిసే మిగిలిన వాళ్లు తనని దోచుకున్నారు. తన శీలంపోయింది. తను చెడిపోయింది. తను చెరచబడ్డ ఆడది, తను పవిత్ర కాదు. పతివ్రతకాదు. తనకి శీలంలేదు. ఇక జన్మలో అది రాదు. రాదు గాక రాదు. తను పతిత, కులట, భ్రష్ట. ఈ జీవితానికిక అంతే. మాయని మచ్చ పడిపోయింది అద్దంలాంటి తన బతుకుమీద. అద్దంబద్దలైపోయింది.

ఇహ నేను గౌరవహీనురాల్ని, మర్యాద హీనురాల్ని, మానహీనురాల్ని! ఎందుకుపోయింది శీలం? తప్పెవరిది? తనదే.. తనదే... ముమ్మాటికి తనదే. ఆ పశువుల దగ్గరకి తనే వెళ్లింది. తనే తన శీలాన్నప్పగించింది. తన కన్యాత్వాన్ని కబళించుకోమంది. ఎందుకు? సినిమా ఛాన్స్‌కోసం.. శీలాన్నర్పించకపోతే సినిమా ఛాన్సు రాదేమోననీ, అర్పిస్తే వస్తుందనీనూ!

వాళ్ల పనయింది. మరి తన పని? ఔతుందా? వాళ్లు తన శీలాన్ని తీసుకున్నారు. మరి సినిమా ఛాన్సిస్తారా? ఏమో గాలిలో దీపం. కాలం గాలిలో దీపకళిక. ఆరుతుందో వెలుగుతుందో? సినిమా ఛాన్సొస్తుందో రాదో. వచ్చేమాట అనిశ్చితం.. ఉన్నది మాత్రం ఊడింది. అది నిశ్చయం. తను సర్వనాశనం అయ్యింది... తనకి పాడాలని ఉంది. పాడుతూ ఏడవాలనుంది. ఇంకా ఏమేమో చెయ్యాలనుంది. ఒరేయ్ బాబాయ్ విశ్వనాథం... నాకైతే ఆ దుర్మార్గుల గురించి తెలియదు, నీకు తెలుసుకదా! తెలిసి ఎందుకు ఆ పులుల అడవిలోకి తీసుకెళ్లావ్? ఎందుకు నా శీలాన్ని వాళ్లకాహారంగా వేయించావ్! నువ్వు వాళ్లతో ఏకమయ్యావా? దొంగలూ దొంగలూ కలసి ఊరుపంచుకున్నట్లు మీరందరూ కలసి నన్నిలా దోచుకుని ద్రోహం చేశారా? సంధిలా వచ్చిందా భావాల ఉప్పెన అవధిమీరిన దుఃఖం. స్పృహతప్పింది. జ్వరమొస్తోంది. అనుకుంటూ కళ్లు మూసుకున్నాను. కళ్లు తెరిచేటప్పటికి ఎక్కడో తెలియని చోట.. ఎరుగని పరిసరాలలో

"నేనెక్కడున్నాను? నాకేమైంది? "

"ఏమీ కాలేదు. చిన్న షాక్. అంతే. హాస్పిటల్లో ఉన్నావు" అంటూ ఓ ఇంజక్షను పొడిచింది నర్సు. ఆమె వెళ్లి చెప్పిందికాబోలు విశ్వనాథం వచ్చాడు. అతన్ని చూసే సరికి జ్ఞాపకంవచ్చింది. పీడకలలాటి ఆ దుస్సంఘటన. భోరున ఏడ్చి "నా బతుకు సర్వనాశనమైపోయింది బాబాయ్. నేను చచ్చిపోతాను. ఆత్మహత్య చేసుకుంటాను" అన్నాను.

"అదేమిటమ్మా... నువ్వు చచ్చిపోతే ఎలా? సినిమాతారెవరౌతారూ? జరిగింది మరచిపో. అనవసరంగా గోరంతను కొండంత చేసుకుని కంగారుపడిపోయావు. ఇది చాలా సహజం"

"ఏది సహజం. శీలార్పణమా? సినీతార అయ్యేముందూ అయ్యాకా కూడా ఈ బలిదానం తప్పదా? "

"అవన్నీ వదిలేయ్. ఏమీకాలేదు" అంటూ చెయ్యిపట్టుకు చూసి "జ్వరం తగ్గిపోయింది. సాయంత్ర మనం ఇంటికి పోదాం. డిశ్చార్జి చేసేయమంటాను. ఇంటి దగ్గరకంటే హాస్పిటల్ లో అయితే సదుపాయమని నిన్నిక్కడ చేర్చాను. చూడూ... జరిగిందెవరికీ చెప్పకేం? " మెల్లగా అన్నాడు.

"ఏమని చెప్పుకోగలను? దొంగల తల్లి కేడవడానికి కూడా భయమేగా? " మర్నా





టికే కాస్త తట్టుకోగలిగాను. ఆ రాత్రి విశ్వనాథం తాగుడికి కూర్చుంటూ

"ఒక్కర్తివీ ఏం. గడుపుతావ్? రామ్మా! కబుర్లు చెప్పుకుందాం" అని పిలిచాడు. వచ్చి అతనికెదురుగా కూర్చున్నాను.

"నువ్వింత అమాయకురాలివనుకోలేదు లలితా!"

"ఎంతమాయకురాలినని?"

"నువ్వే ఆలోచించు. ఎవరేనా అలా జ్వరం పెట్టుకుంటారా? అంత తలకిందులై పోతారా?"

"మీరు స్త్రీ అయితే తెలిసేది బాబాయ్, తొలిసారి పతనం మనసుకెంత కలవర పెట్టీ, తలకిందులు చేసి వదులుతుందో"

'ఈ పాపంలో నీ భాగమెంత' అని అడిగేద్దామని అనిపించింది. కాని ప్రయోజనమేమిటి? ఉందంటే మాత్రం తను చేయగలిగిందేముంది? తన బతుకు ముళ్లకంచెమీద ఆరేసిన చీరయిపోయింది చేతనైతే జాగ్రత్తగా తీసుకోవాలంతే.

"సి...నీ...మా అంటే నీకు నిజంగానే ఏమీ తెలియదా?"

"సినీమా అంటే ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగింది.

"సి...సిగ్గు, నీ...నీతి, మా...మానం. మూడింటినీ అపహరించేది సినీమా అని. ఏ అమ్మాయేనా సినిమాల్లో చేరాలనుకుంటే ఈ మూడింటినీ పణంగా పెట్టవలసిందే"

"పణం పెట్టినంత మాత్రాన సినీతార కాగలదా?"

గ్లాసులోది నోట్లో వంపుకుని "అది పణం మాత్రమే. ఆపైన అదృష్టం కలిసిరావాలి. అలా అన్నీ ఏకమైతేనే సినిమాఛాన్స్" అన్నాడు సినీగీతోపదేశకుడిలా.

అయితే తనది కాళ్లు విరిగే పరుగే తప్ప గమ్యం చేర్చేదికాదా? అని అనుమానమొచ్చింది.



రెండు రోజులు గడిచాక ఆ సాయంత్రం చీకటిపడుతున్నవేళ ఇంటికి వచ్చాడు విశ్వనాథం. ముఖం వేలాడేసుకుని "అమ్మాయి పూజకి సిద్ధం చెయ్యి. ఒక శుభవార్త, ఒక అశుభవార్త. రెండూ తట్టుకోలేనివే" అన్నాడు బాత్‌రూమ్‌లోకి వెళ్తూ.

"ముందేది చెప్పేది? శుభవార్తా, అశుభవార్తా?" తాగుతూ అడిగాడు.

"అశుభవార్తే చెప్పు"

"వాళ్లిప్పుడు కొత్తగా మరో సినిమా తీసే ప్రయత్నం విరమించుకున్నారుట. అంచేత ప్రస్తుతానికి నీకు ఛాన్సివ్వలేనందుకు విచారం వెలిబుచ్చుతూ..." నీళ్ల సారాయి కలిసిన నీళ్లు నమిలాడు.

"విచారం వెలిబుచ్చుతూ?" ఏంచేశారన్నట్లడిగింది.

"నీకష్టం ఉంచుకోమంటూ ఐదువేలు పంపారు" అన్నాడు గొణుగుతూ.

"ఏమిటి? ఐదు వేలు పంపారా?" ఉగ్రకాళే అయిపోయిందామె. "అంటే వాళ్లద్దేశమేమిటి? నేను వేశ్యననుకున్నారా? నా

శీలానికి వెలకట్టారా? నేను కావాలనుకున్నది సినీతార. వేశ్యకాదు. వాళ్ల పన్నాగం అర్ధమయింది. మోసం, దగా, కుట్ర... సినిమా ఛాన్సిస్తామని పిలవడం శీలం దోచుకోడానికే! నేనూరుకోను" అరిచింది, ఏడిచింది.

"ఊరుకోక ఏం చేస్తావ్. ఉరెట్టుకుంటావా? లలితా! కొండని ఢీకొంటే పొట్టేలు తలే పగులుతుందికానీ కొండేమీ చలించదు. డబ్బున్న ఆ సినిమా వాళ్లు కొండల కంటే దిట్టమైన వాళ్లు. కొంచెం ఆలోచించు"

"అంటే సినిమా ఛాన్సనే ఎరవేసి ఆడపిల్ల శీలాన్ని దోచుకుంటోంటే దోపిడీకి గుర వుతూ నోరుమూసుకూరుకోవాలా? చేతకానట్లు చేతులు ముడుచుకోవాలా? "

"ఆవేశపడకమ్మా. ఆవేశంలో ఆలోచన సవ్యంగా సాగదు. వాళ్లని జయించాలంటే వాళ్లకంటే గొప్పవాళ్లం కావాలి. నువ్వే సినిమా హీరోయిన్‌వైతే వీళ్లు నీ చెప్పులు నాకరూ? " నవ్వాడు.

లలితకు ఏడుపాగడం లేదు. ఇంతవరకూ తను వంచించబడినా కావాలని డబ్బు కోసం చెడిపోలేదు కనుక శీలవతే అని ఆత్మవంచన చేసుకునేందుకేనా ఉండేది.

కాని వాళ్లు డబ్బు పంపారు.

"వాళ్లు నాకు సినిమా ఛాన్సివ్వకపోవడం కంటే ఈ డబ్బివ్వడమే ఎక్కువ అవమానమూ అన్యాయమూను. నాకీ డబ్బక్కర్లేదు. పాపిష్టి డబ్బు, పాడు డబ్బు, నీచపు డబ్బు" అరిచింది.

"ఆ విశేషణాలేవీ డబ్బు కంటవూ, చెందవూ. డబ్బు డబ్బే. అంతే. దానిని చూసే కోణంలో ఉంటుందేదయినా. అందం అయినా చూసేకంటిలోనే తప్ప చూడబడే వస్తువులో లేదు. డబ్బూ అంతే!

సరే నా దగ్గరుంచుతాను. ఆ శుభవార్తేమిటని అడగవేం? మనం ఫొటోలిచ్చామే వాళ్లు త్వరలో కబురు చేస్తామన్నారు"

నిర్లిప్తంగా నవ్విందామె. పిలుపంటే మరో సారి శీలం పణంపెట్టి సినిమా ఛాన్సనే ప్రయిజు కోసం లాటరీ టికెట్ కొనాలన్న మాట. ఈ కంపెనీవాళ్లెలాంటి మోసగాళ్లో? వీళ్ల ప్లానేమిటో... ఆమెనిరాసక్తంగా లేచి లోపలికి వెళ్లిపోయింది.

మర్నాడు రోజీ వచ్చింది. తనలాంటి అమ్మాయి కొంచెం పెద్దదయినా తోడు దొరకడంతో లలితకి కొంచెం ఉత్సాహమూ ధైర్యమూ వచ్చాయి. రోజీ చాలా కలుపుగోలు మనిషి. ఎవరి గురించివారు చెప్పుకున్నారు అరమరికలు లేకుండా. "సినిమా హీరోయిన్ కాలేక ఎక్స్ట్రానుంచి ఎన్నో అవతారాలెత్తుతున్నాను" అందామె. చాలా తెలివయింది. చక్కనిది. ఇంగ్లీషూ తమిళమూ కూడా చకచక మాట్లాడుతుంది. ఎంత చొరవో! ఎంత చురుకో. నిముషాల్లో నువ్వుకి వచ్చేశారిద్దరూ.

"నువ్వు లేనప్పుడు నీ చీరకట్టుకున్నాను. క్షమించు" లాంఛనంగా అంది లలిత.

"ఏమీ కొంప మునగలేదు. నేను అరుదుగా తప్ప చీరలు కట్టను. చుడీదార్లే నా పనులకి అనుకూలంగా ఉంటాయి. ఇంతకీ ఆ చీర కట్టుకు వెళ్లిన పనయిందా? "

జరిగింది చెప్పి మళ్లీ మరోసారి ఏడ్చింది లలిత.

ఆమెనోదార్చుతూ "ఇలాంటివిక్కడ సర్వసామాన్యాలు. చూడు లలితా! నువ్వు చిన్నదానివి. ఎక్కువ చదువుకోలేదు. నగరాల గురించి తెలియదు. జీవితం గురించి అసలు తెలియదు" అంది.

"ఏమిటి జీవితం? " కుతూహలంగా అడిగింది.

"మనం అనుకున్నట్లు కొంచెమూ, అనుకోనట్లు ఎక్కువగా జరిగేది. ఏది అనుకు




న్నట్లు జరుగుతుందో ఏది అనుకున్నట్లు జరగదో తెలియక పోవడమూ అదే జీవితం లోని ఉత్కంఠ. అదే ఆశకు ఆధారమూ, బతుకులో ఆకర్షణా. జరిగే దేనినీ ఆపలేం కనుక రాజీపడిపోవడమూ అంగీకరించ డమూ కూడా ఒక రకమైన జీవన విధా నమే. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదా చన అని చెప్పలేదూ గీతలో? హీరోయిన్‌న వ్వాలని వచ్చాను. ఎక్‌స్ట్రాని మాత్రమే కాగ లిగాను. దాంతో బతుకు గడవదు కనుక కాల్‌గర్ల్‌గా కంపెనీగా రకరకాల పనులు చేస్తున్నాను. జీవితం వెళ్లిపోతోంది"

"కంపెనీ అంటే? కాల్‌గర్లంటే? "

రోజా వివరించింది.

"వ్యభిచారం తప్పుకాదూ? "

"తప్పొప్పులు మనిషికొకలా గోచరిస్తాయి"

ఆమె ఉద్దేశాలేమయినా తనకి మాత్రం వ్యభిచారం తప్పుగానే కనిపిస్తుంది. అందుకే తనకు జరిగినదానిని తేలికగా తీసుకోలేకపోడమూ, మరచి పోలేకపో డమూ?

ఇద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. రోజాది కూడా దాదాపు తనలాటి బాల్యమే.

మర్నాడు చీకటి పడుతూంటే స్నానం చేసి ట్రిమ్‌గా తయారయింది రోజా.

"ఏమిటి సంగతి? " అడిగింది లలిత.

"ఇవాళ ఒక హోటల్‌కి కాల్‌గర్ల్‌గా వెళ్లాలి. మంచి బేరమే. రాత్రికి వెయ్యి. ఔనూ, నువ్వూ నాతో రాకూడదూ? "

"నేనలాటి పనులు చెయ్యను"

"అందుకు కాదు. సిటీ చూస్తావని. నేనె లాగూ ఆటోలో వెళ్లాలి" అంటూ తననీ బయలుదేరదీసింది. ఒక్కొక్క ప్రాంతమూ ఏమిటో ఆమె చెబుతోంది. ఆమెకు మద్రాసు కొట్టినపిండి.

"అటుచూడు" హటాత్తుగా అంది రోజా. అప్పటికి ఆటో పాండీబజార్లో పరుగెడు తోంది.

"ఏమిటి? " అడిగింది లలిత.

"చెట్లకిందా అక్కడా ఒంటరిగా స్త్రీలు అలంకరించుకుని"

"ఔను ఎవరు వాళ్లు? "

"వేశ్యలు, రేపటి బతుకునీ నేటి తిండినీ వెదుక్కునే ప్రయత్నం చేస్తున్నారు. లలితా వాళ్లల్లో ఎక్కువమంది ఎవరో తెలుసా? " ఆమె కంఠంలో ఎంతో బాధా జాలీ.

"ఎవరు? "

"మన జాతివారే. అంటే సినిమాల్లో చేరా లని వచ్చి చేరలేక ఇంటికి తిరిగి వెళ్లే దారి మూసుకుపోగా ఈ చెట్లకింద చేరిన చెలులు. వీళ్లకి అప్పుడప్పుడు ఎక్‌స్ట్రా వేషా లొస్తుంటాయి. కాని ఆ ఆదాయం ఏ మూలకీ చాలదు. అంచేత విధిగా వాళ్లు వ్యభిచరించి పొట్టపోసుకోవలసిందే. నెలకొ కటి రెండు సార్లేనా ముఖానికి రంగు పడు తుంది కదాని వాళ్లీ సినిమా నగరాన్ని అంటిపెట్టుకుని ఉండిపోతారు. ఎక్కడికీ పోకుండా"

"సినిమా ఛాన్సు రానివాళ్లు ఇంతేనా? " భయంగా అడిగింది లలిత.

"ఆడవాళ్ల వరకూ చేరవలసిందిక్కడికే. ఆర్థిక పరమయిన దన్నులేని వారైతే చివ రికి చేరేది చెట్ల కిందకే"

"మగవాళ్లు? "

"హీరోలవుదామని వచ్చి ఎక్‌స్ట్రా అవకా శాలు తప్ప దొరకని వారు వెనక్కి వెళ్లడా నికి ముఖం చెల్లక కాఫీ హోటల్ సప్లయిర్ నుంచి క్లర్కులవరకూ నానా అవతారాలూ ఎత్తుతూంటారు. నగరాన్ని మాత్రం విడిచి పోరు. గబ్బిలాలు మర్రి చెట్టుని పట్టుకు వదలనట్లు వీళ్లు మద్రాసు వదిలి పోరు.

ఎందుకంటే ఎక్స్ట్రా వేషాలు దొరుకుతూం టాయి కనుక. ఎప్పటికేనా హీరోయిన్ కాక పోతామా అని స్త్రీల ఆశ. ఎప్పటికేనా హీరో కాలేకపోతామా అని వీళ్ల ఆశ. ఈ ఆశ వాళ్లనెన్ని ఆటలు ఆడిస్తూంటుందో! ఆశం టేనే ఓ పట్టాన చావనిదికదా"

లలితకి ఆమె మాటలు వినిపించడం లేదు. మనసులో ఏదో భయం... ఆలోచ నలు. రేపు తన గతి కూడా ఇంతేనా? సినిమా ఛాన్సు రాకపోతే.

ఆటో హోటలుముందు ఆగింది. రోజీ ఆటోవాడికి డబ్బులిచ్చి "లలితా! రిటర్న్ ఫేర్ కూడా చెల్లించాను. ఈతను తెలిసిన వాడే. నిన్ను ఇంటి దగ్గర క్షేమంగా దింపు తాడు. ఇంటిదగ్గర ఒంటరిగా ఉంటావనీ ఆటోలో కంపెనీ ఇస్తావనీ తీసుకొచ్చాను. నిన్నిబ్బంది పెట్టానా? " భుజం మీద చెయ్యి వేస్తూ అడిగింది.

"ఉహూ! నీతో రాబట్టే ఎన్నో విషయాలు తెలిశాయి. వెళ్లిరా గుడ్‌లక్"

అప్పుడు రోజా ఆటో అతనికి తమిళంలో ఏమిటో చెప్పింది. లలిత నెక్కించుకుని ఆటో కదిలింది. ఆటో పరుగెడుతోందని కూడా గమనించనంతగా పరధ్యానంలో పడి పోయింది లలిత. మెదడంతా గందరగో ళంగా ఉంది. రేపేమిటో అని దిగులూ చింతా మొదలయ్యాయి. చింత! చితిమీద కాలేవరకూ మనిషిని వదలని చింత. రోజా లాటి అందమైన చురుకయిన చదువుకున్న అమ్మాయినే వరించని సినిమా ఛాన్సు తన లాటి దానికి వస్తుందా? రాదు.. రాదు... రాదు. అంది అంతరాత్మ. కాని ఆమెకు ఆ జవాబు ఎంత మాత్రమూ నచ్చలేదు. ఇల్లు చేరేసరికి విశ్వనాథం ఉన్నాడు తాగి, వాసనేస్తూ "రారా ఎక్కడికెళ్లావ్? "

"రోజాతో కొంచెం ఊరు చూడొచ్చంటేనూ ఎలాగూ ఏమీ పనిలేదుకదాని"

"మంచి పని చేశావ్. నగరంలో తిరిగితే నాలుగు విషయాలు తెలుస్తాయి. ప్రపంచ జ్ఞానం వృద్ధి చెందుతుంది. చాలామంది సినిమా తారలకుండసిది" నవ్వాడు.

ఏమనాలో తెలియనట్లు ఆమె మౌనంగా నిలబడిపోయింది అతనివేపే చూస్తూ.

"అన్నట్లు ఓ కుర్ర దర్శకుడు తగిలాడు. సినిమా తీయబోతున్నాడులే. అతనే నిర్మాతా, దర్శకుడూ, హీరోకూడా. చేతులు కాల్చుకునేరకం. అతని సంగతి మనకెందు కులే. నీకు మంచి వేషం ఇస్తాడా ఇవ్వడా అనేదే మనకి ముఖ్యం ఏమంటావ్? "

"ఔను" అనికాక ఇంకేమంటుంది? అత నామెవంక అదోలా చూస్తూ "కాని ఒక విషయం తెల్చుకోవాలి నువ్వు. అదేమిటంటే నీకు సినిమా ముఖ్యమా, శీలం ముఖ్యమా అనేది. ఈ నిర్మాత కుర్రాడు. వేషంకోసం వచ్చిన వాళ్లతో వెకిలివేషాలు వెయ్యకమా నడు. కాదన్నవాళ్లకి అవకాశమిస్తాడని నేన నుకోను. అంచేత ముందే ఆలోచించుకో. బయలుదేరేముందే ఆలోచించుకో" అన్నాడు గ్లాసులో విస్కీ పోసుకుంటూ.

ఆమె ఒక నిట్టూర్పు విడిచి "రోజాతో మాట్లాడి నిర్ణయించుకుంటాను" అంది లోప లికి వెళ్లిపోతూ.

తెల్లవారాక వచ్చింది రోజా చాలా అలసి పోయి, వడలిపోయి. వస్తూనే కాఫీ తాగి మంచానికడ్డంపడిపోయింది. లేచేసరికి మధ్యాహ్నం ఒంటిగంట. స్నానం చేసి భోజనం చేశాక ఇద్దరూ ముందు గదిలో కూర్చున్నారు.

"ఒక విషయంచెబుతావా రోజీ? "

"అడుగు తెలిస్తే తప్పకుండా చెబుతాను"

"నేను సినిమాల్లో చేరగలనంటావా? సిని మాలో చేరాలంటే చెడితీరాలా? "

"నువ్వు సినిమాల్లో చేరగలగడమనేది నీ అదృష్టం మీద ఆధారపడి వుంటుంది. అదృష్టం అనేది నేను చెప్పలేను. పోతే చెడి నంత మాత్రాన సినిమాల్లో చేరిపోగలిగితే





చాలామంది అతి సంతోషంగా చెడుదురు. అంతెందుకు నేనే చెడిపోగలను లక్షసార్లు" నవ్వింది రోజా. "శీలం ఖరీదుకి సినిమా హీరోయిన్ ఛాన్స్ వచ్చేసేటట్లయితే ఇకనేం? అయినా లలితా, సినిమాల్లో చేరాలని నీకెందుకూ ఇంత ఇది? " అంది.

"ఇంక ఏ మార్గమూ కనిపించక, బతకడానికి మరో పని చేతకాక" అంది నిస్పృహగా.

"సినిమాల్లో నటించడమంటే నీకంత తేలిగ్గా కనిపిస్తోందా!" ఆశ్చర్యపోయింది రోజా.

"ఇక్కడికొచ్చేవరకూ అంతే. కాని ఒక్క రోజు స్టూడియో తిరిగి షూటింగు చూసేసరికి అదెంత కష్టమో తెలిసి వచ్చింది. ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదులెమ్ము అని ఉమర్ ఖయ్యామ్ ఊరికే అనలేదు. ఇంతకీ నన్నా కుర్ర నిర్మాత మరియు దర్శకుడు వద్దకు వెళ్లమంటావా? "

"వెళ్లు. ఏ పుట్టలో ఏ పాముందో? "

"అదే నా భయం. ఆ ప్రొడక్షనాఫీసు ఓ పుట్టా అతనో పామూ ఏమో అనే నా భయం"

"ప్రపంచంలో అంతా చెడే లేదుగా? సినిమా ప్రపంచంలోనూ కొంత మంచి ఉండితీరాలి. మరీ రాజకుమారి చెలికత్తెలలో ఆరోదాని వేషంలాటి ఎక్స్‌ట్రా వేషం కాకుండా కొంచెం డైలాగులూ, కాస్త ప్రాముఖ్యమూ ఉన్న పాత్రిస్తామన్నా కాదనకు. హీరోయినే కావాలని పట్టుపట్టకు. ఎక్స్‌ట్రాగా రమ్మని వాళ్లూ అడగరులే. మన బాబాయ్‌లాటి ఎక్స్‌ట్రా సప్లయర్స్ తెస్తారు, అలాటి పాత్రలకి"

"అలాగే"

"మొదట వేసే పాత్ర కొంచెమైనా మంచిదవడం ముఖ్యం. గుడ్ బిగినింగ్ మేక్స్ గుడ్ ఎండ్. ఈసారి చీరకట్టుకు వెళ్ళకు. నా చుడీదార్ వేసి నిన్ను తయారుచేస్తాను"

"నువ్వు రాకూడదూ నాతో? "

"అది నీకూ నాకూ కూడా ఏవిధంగానూ మంచిది కాదు. నీతో వచ్చిందొక ఎక్స్‌ట్రా అని తెలిస్తే నీమీద అభిప్రాయం తగ్గిపోతుంది. వాళ్లేమన్నా అంటే నా నోరా తిన్నదయింది కాదు. బాబాయ్ చాలులే. వాళ్ళింటర్వ్యూ చేసేటప్పుడు పైవాళ్లనెలాగూ ఉండనివ్వరు"

ఆ ఆఫీసు మరీ ఆడంబరంగానూ భయపెట్టేదిగానూ ఏమీలేదు. ఆ గదిలో అతనొక్కడే ఉన్నాడు. దర్శకుడిగా యువకుడేమో కాని మనిషిగా- నలభయ్యేళ్ళవాడు.

"లలిత? "

"ఊఁ నమస్కారం. అయామ్ డైరెక్టర్ రాజేంద్ర. మీ ఫొటో చూడగానే చాలా అట్రాక్టయ్యాను. ఏవో జ్ఞాపకాలలోకి ఉహు... మధురోహాలలోకి జారిపోయాను నాకు తెలియకుండానే- సచె బ్యూటీ"

"థాంక్స్"

"స్థయిటుగా చూస్తూంటే మరీ స్థయికింగ్గా ఉన్నావ్. నిన్ను చూస్తోంటే నువ్వు తెరమీదకంటె పడకమీద మరింత బాగుంటావనిపిస్తోంది. నన్నపార్థం చేసుకోకు. అయామ్ వెరీ ఫ్రాంక్. మనసులో ఒకటీ మాటలో ఒకటీ రకం కాదు. చెప్పింది చేస్తా, చేసేది చెప్తా. దటీజ్ ఐ. నాకిది ఫస్ట్ పిక్చరు- డైరక్టరుగా. అంచేత నేనెలాటి రిస్కూ తీసుకోలేను"

"నన్ను తీసుకోవడం రిస్కా? "

"నిన్నే కాదు, ఏ కొత్తవాళ్ళని తీసుకున్నా రిస్కే. అంచేత ఓ పనిచేద్దాం"

"ఏమిటి? "

"ఈ పిక్చరు ష్యూర్ హిట్. దాంతో రెండో బొమ్మనుంచీ నేనేం చేసినా చెల్లుతుంది. నా రెండో బొమ్మలో నీకు మంచి

రోలిస్తాను. నీ కోసమే రాయిస్తాను. అంత వరకూ నువ్వు నాతో ఉండిపో. నా భార్య వల్ల నాకు డబ్బూ లేదు, ప్రిస్టేజీ లేదు, పడక సుఖమూ లేదు. నువ్వు కదాని చెప్పే స్తున్నాను. అదో పల్లెటూరి గబ్బిలాయి. పట్టుచీర కట్టుకుని పీటలమీద కూర్చుందుకే తప్ప పడకమీద నప్పదు. నాలాటి డైరెక్టరు కుండవలసిన భార్య కాదు. నువ్వయితే నాకు సరిపోతావు" ఆమె భుజంమీద చెయ్యి వేశాడు.

"నాతో ఉండిపో"

"నన్ను పెళ్లి చేసుకుంటారా? " అడిగిం దామె.

"మా ఆవిడొప్పుకోదేమో... అయినా నా హృదయతారవే అయిపోయాక అలాటి క్షుద్రవిషయాలెందుకు? కోతికి ఉందా, కోడికి ఉందా ఈ పెళ్లాచారం? పోనీ ఉంచుకుంటాను. నువ్వు నా చిన్న దేవేరివీ, చిన్నిల్లువీ" అన్నాడు.

"ఇందుకు ఆమె పెద్దిల్లుగా, నేను చిన్ని ల్లుగా ఉండడం ఆవిడకు కూడా అంగీ కారమౌనో కాదో మీ భార్యనడిగి చెబు తాను. టెలిఫోన్ కనెక్ట్ చెయ్యండి" అందామె భుజంమీంచి అతని చేయి తీసేస్తూ.

అతనదిరిపోయాడు.

ఆమె బయటకు వచ్చేసింది.

"అప్పుడే వచ్చేశావే. ఏమైంది? " అడిగాడు విశ్వనాథం.

"అతనికి కావలసింది ఉంపుడుకత్తె. సినిమా నటికాదు"అంది !కొంచెం చిరాకుగా. ఇద్దరూ ఇంటికి వచ్చేశారు. తను సినిమా నటి కాగలననే ఆశ ఆమెలో చాలావరకు క్షీణించింది.

ఇంటికొచ్చాక రోజానడిగింది.





"రోజా! ఒకటి చెప్పు నిర్మొహమాటంగా. నాకు సినిమా ఛాన్సు రాదని నాకే తెలిసి పోతోంది. అయ్యే చెట్టు ఆకుల్లోనే తెలుస్తుం దికదా. వ్యభిచారం చేస్తూ బతకడం నా కిష్టంలేదు. మరలా నేనిక్కడ బతికేందుకు మార్గాలేమయినా ఉన్నాయా? "

"నీ చదువుకి ఉద్యోగం రాదు. మోడ లింగ్ లాటివి మనలాటి వాళ్ళకందనివ్వరు. అయినా వాటితో కొన్నేళ్లుంటే కాని ఆపాటి సంపాదించలేం. సైడ్‌న వ్యభిచారం చెయ్య కుండా నువ్విక్కడ స్వతంత్రంగా జీవించగల వనుకోను"

"ఆమాత్రం దానికి నేనిక్కడుండడం అన వసరమేమో? నగరజీవితం మరింత ఖరీదు. అదీకాక నాకు భాష సమస్య. వ్యభి చరించే బతకవలసొచ్చినప్పుడు మా ప్రాంతం పోవడం నయమేమో అనిపి స్తోంది. అక్కడెవరో ఉన్నారని కాదుకానీ..."

"నీ ఇష్టం. నీ ఆలోచనా సమంజసమే. బాబాయ్ నీకు నెలకి ఒకటి రెండు ఎక్స్ట్రా వేషాలిప్పించగలిగినా అవి నిన్ను నెలంతా బతికించేంత సంపాదననివ్వవు. ఎప్పటికేనా మంచివేషం దొరకదా అని ఎక్స్ట్రాగా తపస్సు చేయడానికేనా పక్కసంపాదన సంపాదించాలి"

"వొద్దులే. ఇక్కడ నా అదృష్టం తేలిపో యింది. అక్కడ కూడా పరీక్షించుకుంటాను. నాకేమిటో ఇక్కడ బాగులేదు"

విశ్వనాథం వచ్చాక అతనికి కూడా చెప్పే సింది తన నిర్ణయం.

"నీ ఇష్టం" అనేశాడతను. రెండురోజుల అనంతరం ఆమెని రైలెక్కించింది రోజా. మద్రాసు సెంట్రల్‌లో వీడ్కోలు చెప్పింది. రైలు కదులుతోంటే ఇద్దరి కళ్లూ చెమ ర్చాయి.

రైలు కదిలిపోయి రోజా వెనక్కుండిపో యినా ఏడుస్తూనే ఉంది లలిత. తను మద్రాసు వెళ్ళి సాధించిందేమీ లేదు సరి

కదా అమూల్యమయిన శీలాన్ని కోల్పో యింది. సినిమా ఛాన్సుకి ఆశపడబట్టే ఆ శిక్ష పడింది. అందని పరుగులకి పోతే కాళ్లు విరుగుతాయి. తనలాటిది సినిమా నటి కావాలని ప్రయత్నిస్తే శీలం పోతుంది. ఈ గుణపాఠం చెప్పింది మద్రాసు. సినిమా రంగమనే దీపాన్ని చేరాలనుకున్న ఈ శల భానికి రెక్కలకంటే విలువైనది కాలిపో యింది. తగిన శాస్తి జరిగింది. జీవితంలో మరచిపోలేని నీతి ఇది. కన్యగా వెళ్ళిన తనని సినీరంగం శీలభ్రష్టని చేసి పంపు తోంది. జీవితంలో చిన్న ఆశపడినందుకు కోలుకోలేని దెబ్బకొట్టి పొమ్మంది. చెడి చెన్న పట్నం వెళ్లమని సామెత. కాని లలిత చెన్న పట్నం వెళ్ళి చెడిపోయింది.

చదువుతున్న వేణుమాధవ్ కళ్లు ఆర్ద్రమ య్యాయి. మాధవిమీద అతనికి అపరిమిత మయిన జాలివేసింది. చేతిలో పుస్తకాన్ని ఒక్కసారి టేబులుమీదుంచాడు.

"ఎవరి కర్మకెవరు కర్తలన్నట్లే ఎవరి అదృష్టానికి, అనుభవాలకీ కూడా వారే కర్త లేమో. మాడమ్ మీ అనుభవాలవి. మీ అదృష్టమది. నావీ అలాగే ఉంటాయనెందు కనుకోవాలి? ఒకరి అనుభవాలు మరొక రివి కాజాలవు. అలాగే ఎవరదృష్టం వారిదే. ఒక్కటాలోచించండి. నూటికో కోటికో ఒకరయినా సినీనటి అవుతూనే ఉన్నారు. ఆ నూటిలోనో కోటిలోనో సినీతా రయ్యే ఒక్కరూ నేనే ఎందుకు కాకూడదు? మీరేమీ అనుకోకండి. మీరు మద్రాసు వెళ్లే టప్పటికి మీకు అంతగా చదువుకాని ప్రపం చజ్ఞానం కాని లేదని మీరే చెప్పారు. అప్పటి మీరు ఇప్పుడున్నంత అందంగా ఉన్నారో లేదో. మీ తరం ఈ తరమంత ఫాస్ట్‌కాదు. కాలం మారింది మాడమ్. ప్రపంచంలో చాలా మార్పులొచ్చాయప్పటికీ ఇప్పటికీ. అప్పుడు తెలుగు సినిమా మద్రా సులో ఉండేది. ఇప్పుడు హైదరాబాద్‌లో ఉంది. అప్పుడు మద్రాసు. ఇప్పుడు చెన్నై. నేను మీ అనుభవాలని స్వీకరించలేను. మీకు నామీద ఏమయినా అభిమాన ముంటే- సార్‌కి సిఫార్సు చేయండి. హీరో యిన్ కాగలిగే అదృష్టంకోసం నేనొక్కసారి కాదు, కోటిసార్లయినా కాలు జారడానికి సంతోషంగా సిద్ధమే" అంది మంజుల.

త్రుళ్లిపడింది మాధవి ఆమె మాటలకి.

మళ్లీ అంది మంజుల. "అన్నిటిలాగే జీవి తపు విలువలూ మారాయి. జీవితం సంకీ ర్ణమూ, సంక్లిష్టమూ అయిపోతోంటే విలు వలు మాత్రం స్థిరంగా ఎలా ఉండగలవు? ఇవాళ బతుక్కీ బతుకులోని సుఖాలకీ ప్రాణాధారం డబ్బు. దానిముందు ఏ విలు వలయినా దిగదుడుపే. దానికోసం ఏవ యినా త్యజించదగినవే"

తల తిరిగిపోతోంది మాధవికి. ఈ చిన్న పిల్ల ఎంత పెద్దమాటలు చెబుతోంది. ఇలాటి ఫాస్ట్‌గర్ల్ జీవిత ప్రవాహంలో చివరి కెక్కడ ఎలా తేలుతుందో?

"నేను వెళ్తాను మాడమ్. నాకు సెలవి ప్పించండి. మీకు దయుంటే వారికి నా గురించి అనుకూలంగా చెప్పండి. వారికి చెప్పే వెళ్తాను"

"ఈ అర్ధరాత్రి- ఒంటరిగా వెళ్తావా!"

మంజుల నవ్వింది. "నాకు భయం లేదు మాడమ్. నేను పిరికిదాన్ని కాను. స్త్రీ కూడా మునుపటికీ, ఇప్పటికీ మారింది. నేను ఆధు నిక యువతిని. నా గురించి కంగారుపడ కండి. నేను క్షేమంగానే వెళ్లగలను. సెలవు మాడమ్" నమస్కారం చేసి గదిలోంచి వెళ్ళి పోయింది మంజుల.

షాక్ తిన్నట్లు ఆమె వెళ్ళినవేపే చూస్తూ ఉండిపోయింది మాధవి. ఆ ప్రభావం నుంచి తేరుకుందుకు ఆమెకు కొన్ని నిము షాలూ, రెండు గ్లాసుల చల్లని మంచినీళ్లూ పట్టాయి. ఆమె మళ్ళీ వచ్చి మంచంమీద కూర్చుంది.



అప్పుడు జ్ఞాపకమొచ్చింది తన కర్తవ్యం. టేప్‌రికార్డరందుకుంది. ఆన్ చేయబోయేం తలో మాధవ్ వచ్చాడు గదిలోకి. "మాడమ్, మీకు టీ కావాలా? నా రూమ్‌లో ఫ్లాస్క్‌నిండా ఉంది. అవసరమైతే మొహమాట పడకండి. చెప్పండి"

"నో... థాంక్స్"

అతను వెళ్ళిపోయాడు. మాధవి టేప్‌రికార్డర్ 'ఆన్' చేసింది.



"వేణు రోడ్డున పడ్డాడు.

అతనిముందు ఒక్కటే ప్రశ్న. ఎలా బతకడం? అసలు బతకడం అంటే ఏమిటి?

ఆ ప్రశ్నకు సమాధానం వెంటనే తేలలేదు కానీ ఆశ్రమం విడిచి బయటికొచ్చి నాలుగైదుగంటలు రోడ్లవెంట ఎండలో తిరిగాక- తేలింది.

బతకడమంటే- అన్నం తినడం. అలాగే రాత్రయ్యేసరికి బతకడమంటే నిద్రపోవడం అనే తేలింది. అలాగ అతనికి బతకడమంటే కూడూ, గూడూ, గుడ్డా అనే అర్థాలు తెలిశాయి. ఆశ్రమ యజమాని ఇచ్చిన డబ్బు ఆట్టే రోజులు రాదనీ, డబ్బు లేకపోతే బతకలేననీ బతకడం కోసం డబ్బు సంపాదించితీరాలనీ కూడా తెలిసింది.

ఆ సాయంత్రం పార్కులో కూర్చున్నాడు. వాతావరణం హాయిగా ఉంది. అప్రయత్నంగానే అతని నోటివెంట ఓ పాట వచ్చింది. కొందరు బస్సులోనో, రైల్లోనో ప్రయాణిస్తుంటేనూ, కొందరు బాత్‌రూమ్‌లో స్నానం చేస్తూనూ తన్మయులై పాడుకునేలా అతను తన ఆనందంకోసం తనే పాడుకోసాగాడు. కళ్లు మూసుకుని మరీ పాడసాగాడు. అతను గాయకుడు కనుక గానమే అతనికి కాలక్షేపం. గుడ్డలున్న సంచిని ఆనుకుని ఖాళీ అగ్గిపెట్టెమీద వేళ్లతో లయా దరువూ శ్రుతీ అన్నీ వేస్తూ మైమరచి గొంతెత్తి స్వేచ్ఛగా పాడెయ్యసాగాడు. అతని పాటల పరంపర ఆగేసరికి పావుగంట పైనే పట్టింది. అప్పుడు కళ్లు తెరిచేసరికి చుట్టూ పదిపన్నెండుమంది జనం.

"పిట్ట కొంచెమైనా కూత ఘనమన్నట్లు, గుంటడివైనా గంటవాయించినట్టే ఝణాయించి పాడేశావ్" అభినందనేకాక అర్ధరూపాయి కాసు కూడా విసిరాడు ఒక శ్రోత.

"బాగా పాడావబ్బాయ్"

"సెంటర్లలో పాడు. బాగా డబ్బులు పడతాయ్"

"నీ కంఠంలో కమ్మదనముంది. స్టేజిమీద పాడగలవుగా. ఎల్లుండిక్కడే కనపడు. లయన్స్‌లోనో, రోటరీలోనో నీ ప్రోగ్రాం పెట్టిస్తాను. డబ్బుట్టే రాదుకాని పేరు బాగా వస్తుంది. శాస్త్రీయ సంగీతం. లలిత సంగీతం. సినిమా సంగీతం కూడా వచ్చుగా" ఆయనపేరు మురారి అని తర్వాత తెలిసింది.

మెచ్చుకోళ్లతోపాటు పన్నెండు రూపాయలు కూడా లభించాయతనికి. అంతకంటే ముఖ్యంగా డబ్బు సంపాదించే మార్గం తెలిసింది. తను కూడా సంపాదించగలననే ఆత్మవిశ్వాసం కలిగింది. అతనికి బతుకుతెరువు కనిపించింది. బతకగలననే ధైర్యమొచ్చింది. బతుకు భయం తగ్గింది.

జాలేసింది మాధవికి ఆ మాటలు వింటుంటే. పట్టుమని పదహారేళ్లయినా నిండని కుర్రాడికి బతుకూ, బతుకు భయమూ! జీవితం ఎంత దారుణమైంది ఎంత నిర్దయమైనది.

"పగలంతా రోడ్లమీద పాడుకుంటూ తిరగడం, వచ్చిన డబ్బులతో ఏదో తినడం, కడుపాకలి తీర్చుకోవడం, సాయంత్రమయ్యేసరికి పార్కు. రాత్రి ఏ బస్‌కాంప్లెక్స్‌లోనో, ప్లాట్‌ఫారం మీదో పడక. ఆవేళ పార్కులో మళ్ళీ మురారిగారు కలిశారు





"లాభంలేదోయ్... ఎంత ప్రయత్నించినా కుదరలేదు. ఈ ప్రజలున్నారే పరమమూర్ఖులు. వాళ్లకి ఎంతసేపూ కులం కావాలి. స్వార్థం కావాలి. గొప్పలు కావాలి. ప్రయోజనం కావాలి.

వాళ్లకి చాలా కావాలి కళ తప్ప. వాళ్లకి మ్యూజిక్ కూడా నిజంగా అక్కర్లేదు. ప్రిస్టేజికీ సోషల్ స్టేటస్‌కీ కావాలి. అందుకే వాళ్ళింట్లో ఖరీదైన సౌండ్ సిస్టమ్‌లూ, మ్యూజిక్ సిస్టమ్‌లూ. ఎవరేనా వస్తే, ఎ.సి., ఫ్రిజ్‌లలా గొప్పగా చూపించుకుందుకు ఎన్ని క్యాసెట్లున్నాయంటే అంత గొప్ప. ఎంత ఖరీదైన సి.డి. ఉందంటే అంత పరువు. మహాకావ్యాలు ఇంట్లో ఉంచుకుందుకేకాని చదవడానికికాదని ఓ విసురుంది. ఈ సంగీతం క్యాసెట్లూ అంతే. గొప్ప కళాకారుల సంగీతాన్ని తమింట్లో ఉంచుకున్నామంటే అదో ప్రిస్టేజ్. అంతే తప్ప వీళ్లలో చాలామంది సీరియస్‌గా మంగళంపల్లినీ వినరు ఎమ్మెస్‌నీ వినరు. తమ మాటల్లో మాత్రం చెంబై వైద్యనాథ భాగవతార్, మహాలింగం, బిస్మిల్లాఖాన్, ఉస్తాద్ ఆలీఖాన్, హరిప్రసాద్ చౌరాసియా లాటి పెద్ద పెద్ద సంగీతకారుల పేర్లు దొర్లిస్తారు. అది నిజం కాదు. ఒట్టి నేమ్ డ్రాపింగ్. గొప్పవాళ్ల పేర్లు దొర్లించడం! అంతే. వీళ్ళలో త్యాగరాజకీర్తనలు వినేవాళ్లు వేళ్లమీద లెక్కెట్టగలిగేపాటే. ఇప్పుడు మ్యూజిక్ కూడా నాగరికతా ఫ్యాషన్. ఇనెవిటబుల్ స్టేటస్ సింబల్"

ఆయన ఏంచెబుతున్నాడో, ఎవరి గురించి చెబుతున్నాడో వేణు కర్థం కావడం లేదు. కాని పెద్దాయన కదాని శ్రద్ధగా వింటున్నాడు.

"వీళ్లకి కళలో కూడా కులమే కనిపిస్తుంది. వాళ్ల కులంవాడు గాడిదలా ఓండ్ర పెట్టినా ప్రముఖ గార్ధబగాన కళాకారుడంటూ స్టేజెక్కించి సన్మానం చేస్తారు. అన్యకులంవాళ్లు కోయిల్లా కూసినా ఈ కులబధిరులకి వినపడదు. గొప్పవాడో, ధనవంతుడో డబ్బాలో గులకరాళ్లేసి గిలకరించినట్లు పాడినా ఆకాశానికెత్తేస్తారు. అదే నిజమైన కళాకారుడికి అధికారమో, ఐశ్వర్యమో, గొప్పతనమో లేకపోతే వాడిముఖం చూడరు. గుర్తించబడినవాడినే గుర్తించగల గుడ్డివాళ్లు. అనుభవం లేనిదే ఉద్యోగమివ్వరు. ఉద్యోగమివ్వనిదే అనుభవం రాదు. పెళ్లీ, పిచ్చీ సామెతలాగే. కాసు కలవాని కళకే కనకాభిషేకాలనేవి ఇప్పటికీ రుజువవుతున్న నిజం. ఆ లయన్స్‌వాళ్ళముందు నెత్తీ నోరూ మొత్తుకున్నాను. 'వేణు కుర్రాడే ఔగాక. రికామీయే ఔగాక. కులంలేనివాడే ఔగాక. అద్భుత గాయకుడు సుమా. ఆ వయసుకి అంత చక్కగా పాడగలగడం చాలా గొప్ప సుమా' అని. ఆ కులగజ్జిగాళ్లు, కులకామెర్ల రోగులు, నా మాటలు వింటూనే అదోలా చూశారొక్కసారి. ఆ సింహాలు గ్రామసింహాల్లా భౌమన్నాయి నామీద. 'రోడ్డుమీద తిరిగే రికామీని సింహాల వేదికెక్కించమంటావా? మా వేదిక అంత అలుసైపోయిందా?' అంటూ"

అప్పటికర్థమయింది విషయమేమిటో. "పోన్లెండిసారూ... నాకా అదృష్టముండాలి కదా? నావల్ల మీరు అనవసరంగా అవమానపడ్డట్లున్నారు. నన్ను క్షమించండి" అన్నాను.

"క్షమించను. వాళ్లని క్షమించను. ఈ మురారి తలుచుకున్నాడంటే సాధించేవరకు వదలడు. వాళ్ళకి నా సంగతి పూర్తిగా తెలియదు" పిడికిళ్లు బిగించి గాలిలో యుద్ధం చేసేస్తున్నాడు. ఆయనని శాంతింపజేయడానికి వేణుకొక ఉపాయం స్ఫురించింది.

మెల్లగా "శాంతమూ లేక సౌఖ్యమూ లేదు" అంటూ త్యాగరాయ కీర్తన అందుకున్నాడు. కీర్తన పూర్తయ్యేసరికి మురారి ప్రశాంతుడవడమే కాదు, ఆయన కళ్లవెంట



నీళ్లు కూడా!

"అపరతుంబురుడివయ్యా నువ్వు. ఎంత బాగా పాడావ్" అని ప్రేమగా, అభినందనగా కౌగలించుకున్నాడు. గుడ్డలు మాసిపోయాయనీ, ఒళ్లు చెమట కారుతోందనీ కూడా చూడకుండా. ఆయన సంగీతాభిమానం అటువంటిది.

సంపాదనలోని మెలకువలు కూడా కొద్దిగా తెలిసిరాసాగాయి. నెసిసిటీ యీజ్ మదరాఫ్ ఇన్వెన్షన్. అవసరం ఉపాయాలను స్ఫురింపజేస్తుంది. ఎక్కడ ఎప్పుడు ఏది ఎలా పాడితే డబ్బులు వస్తాయో బుర్రకి తడుతోంది. ఆదివారాలూ, సెలవుది నాలూనాడు స్టూడెంట్స్ హాస్టళ్లలో లేటెస్ట్ సినిమా సాంగ్స్. ఊపూ, ఉత్సాహమూ కలిగించేవి. పాడితే కుర్రాళ్లయినా బాగానే డబ్బులిచ్చేవారు. అంతేకాదు ఆవేళకి హాస్టళ్లో భోజనమూ, కాఫీ టిఫిన్లూ కూడా ఏర్పాటుచేసేవారు. స్టూడెంట్స్‌లో చాలా మంది సినీసంగీతాభిమానులే. అతనికొక విషయం అమితాశ్చర్యం కలగజేసేది. సినిమా పాటలు- సినిమాల్లో వింటూ చూస్తారు. టీ.వీ.లో చూస్తూ వింటారు. రేడియోలో వింటారు. టేప్‌రికార్డర్‌లో వింటారు. మైకుల్లో అవే పెద్ద సౌండ్‌తో వింటారు. ఇన్ని విధాలుగా వాటిని వింటున్నా వాటినే మళ్లీ ఎవరేనా పాడితే అంత ఉత్సాహంగానూ వింటారు. ఈ మనిషి పాటకి నేపథ్యసంగీతముండదు. ఆర్కెస్ట్రా ఉండదు. అయినాసరే అంత ఆసక్తిగానూ వింటారు- విసుగనుకోకుండా. ప్రజలెంత మంచివారు. సినిమా సంగీతం ఎంత గొప్పది. సినిమాలో పాడింది గొప్పగాయకుడయినా ఈ పాటగాడి గొంతులోని విభిన్నత వారినాకర్షిస్తుందేమో. ఇది- లైవ్ మ్యూజిక్ కదా. ఈ పాటలో యాంత్రికత చోటుచేసుకోక సజీవంగా, సహజంగా ఉండడమే దీనిలోని ప్రత్యేకతేమో.

మెల్లమెల్లగా ఆ జీవితానికీ, ఆ ఉపాధికీ అలవాటు పడుతున్నాడు. సంపాదించే మెలకువలతోపాటే సంపాదనకవసరమయిన హంగులూ తెలిసివస్తున్నాయి. వాటికి ప్రధానం శృతి. సంగీతపరంగానే కాదు, గాయకుడి సౌలభ్య దృష్ట్యా కూడా. పాటని శృతి రక్తికట్టిస్తుంది. పాట మధ్యలో వచ్చే విరామాలను అది పూరిస్తూ ధారావాహికతనిస్తుంది. శ్రుతి, వాద్యసంగీతం గాయకుడికి అవసరమైన విశ్రాంతినీ ఊపిరి పీల్చుకుందుకు వెసులుబాటునీ ఇస్తాయి. పాటకి అదనపు అందంతోబాటు గాత్రం, వాద్యం, గానానికి వైవిధ్యం కలిగిస్తాయి. గాయకులకి తెలుస్తుందిది. ఇంతవరకూ తను పాటను అగ్గిపెట్టి దరువుతో లాగించేస్తున్నాడు. సినిమా పాటలకయితే కొంతవరకూ అగ్గిపెట్టె లయ ఫరవాలేదుకానీ శాస్త్రీయ సంగీతానికి అది నప్పదు. డోలక్ కాని, మద్దెలకాని ఉండాలి. శ్రుతికి హార్మోనియం అయితే బాగుంటుంది. తనకది వాయించడం వొచ్చు మాస్టారు నేర్పారు. కాని హార్మోనియమంటే వందల రూపాయలలో ఉంటుంది. అంత డబ్బు తనకెక్కడిది? ఘటం కూడా కొనలేడు ప్రస్తుతం. అవేవయినా ఉంటే తన పాట మరింత ఆకర్షిస్తుంది. గాత్రంకంటే వాయిద్యపు స్థాయి ఎక్కువకదా. ఏదో ఒకటి కొనాలి. తన పాటకి జతచేయాలి. చివరికి బుల్‌బుల్ అయినాసరే. అదయితే వందలో వచ్చేస్తుంది.

ఆవేళ ప్లాట్‌ఫామ్‌మీద పడుకున్నాడు. తెల్లవారే వెళ్లి బుల్‌బుల్‌తార కొందామన్న ఉద్దేశంతో రాత్రి భోజనం కూడా మానాడు. తెల్లవారి లేచి చూసేసరికి జేబూలేదు, జేబులో డబ్బూ లేదు. జేబులో ఎనభైరూపాయలుండాలి అవి ఆవేళ్టి సంపాదన. తలకింద పెట్టుకున్న చొక్కా జేబులో డబ్బుతోసహా ఎవడో కొట్టేశాడు. ఏడుపొచ్చింది. నిజంగా కడుపు కట్టుకుని కూడ





పెట్టిన కష్టార్జితం ఆ సొమ్ము.

లాభంలేదు. ఎక్కడైనా ఓ గది చూసుకో వాలి. తను రాత్రులు పడుకుందుకూ, తన సామాను దాచుకుందుకూ. కౌపీన సంరక్ష ణార్థం అయం పటాటోపః. గోచీ దాచుకుం దుకింత ఆర్భాటం. తప్పదు. తన దగ్గర కూడా రోజూ ఐదో పదో ఉంటున్నాయి రూపాయలు. తన గుడ్డల సంచీ సరేసరి. ఉంటే తెలియదుకాని కొనాలంటే తెలు స్తుంది వీటి విలువ. గది కావాలి. కాని ఈ పట్నంలో. ఎంత మారుమూలయినా తనకు అందుబాటులో గది అద్దెకు దొరుకు తుందా? తనలాటి వీధులంట తిరిగి పాటలు పాడుతూ అడుక్కునేవాడికి అద్దెకి స్తారా?

అతనొక నియమం పెట్టుకున్నాడు. పొట్ట పోషించుకుందుకు తేలికైన సినిమా పాటలు పాడుతుండొచ్చుగాక. తనకి శాస్త్రీయ సంగీతమే ఇష్టం. అయినా పది మంది కోసమూ సినిమా పాటలు పాడక తప్పదు. అలాగని శాస్త్రీయ సంగీతాన్ని వదులుకోలేడు. వదులుకోడు. రోజూ కొంత సేపయినా ఆత్మానందం కోసమయినా ఆ సంగీతం పాడుకోవాలి.

చీకటి పడేసరికి పార్కుకొచ్చి అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆ వాతావ రణం బాగుంటుంది. కనుక అక్కడ తనకి నచ్చిన సంగీతం సాధన చేసుకోవాలనుకు న్నాడు. ఆవేళ అలా పాడుకుంటుంటేనే ఆయన తన కృతి అవగానే అభినందిం చాడు.

"ఎంత బాగా పాడినావు. త్యాగరాజువలే పాడినావు" అన్నాడు అరవ యాసతో. "నీ సంగీతం నాకెంతో సంతోషం కలిగించింది. నీకేదయినా మంచిచేయాలనుంది" అన్నాడు.

"నాకు ఉండేందుకొక గది చూపితే, అద్దెకే... నాకెంతో మేలు చేసినట్లే" నోరు జారాడు.

అప్పుడాయన గుచ్చి గుచ్చి అడిగి తన గురించి తెలుసుకున్నాడు.

"నా ఇంట్లో ఒక చిన్నగది ఉంది. అది నీకిస్తాను. కాని అప్పుడప్పుడు నాకు నీపాట వినిపించాలి. త్యాగరాజకృతులంటే నాకు రొంబ ఇష్టం"

"అలాగే" అనేశాడు వేణు.

"ఎప్పుడొస్తావ్?"

"ఇప్పుడే ఇలాగే"

ఆయన ఆశ్చర్యంగా చూసి... "అయితే వచ్చెయ్" అన్నాడు.

ఆయన ఒక హోటలు యజమాని. భోజన హోటలు నడిపే అయ్యరు. ఒకే ఇంట్లో వీధివేపు రెండు హోటళ్లు. అయ్యరు గారి భోజన హోటలూ. నాయర్‌గారి కాఫీ హోటలు. వెనుక భాగంలో నివాసం ఉండేందుకు వాటాలు. విడిగా ఔట్‌హౌస్ లాటి చిన్నగది. అదే ఇచ్చారతనికి. వేణు పరమానందభరితుడయ్యాడు. ఆ కుటుంబా లవాళ్లు మంచివాళ్లు. అతిత్వరగా తమలో కలిపేసుకున్నారు. రాత్రిపూట అయ్యరుగారి హోటల్లోనే భోజనం. అన్నివిధాలా ఆ బస సదుపాయంగానే కనిపించింది తనకి.

రోజులు గడుస్తూంటే కొత్త అవసరాలు బయటపడసాగాయి.

రోజుకో కొత్త సినిమా వస్తోంది. కొత్త సినిమా అంటే కొత్త పాటలు. కొత్తొక వింత, పాతొక రోత. జనం లేటెస్టు సాంగ్స్ పాడమంటున్నారు. అలా కొత్త పాటలు నేర్చుకోవాలంటే సినిమాని పదే పదే చూడ నయినా చూడాలి. లేదా రికార్డులు విననైనా వినాలి. పాటలకోసం సినిమాలు చూడడం పరమదండగ. ఎన్నిసార్లని చూడగలడు? టేప్ రికార్డరుమీద క్యాసెట్‌లో వింటే పట్టె య్యొచ్చు. క్యాసెట్ కొనడమయితే ఫరవా



లేదు. కాని ఒట్టి క్యాసెట్ చాలదుగా? రికార్డర్ ఉండాలి. అంటే వందలమీద ఖర్చు అయినా తప్పదు. బతకగలగాలంటే పాటలు పాడాలి. పాటలంటే ఎప్పటికప్పుడు కొత్త పాటలు. కొత్త నీరొచ్చి పాతనీరుని కొట్టేసే కొత్త పాటలు.

ఓ చవకరకం బార్‌వాడు పిలిచాడంటే వెళ్లి కలుసుకున్నాడు.

"మా బార్‌లో పాడాలి. మామూలు పాటలు కావు. సినిమా పాటల వరసలోనే పాడాలి. మా పాటలు" అంటూ మచ్చుకొకటి రెండు పాటల సాహిత్యం చూపించాడు. ఆ పాటలని సాహిత్యమనేకన్నా బూతులంటే సరిపోతుంది. 'అత్తరు సాయిబూ రారా'లాటి అశ్లీల పాటలు. అవి చదవడానికి అసహ్యమూ, భయమూ వేశాయి. అన్నమయ్య కీర్తనలు పాడే నోటితో ఆ బూతు పాటలు పాడడమా అనిపించింది.

"ఏం? ఇంతకంటె ఎక్కువెవడిస్తాడు నీ పాటకి" చిరాకుపడ్డాడు బార్ యజమాని.

"ఎంత ఎక్కువిచ్చినా నేనిలాటి పాటలు పాడలేను, పాడను" కచ్చితంగా చెప్పాడు.

"అయితే వెళ్లు. పిలిచి పిల్లనిస్తానంటే కులం తక్కువదన్నాట్ట నీలాటివాడే. సిరిరా మోకాలొడ్డేవాడిని ఎవడు బాగుచెయ్యగలడు? "

అక్కడినుంచి వచ్చేశాడు- వీళ్ల ఆఫర్‌కో దణ్ణంపెట్టి.

పార్కులో పాడడమూ, అయ్యరుగారింట్లో ఉండడమూ వల్ల కొందరు పెద్దలతో పరిచయాలయ్యాయి. అలా పరిచయమయిన వారిలో ఒక పెద్దమనిషి సలహా ఇచ్చారు.

"మంచి గాయకుడికి ఉచ్చారణ సరిగా ఉండాలి. పదం తాలూకు అర్థం తెలిస్తేనే కంఠంలోంచి ఆ పదం భావస్ఫోరకంగా వెలువడుతుంది. మంచి పాటలు చాలావాటిలో సంస్కృత పదాలే. కనుక నీకు కొంచెమేనా సంస్కృతం వస్తే మంచిది" అని.

నిజమే. అగ్నానము, బక్తిలాటి ఉచ్చారణ గాయకుడి గౌరవం నిలపవుకదా? అని సంస్కృతం చెప్పే ఓ మాస్టారి వద్ద శిష్యరికం ప్రారంభించాడు. ఆయనెంతో మంచివారు. సంస్కృతంతోపాటు ఇంగ్లీషు కూడా చెప్పేవారు. ప్రపంచజ్ఞానం బోధించేవారు. ఆయనకి తెలియని విషయంలేదేమో అనిపించేది. ఎన్ని చెప్పేవారో. రాత్రివేళ ఆ ప్రయివేటు. ఆయన సలహామీదే పుస్తకపఠనం అలవాటు చేసుకున్నాడు. పుస్తకాలు మస్తకానికి మెరుగులు దిద్దుతాయి, మనిషిని చేస్తాయనేది ఎంతో నిజం. పుస్తకాలు మరో ప్రపంచమే. మంచి ప్రపంచం. మంచి స్నేహితులు.

పుస్తకాలు చదవడం అలవాటయ్యాక తోచకపోవడమనేదే ఉండేది కాదు. అటు ఆచార్యులవారూ, ఇటు పుస్తకాలూ అతని భాషని ఎంతో సంస్కరించసాగాయి.

అతనుండే అయ్యరుగారింట్లో వాళ్ళు వాళ్లలోవారు తమిళమే మాట్లాడుకునేవారు. కాఫీహోటలు నాయరుగారింట్లో మళయాళమే మాట్లాడుకునేవారు. అతనితో మాట్లాడుతున్నా అలవాటులో పొరపాటుగా వీరికి వారి భాషొచ్చేది. వాళ్ల మాటలు వింటూ వింటూ మెల్లగా అతనికి ఆ భాషలు కూడా అలవడసాగాయి. సరదాగా అతనవి కూడా నేర్చుకోసాగాడు. అయ్యరుగారు రెండు మూడు రోజులకోసారి అతనిచేత త్యాగరాయ కీర్తనలు పాడించుకుంటున్నారు. ఆయన త్యాగరాజ కీర్తనల వీరాభిమాని. "శివదీక్షాపరురాలనురా..." అన్న కృతి ఆయనకత్యంత ప్రీతిపాత్రం. ఆయనెప్పుడూ- అదీ తప్పితే 'శృంగారలహరీ' పాడమనేవారు. తను చాలా శ్రద్ధగా పాడేవాడు. అయ్యరుగారికి తనంటే ఎంతో అభిమానం. గదికి నామమాత్రపు అద్దె. ఆ హోటల్లో చేసే భోజనానికి సగంరేటు. పండగొచ్చినా పబ్బ




మెచ్చినా వాళ్ళింట్లోనే అతని భోజనం. తనకు లభించే ఆదాయంలో కాస్తోకూస్తో మిగిలితే ఆయన దగ్గరే దాచుకునేవాడు. ఆయన భార్యని అమ్మా అని పిలిచేవాడు.

ఆవేళ- అయ్యరుగారొక పెద్దమనిషిని తీసుకొచ్చారు తన గదికి. "వీరు రాజశేఖరం గారని, పెద్దవారు. నీతో మాట్లాడదామని వొచ్చారు. రా, మా గదిలో కూర్చుని మాట్లాడుదువుగాని"

తను వారికి నమస్కరించి వీరి వెంట నడిచాడు. ఆ గదిలో కూర్చున్నాక అడిగారు వారు,

"నీ పూర్తి పేరు? "

"వేణుమాధవ్ అండి"

"ఏం చేస్తుంటావ్? "

"పాటలు పాడుకుంటూ బతుకుతున్నాను"

"చదువుకున్నావా? "

"పది పాసయ్యానండి"

"ఆపైన ఎందుకు చదువుకోలేదూ? "

"చదివించే వారు లేకనండీ. నేననాథ నండీ"

"ఏం పాటలు పాడగలవ్? "

"శాస్త్రీయసంగీతం... సినిమాపాటలు... భజనపాటలు... అన్నట్లు తత్వాలు కూడా పాడగలనండి"

"తత్వాలా!" ఆశ్చర్యపోయారాయన. "నీ వయసెంత? "

"పంథొమ్మిదండీ"

"ఇంత చిన్నవయస్సులో నీకు తత్వాలెలా వచ్చాయి? తత్వాలంటే ఏమిటనుకుంటున్నావ్? "

"మంగళంపల్లివారు పాడారు చూడండి. ఏమి చేతురా లింగా... ఎక్కడ మానుష జన్మంబెత్తిన ఫలమేమున్నది. అలాంటి పాటలండి తత్వాలంటే పాత 'షాహుకారు' చిత్రంలో 'గూటిలో చిలకేదిరా అన్నా... గూడు చిన్నబోయెరా...' అది నిఖార్సయిన తత్వమండి. పడవెళ్లిపోతోందిరా... అలాటి పాటలండి 'జగమేమాయ' కూడా తత్వంలా టిదే అనిపించింది. తత్వమంటే నాకర్థమయిందేమిటంటే వేదాంతం పాటలండి. వింటే వైరాగ్యం కలుగుతుంది. మనస్సు దోలా అయిపోయి గుండె బరువెక్కి ఏడుపొచ్చేస్తుంది" వివరించడానికి చాలా కష్టపడ్డాడు.

తత్వం వింటే సంగతేమోకానీ అతని మాటలకి ఆయనకి గుండె బరువెక్కిపోయింది. జాలితో కళ్ళు ఆర్ద్రమయ్యాయి. అతన్ని దగ్గరగా తీసుకున్నాడు ఆర్తితో.

"ఏదీ... నీకు నచ్చిన ఓ పాట పాడు" మెల్లగా అడిగారాయన.

"నగుమోము కనలేని..." అంటూ త్యాగరాయ కృతి ఎత్తుకున్నాడు. బుల్ బుల్ ని తెచ్చుకుని శ్రుతిగా. పక్కా పావుగంట పాడాడు.

"అద్భుతమయ్యా గాయకా! అపరనారదుడివే నువ్వు. నీ కంఠం మధురంగా, మార్దవంగా మహబాగుంది. చూడూ... వచ్చే లక్ష్మివారం నువ్వు ఒకచోట మినీ కచేరీ చేయాలి. గంటపాటు. నీకు నేనొక కొత్త పేరు పెడుతున్నాను. వేవ్..."

"వేవ్ ఏమిటండి? "

"రచయితలు కలంపేరు పెట్టుకున్నట్టు... చిత్రకారులు కుంచె పేరుంచుకునేటట్టు... గాయకుడివైన నీ గళంపేరు వేణుమాధవ్ లోని మొదటి చివరి అక్షరాలకూర్పు. నువ్వాకచేరీలో పాటలు పాడడం మాత్రమే చేస్తావు. ఇంకేమీ చెయ్యవు. మిగిలిందంతా నేను చూసుకుంటాను ఏం? "

"అలాగేనండి. కానీ నేను వేదికమీద పాడగలనో లేనో..."

"సముద్రాన్ని లంఘించినవాడికి కాలువ ఓ లెక్కా? ప్రజలముందూ, వీధుల్లోనూ



పాడేవాడికి వేదికొక ఘనమా? చూడూ... నీ గురించి నువ్వేమీ చెప్పకూడదు సుమీ"

ఆయనలా ఎందుకు చెబుతున్నాడో అర్థం కాకపోయినా అలాగే అన్నట్లు తలూపాడు. తను కచేరీ చేయబోతున్నాడనుకునేసరికతని కెంతో ఆనందమేసింది. ఏమిటో గొప్పగానూ, గర్వంగానూ అనిపించింది. అందలమెక్కుతున్నట్లయింది.

రాజశేఖరం వెళ్లడానికి లేచారు. "ఒక గంట పైన సాగాలి కచేరి. వైవిధ్యంకల మంచిమంచి పాటలెంచుకుని ప్రాక్టీసు చెయ్యి. కచేరీ అదిరిపోవాలి నీకూ నాకూ పేరు తెచ్చేలా!"

"అలాగేనండి. తప్పకుండా కష్టపడి ప్రాక్టీసు చేస్తాను వారంపాటూ" అంటూ నమస్కరించాడు.

"ఆ వేళకి నేనొచ్చి తీసుకెళ్తాను. గురువారం. సాయంత్రం ఐదున్నరనుంచీ యింట్లోనే ఉండు. ఎక్కడికీ పోకుసుమా. నిన్ను వెదుక్కోలేను. పట్టుకోలేను"

వారు వెళ్లాక అయ్యరుగారు హెచ్చరిస్తున్నట్లుగా చెప్పారు. "చూడు వేణూ! ఇది మంచి అవకాశం బాగా వినియోగించుకో. వృద్ధిలోకి వస్తావు. ఇలాంటి చిన్న విషయాలే రేపటి పెద్ద విజయాలకి దారితీస్తాయి"

"తప్పకుండా" అంటూ తలూపాడు. అయిదు రోజులలో వచ్చేసింది ఆత్రంగా ఎదురుచూసిన రోజు. అయిదున్నరకి రాజశేఖరం వచ్చారు. తలంటుపోసుకురమ్మన్నారు. వచ్చాక చేతిలో ప్యాకెట్ తెరిచి కొత్తబట్టలు అందించారు. "ఇది... యీ కచేరీ ఒకవిధంగా ఆరంగేట్రం. అందుచేత కొత్తబట్టలు ధరించాలి"

తీసుకుందుకు మొహమాటమేసినా కాదనలేకపోయాడా పెద్దాయనను. కళాకారులు వేసుకునే తరహా దుస్తులవి. పైజమా... లాల్చీ... వేసుకుంటే తనకి తనే కొత్తగా అనిపించాడు. అయ్యరుగారు బొట్టుపెట్టి ఆశీర్వదించారు. అద్దంలో చూసుకుంటే తనేనా అనిపించింది.

"గాయకుడు వేవ్ వర్ధిష్ణు. ముందుగానే పరిచయం పేరిట పొగిడితే తరువాత పాడడానికి యిబ్బంది పడతాడు. అంచేత ముందు కచేరీ తరువాత పరిచయం" అలా ప్రారంభమయింది గానసభ. మూడు శాస్త్రీయమైనవీ, మూడు సినిమా పాటలూ... ఓ లలిత సంగీతం పాడాడు. శ్రోతలు ఆసక్తిగా విన్నారు.

"ఇప్పుడీ వర్ధమాన గాయకుడి గానంమీద మీ అభిప్రాయాలూ సూచనలూ, సలహాలూ వెల్లడిస్తే అవి యితని అభివృద్ధికి దోహదపడతాయి" అంటూ అభిప్రాయాలనాహ్వానించారు రాజశేఖరం. ఒక్కొక్కరూ వచ్చి గాయకుడిని ఆకాశానికెత్తెయ్యసాగారు. "వేవ్! పేరే వెరైటీగా ఉంది. గానతరంగం. నిస్సందేహంగా యీ కళాకారుడు సంగీత సాగరంలో పెనుతరంగమే"

"చిన్నవాడు. ఎంత అందమైన రూపమో అంత అందమైన గాత్రం. సంగీత కళాకారులు సుందరంగా ఉండరనేది అపప్రథ అనడానికి తార్కాణం యీ అందమైన పాటగాడు.

"శాస్త్రీయ సంగీతాన్ని సినిమా సంగీతాన్నీ చిన్న వయస్సులోనే ఔపోశనం పట్టేశాడీ చిన్నవాడు" అలాగ అభినందనలు, ఆశీస్సులు వర్షమే అయి కురిశాయి.

అప్పుడు వేదికమీదకి వచ్చాడు మురారి.

"ఈ గాయకుడిని పరిచయం చేయవలసిన బాధ్యత నామీదపడింది. ఇతని గానాన్ని మీరందరూ చాలా ఎంజాయ్ చేశారని మీరు వేదికెక్కి వెలిబుచ్చిన ప్రశంసలే చెప్పాయి. ఇతను నిస్సందేహంగా అద్భుత గాయకుడే. అయితే యితనికి కులంలేదు, డబ్బులేదు, సమాజంలో గౌరవనీయమ

యిన అంతస్తులేదు, స్థాయిలేదు, అధికారం లేదు. అయినా యితని సంగీతం మనంద రినీ ఎంతో అలరించింది. అంటే దీనినిబట్టి మనమొక సత్యం తెలుసుకోవచ్చు ప్రతిభకి కులమత ఐశ్వర్య అధికార అంతస్తులతో నిమిత్తముండదని. మనిషిని కాక అతని లోని కళనే చూడమని యీ గాయకుడూ అతని గానమూ మనకి పరోక్షంగా చెప్పి నట్లే" అంటూ వేదిక దిగాడు మురారి.

ఎవరో వందన సమర్పణ చేయగా సభ ముగిసింది.

ఆ కచేరీ వేణుకి ఆత్మవిశ్వాసం కలిగిం చింది. ఉత్సాహాన్నీ, స్ఫూర్తినీ యిచ్చింది.

వేణు తాను పెరిగిన అనాథ శరణాల యాన్ని మరచిపోలేకపోతున్నాడు. అక్కడ ఒకప్పుడు తనతో ఉండిన వారెవరూ యిప్పుడు ఉండరు. అయినా సరే. ఒకసారా పరిసరాలని చూసుకుంటే అదో తృప్తి. చిన్నప్పుడు పెరిగిన పరిసరాలలా అనిపిస్తాయి కాబోలు. అలాగే అప్పుడప్పుడు వెళ్ళి అనంతరామయ్యగారి దర్శనం చేసుకు నేవాడు. "ఏమిటి సంగతి? ఏమైనా సహాయం కావాలా? " అడిగాడాయనొక సారి.

"వద్దండి. నేనందుకు రాలేదు. ఊరికే మిమ్మల్ని చూసిపోదామనొచ్చాను"

"నన్నెందుకు చూడ్డం? " నవ్వాడాయన.

"మిమ్మల్ని చూస్తే తండ్రిని చూసినట్లుం టుంది. మీరు నా ప్రాణదాతలు కదా. మీ ఈ శరణాలయమే లేకపోతే నేనేమైపోయే వాడినో"

"అలా అనకయ్యా నాకు సిగ్గేస్తుంది"

"సిగ్గెందుకండీ? అనాథాశ్రమం తప్పేమీ కాదుగా? "

"సిగ్గెందుకంటే... అనాథాశ్రమస్థాపన నేను నిస్వార్థంగా చేయలేదు కనుక. అది నాకు సహజంగా పుట్టిన త్యాగబుద్ధికాదు. స్వార్థం కొద్దేచేశాను"

"స్వార్థమా!"

"ఔనయ్యా. అప్పుడు నాకు డబ్బుయితే పుష్కలంగా ఉండేది. సినిమాహాలూ... పరిశ్రమలూ ఉండేవి. కానీ సంతానం మాత్రం లేదు. అదే నాకూ, మా ఆవిడకీ పెద్ద చింతయిపోయేది. సంతానం కలగా లని తీర్థయాత్రలు చేసేవాళ్ళం. పుణ్యక్షే త్రాలు సందర్శించేవాళ్ళం. బాబాలను సేవించేవాళ్ళం. ఒకనాడొక సాధువు కన పడి,

"నీ మనసు నాకు తెలుసు. నీ బాధ నాకు తెలుసు. అనాథలకాశ్రయం కల్పించు. ముఖ్యంగా వదిలివేయబడిన పురిటికందులకి రక్షణ కల్పించు. భగవం తుడు నీకు సంతానాన్ననుగ్రహిస్తాడు" అన్నాడాయన ఆశీర్వదిస్తూ.

అలాగే... స్వార్థంకొద్దే నేనా ఆశ్రమం స్థాపించాను. స్థానికులు నేను వద్దన్నా విరా ళాలిచ్చేవారు. దాని నిర్వహణ కోసం నేను పడిపోయిన శ్రమేమీలేదు. ఎలాగూ అనా థాశ్రమం ఉంది. యాదృచ్ఛికంగా నువ్వు తారసిల్లావు. తీసుకెళ్ళి చేర్చాను. అంతే తప్ప నేను నీకోసమని ప్రత్యేకంగా చేసిందే మీలేదు"

"ఆమాత్రం అయినా యీ రోజుల్లో ఎందరు చేస్తారండీ? మరి మీకు సంతానం...? " అడిగాడు వేణు సంకోచి స్తూనే.

"ఓ... ఇద్దరు. ఓ బాబూ, ఓ పాపా. ఎలా చేయనీ, ఎందుకు చేయనీ, ఓ మంచి పని చేయడమంటూ జరిగితే ఊరికేపో దయ్యా"

"ఔనండీ"

"పాటలు పాడుతున్నావటగా? ఏదో ఒక బతుకుతెరువు. మనహాల్లో నీకెప్పటికీ ఫ్రీయే. కావలసినన్నిసార్లు వెళ్ళు. మానేజ

ర్‌కి చెబుతాను"

"తమ దయండీ..." అని ఆయన వద్ద శలవు తీసుకు వచ్చేశాడు.

రోజులు అలా గడిచిపోతున్నాయి. వేగంగా.

ఆవేళ పార్కులోఫంగీత సాధన చేసుకుంటున్నాడు. ఎప్పుడు వచ్చారో మురారిగారు, "వేణూ! ఈ సంగతి విన్నావా?" అన్నారు.

"ఏ సంగతి?" వినయంగా అడిగాడు.

"అదే. రేపే వూరికి ఒక సినీ మ్యూజిక్ డైరక్టరూ, సింగరూ వస్తున్నారు. టాలంట్ సెర్చ్‌కోసమట. కొందరిని పరీక్షించి పనికొచ్చేవాళ్ళు దొరికితే సినిమాల్లో పాడించేందుకు 'తీసుకుంటారుట" ఉత్సాహంగా చెప్పారాయన. "నీ పాట వాళ్లకి కచ్చితంగా నచ్చుతుంది"

"అసలు... నా పాట వాళ్ళు వింటేకద. సినిమాల్లోకి తీసుకుందుకూ, మానేందుకూ"

"ఏం? వాళ్ళకి నీ పాట వినిపించవా? పోతనగారు తన భాగవతాన్ని 'అల్లకర్ణాట కిరాట కీచకులకమ్మ'నన్నట్లు నువ్వు సినిమాలకి పాడవా? అదేమయినా పరువుతక్కువ పననుకుంటున్నావా?" కోపంగా అడిగారు.

"నేను పాడకపోడంకాదు. ముష్టివాళ్ళని ఎంచుకునే హక్కుండదని నాకు తెలియదూ?"

"నువ్వు ముష్టివాడివి కావు. అలా నిన్ను నువ్వే కించపరుచుకోకు. గాయకుడివి. నీ పాట వాళ్ళెందుకు వినరనుకుంటున్నావు?"

"వాళ్ళందరినీ ఇంటర్వ్యూ చేయరట. కొందరి పాటలే వింటారుట. బహుశా సిఫార్సులున్న గొప్పవాళ్ళ తాలూకు వారి పాటలే వింటారనుకుంటాను"

"నీ పాటే నీకు సిఫార్సు. అయినా యిలాటివి చూడడానికి నేనులేనూ?"





"మీ రుణం... సార్! మీకెందుకు సార్ యీ అనాథమీద అంత అభిమానం?" కంఠంలో గద్గదికతతో ఆయన చేతులు పట్టుకున్నాడతను ఉద్వేగంగా.

"నా అభిమానం నీమీద కాదు. నీ గానం మీద. వేణూ! ఎల్లుండి వాళ్ళముందు నువ్వు పాడుతున్నావ్. ఓ.కే. బి రెడీ"

"సార్ నాకో చిన్న డౌటు"

"ఏమిటి? అడుగు"

"గాయకుణ్ణి ఎన్నిక చేసుకుందుకు గాయకుడు రావడమేమిటి సార్ మ్యూజిక్ డైరక్టరుతో? 'యాచకో యాచక శ్శత్రుః' అన్నట్లు 'గాయకో గాయకః శ్శత్రుః' కాదా? తనకి పోటీదారుడిని అతనే ఎన్నుకోడం న్యాయమా?"

"నీ సందేహం సమంజసమే కానీ వాళ్ళకెలాటి ఉద్దేశాలున్నాయో? అయినా అవన్నీ మనకెందుకు"

"నిజమే. మన సంగతేదో మనం చూసుకోడం నయం. ఊరుకున్నంత ఉత్తమమూ లేదు, బోడిగుండంత సుఖమూ లేదని కదా ఆర్యోక్తి! ఏమైనా వాళ్ళు కొందరినే పాడనివ్వడం నాకు బాగుండలేదు సార్"

"పాడతానన్న ప్రతివాడినీ వినడం మొదలుపెడితే వాళ్ళిక్కడ శాశ్వతంగా మకాం ఉండిపోవలసిందే" నవ్వారు మురారి.

"అదేంటి సారూ?" అమాయకంగా చూశాడు వేణు.

"అదంతే. ఈ ఆంధ్రదేశంలో ప్రతియిద్దరిలో ముగ్గురు పాటగాళ్ళే. వైద్యం తెలియనివాడూ, సలహా యివ్వలేనివాడూ మనవాళ్ళలో ఉండడు. బాత్‌రూమ్ సంగీతమయినా పాడేవాడే ప్రతివాడూ. అందులోనూ సినిమాల్లో ఛాన్సుంటే అదృష్టాన్ని పరీక్షించుకుందామని ఆడా మగా అందరూ ఎగబడతారు. మంగళారతులు పాడే ముసలమ్మలూ, జోలపాటలు పాడే జవ్వనులవరకూ... ఆడవాళ్ళూ, కుర్చీలో కూనిరాగాలు

తీసే కురువృద్ధుల నుంచి కుర్రవాళ్ళవరకూ మగాళ్ళూ అందరూ వచ్చేస్తారు ఆత్మవి మర్శా విచక్షణా లేకుండా.

ఎవడి ప్రతిబింబం వాడికి అత్యంత సుందరమే. అలాగే ఎవరి గొంతు వారికి అతిమధురమే. కానీ మనం పాడేపాట బాగుండవలసింది మనకి మాత్రమే కాదు, వినేవాళ్లకీని. ఈ ప్రాధమిక సత్యం విస్మరిం చగలిగినందుకే మనకందరు గాయకులు. సరేలే... ఎల్లుండి మనమిద్దరమూ వెళ్తున్నాం అక్కడికి" హెచ్చరించి వెళ్ళారు.

ఆవేళ క్లబ్బులో పాడేందుకు వెళ్తూ వేసు కున్న దుస్తులు పెట్లోంచి తీసి వేసుకు న్నాడు. మురారితో కలసి మ్యూజిక్ డైరె క్టరు చెప్పిన నక్షత్రాల హోటలుకి చేరుకు న్నాడు.

అక్కడ మిగిలిన వర్ధమాన గాయకులతో పాటు తన అవకాశం కోసం ఎదురుచూడ సాగాడు.

కొంచెం ఆలస్యమైనా అతనికి పిలుపు వచ్చింది. చాలామందిని రెండో చరణం వరకే కానివ్వని వాళ్ళు అతను పాట పూర్తి చేసేవరకూ అడ్డం పడకుండా విన్నారు. విని-

"మీపాట బాగుంది మిస్టర్ వేణుమాధవ్. అయితే మీ గొంతులో యింకా మెచ్యూరిటీ రాలేదు. బహుశా వయసు చాలకేమో. మీ కంఠం సెటిలవలేదు. మీకింకా యిరవయ్యో కటే కదా. భవిష్యత్‌లో మీ టోన్ పురుష త్వాన్ని పూర్తిగా సంతరించుకుంటుంది. అప్పటికి దానిలో డెప్త్ కూడా వస్తుంది. రెండుమూడేళ్ళు పోయాక కలవండి. చూద్దాం అన్నారు" అని వేణు చెప్పేసరికి మురారి మండిపడ్డాడు. "ఏదేనా కుక్కని చంపెయ్యదలుచుకుంటే దానిని పిచ్చికుక్క అనమని సామెత. ఇది అలాటిదే. సున్ని తంగా తిరస్కరించడం. సాహిత్యంలో శిల్పం, శైలిలాంటి బ్రహ్మపదార్థాలున్నాయి. నిజంగా వాటిని తెలిసినవారు అరుదు. కానీ ఏ రచననేనా బాగోలేదనెయ్యదలుచుకుంటే శిల్పం లేదు, శైలిదోష భూయిష్టం వంటి తిరుగులేని అస్త్రాలు వాడేస్తారు. అలాగే సంగీతంలోనూ ఈ గాత్ర పరిణతీ, గంభీ రతా వంటివి కాబోలు. వింటున్నవాళ్ళం మనుషులం కామా? మాకు మ్యూజిక్ ఇయరూ, సంగీత జ్ఞానమూ, రసాస్వాదనా ర్హతా లేవూ!"

"అది కాదు సార్. స్త్రీలు సింగరు సినీ సింగరగుట దుష్కరము అని తెలియచే శారు వారు, నవ్వేశాడు"

కాసెట్ వింటున్న మాధవికి నిద్ర వస్తున్నట్లనిపించింది. చదవడమైతే అలా అనిపించకపోనేమో. వినడం కదా... అందులోనూ ఆ కంఠం చాలా హాయిగా ఉందొకటి. దాంతో జోలపాట పాడుతు న్నట్లు అనిపిస్తూ కళ్ళు మూతలు పడ్తుతు న్నాయి. అదీకాక తక్కువ రాత్రేమీ కాలేదు. తను నిద్రపోతే అతనేమయినా అనుకుంటా డేమో.

ఆమె ద్వారం వరకూ వెళ్ళి పక్కగదిలోకి చూసింది.

మాధవ్ తదేకదీక్షతో చదువుతున్నాడు.

★ ★ ★

మద్రాసు వదిలేటప్పుడూ... రైలులో ప్రయాణించినంతసేపూ లలితకు ఎదురవని సమస్యా, ప్రశ్నా రైలు దిగాక ఎదుర య్యాయి.

"ఎక్కడికి? " రిక్షావాళ్ళు

"ఎక్కడికి? " ఆటోవాళ్ళు

"ఎక్కడికి? " హోటళ్ల ఏజంట్లు.!!!

ఒంటరిగా ఉన్న ఆమెను వాళ్ళందరూ తేనెటీగల్లా చుట్టుముట్టేశారు. "చెప్పండి. ఎక్కడికి? "



ఆమెకు మతిపోతోంది. భయమేస్తోంది. చీకటిపడి చల్లబడిన ఆ సమయంలో కూడా ఆమెకు చెమటలు పోసేస్తున్నాయి. వీళ్ళం దరి మధ్యా తన పనయిపోయిందనే అని పించింది.

సరిగ్గా అప్పుడు... ఆడ అగ్గిరాముడిలా... ఆపద్బాంధవిలా వచ్చిందామె. వస్తూనే ఆమె కళ్లల్లోకి చూసింది. "రామ్మా, యింటి కిపోదాం. రైలు యింత తొందరగా వచ్చే స్తుందనుకోలేదు. స్థిమితంగా వచ్చాను" అంటూ ఓ చేత్తో ఆమె చేయీ, మరో చేత్తో ఆమె చేతిలోని పెట్టే అందుకుంది.

బతుకుజీవుడా అనుకుంది లలిత. పరిస్థి తిని గ్రహించి తన నాదుకుంటున్న ఆ అప రిచితురాలి తెలివినభినందించుకుంది. ఆమె దయకు మౌనంగానే కృతజ్ఞతలు తెలుపు కుని ఆమె వెంట కదిలింది ఆమెకు ఎంతో పరిచయస్తురాలిలా.

గుమిగూడిన వాళ్ళు ఆశాభంగం చెంది నట్లు వాళ్ళకి తోవ చేస్తూ చెదిరిపోయారు. వాళ్ళిద్దరూ ఒకరిక్షా ఎక్కారు కొన్ని గజాలు నడిచాక. ఆమె అతనికేదో చెప్పింది. రిక్షా కదిలింది.

"నన్నా దుండగుల బారినుంచి రక్షించి నందుకు చాలా కృతజ్ఞతలు. ఇంతకీ మీరె వరు? " అడిగింది లలిత. "మీరు చేసిన మేలు..."

"అన్నీ తీరిపోయినదాన్ని. నా గురించి తెలుసుకుందుకేముంటుంది? నీ గురించి చెప్పమ్మా. నువ్వెందుకిలా చిక్కడ్డావ్ వారికి? "

"నేనెవరూ లేని ఒంటరిని. నాకెవరూ లేరు. అందుకే. అలా చిక్కుపడ్డాను"

"ఎవరూలేరా? " ఆశ్చర్యమూ జాలీకూడా ధ్వనించాయామె ప్రశ్నలో. "నీకూ ఎవరూ లేరా? నాకూ ఎవరూ లేరు. అందుకే నిన్నాపరిస్థితిలో చూడగానే కన్నకూతురిలా అనిపించి చొరవచేశాను. ఎక్కడినుంచి వస్తున్నావూ? "

"మద్రాసునుంచి"

"మీది మద్రాసా? "

"నాది ఏ వూరూ కాదు. నాకు ఏవూరూ లేదు. నేను ఒంటరిని. నాకెవరూ లేరు. ఏమీలేదు" దుఃఖం ఆపుకోలేకపోయింది.

"ఏడవకమ్మా. ఏడవకు. నీకు నేను న్నాను. నేనుంటానికనుంచీ. నాకు నువ్వుం టావు. నీ పేరేమిటమ్మా? " ఆమె తల నిమురుతూ అనునయంగా అడిగింది.

"లలిత..."

"చక్కని పేరు. నువ్వు మనిషివీ ఎంచ క్కని దానివే. నాపేరు మాణిక్యం. నీ అమ్మనే అనుకో. నీకేమీ భయంలేదు"

ఇల్లొచ్చింది కాబోలు రిక్షా ఆపించింది. రిక్షావాడికి తనే డబ్బులిచ్చి ఆమెను యింట్లోకి నడిపించింది.

చిన్న యిల్లు. అయినా బాగుంది. వేడి నీళ్ళు కాచి స్నానం ఏర్పాట్లు చేసింది. స్నానం అయేలోగా హోటలునుంచి క్యారి యరు తెచ్చి వేడివేడిగా భోజనం పెట్టింది. ఆమెను మంచంమీద కూర్చోబెట్టి తాను కింద కూర్చుని "ఇప్పుడు చెప్పమ్మా లలి తమ్మా" అంది మాణిక్యం.

అప్పటికే ఆమె ఆతిథ్యానికీ, అభిమానా నికీ కరిగిపోయున్న ఆమె తన గతమంతా చెప్పేసింది. అంతా విని "ఎంత కష్టమొ చ్చిందమ్మా! ఆడపిల్లవి. వయసులో ఉన్న ఆడపిల్లవి అలా దేశంమీదకి తరిమేస్తారా? వాళ్ళు తల్లీతండ్రీకారూ? వాళ్ళవి గుండెలా, రాతిబండలా? వాళ్ళు మనుషులేనా అసలు? మనిషి విలువ తెలిసినవాళ్ళయితే మనుషులయితే అలా ఎందుకు చేస్తారూ? కన్నపేగునీ పెంచిన ప్రేమనీ ఎలా తెంపే సుకుంటారూ అలా? పోన్లేమ్మా. పోయింది పోల్లు. నీ విలువ నాకు తెలుసు. నిన్ను




దేముడిచ్చిన బిడ్డగా చూసుకుంటాను. నీకిష్ట మయితే యీ క్షణంనుంచీ నాకూతురివే లలితమ్మా"

"అమ్మా" ఆనందమూ ఉద్వేగమూ పట్టలే కపోయింది లలిత. "నిజంగానా? "

"నువ్వు నన్ను అమ్మగా అంగీకరించడమే అసలు వరమమ్మా. లలితమ్మా ఇంత చల్లని మాట నాకోసమేనా? నా చెవులని నేనే నమ్మలేకపోతున్నాను తల్లీ"

"ఔనమ్మా" అంది కళ్ళు చెమర్చగా. జీవి తంలో ఎన్ని దురదృష్టాలూ, దౌర్భాగ్యాలూ ఎదురయినా ఈ ఒక్క విషయంలోనూ మాత్రం అదృష్టం తనని అపహాస్యం చేయ కుండా వదులుతున్నట్లుంది. మద్రాసులో విశ్వనాథం బాబాయీ, రోజా. ఇక్కడ రైలు దిగేసరికీ అమ్మ. ఒంటరిగా యాతన పడన క్కర్లేకుండా సమయానికి తోడు దొరకడం మాత్రం ఎంతో అదృష్టం కాదూ? దేముడు మనిషి జీవితంలో ఒక ద్వారం మూసేసినా మరో ద్వారం తెరుస్తాడంటారిదే కాబోలు. ఈ ఆధారాన్ని వదులుకోకూడదు.

"అమ్మా! నీకూ ఎవరూలేరా? పిల్లలు..."

"లేరమ్మా. అందుకేకదా మోడులా ఉండి పోయాను"

"మా అమ్మ గురించి నాకూ తెలుసుకోవా లనుంటుంది కదా"

"నీకుకాక మరెవరికి చెప్పుకుంటానమ్మా నాకథ? ఆర్చేదానివైనా, తీర్చేదానివైనా యిక అన్నీ నాకు నువ్వేకదా? అయితే అది యిప్పుడు కాదమ్మా. నువ్వు ప్రయాణం చేసి అలసిపోయావ్. రాత్రికూడా తక్కువేమీకా లేదు. పడుకో యిప్పటికి. సమయమూ, సందర్భమూ రాగానే నేనే అంతా చెబు తాను. నేను చెప్పేవరకూ నా గురించి ఎవరేం చెప్పినా నమ్మకు ఏం? " అంటూ దీపం ఆర్పి దుప్పటీ కప్పి తనూ నేలమీద చాప పరుచుకుంది. లలితకి కొద్దినిముషా లకే నిద్రపట్టేసింది.

తెల్లవారి లేచి టీలు తాగుతుంటే మెల్లగా అడిగింది మాణిక్యం.

"లలితమ్మా ఎలా బతకాలనుకుంటు న్నావ్? "

"..." ఆమె దగ్గర సమాధానముంటేగా చెప్పడానికి.

"బతకడానికేదో ఒక పనిచెయ్యాలిగా? వ్యభిచారవృత్తి చేస్తావా? "

ఎంతో సహజంగానూ, మామూలుగానూ అడిగింది.

ఆమె ఆ మాటలకు తుళ్ళిపడింది. "నాకు వ్యభిచరించి బతుకు గడపడం యిష్టంలే దమ్మా"

"మరెలా బతుకుతావ్? " ఆశ్చర్యంగా చూసింది మాణిక్యం. ఒంటరి ఆడది వృత్తి చేసి కాక మరోలా బతకగలదంటే ఆమె నమ్మలేదు. ఆమె జీవన విధానమూ జ్ఞానమూ అలాంటివి.

"ఒకటి రెండు ప్రయత్నాలు చేసి చూస్తాను. అలా బతకలేకపోతే అప్పుడాలో చిద్దాం"

"సరే... కానీ ఒకటి గుర్తుంచుకో. నీ సంపాదన నీపొట్టకేనా చాలాలి"

"అలాగే" అన్న లలిత ఒక ట్యుటోరి యల్ కాలేజీకెళ్ళింది. నర్సరీనుంచి పదోతర గతి వరకూ చదువు చెబుతారక్కడ. ఉద్యో గమివ్వగలరా అని అడిగింది. ఆ ప్రిన్సి పాలు యువకుడు. ఆమెని చూసి "ఏం చదువుకున్నారు? " అన్నాడు.

"పదో తరగతి పాసయ్యాను" అంది సగ ర్వంగా.

"అయితే ఆయాగానే పనికొస్తారు. మాకు ఆయా ఉంది. కావలసినప్పుడు కబురుపె డతా, దరఖాస్తు ఇచ్చి వెళ్ళండి"

"నేను పాఠాలు చెబుతాను"



"మీరు పాఠాలు చెప్పలేరే"

"పదోక్లాసు పాసయ్యాను కదా. రెండో క్లాసుకేనా చెప్పలేనా? " రోషంగా చూసింది.

అతను నవ్వాడు. "మా కాలేజీలో ఒకటో క్లాసుకి చెప్పాలన్నా డిగ్రీ హోల్డరయ్యుండాలి. మీకు డిగ్రీలేదు. తగినంత వయసు కూడా లేదు. పూర్వానుభవం మొదలేలేదు. అయినా సరే. ట్రయిల్‌వేసి చూద్దాం ఓ నెలపాటు. ఒకటో క్లాసుకి చెప్పండి రేపటి నుంచి" అంటూ సర్టిఫికెట్లు తీసుకున్నాడు. "జీతం మూడువందలు" సరే అన్నాను.

ఒకటోక్లాసుకి తెలుగు చెప్పడం, క్లాసులో అరవైమంది పిల్లలు. పాఠం చెప్పడం అటుంచి వాళ్ళ నదుపులో పెట్టడమే నాకు చేతకాలేదు. పిల్లల్ని కొట్టకూడదుట. వాళ్ళని హద్దులో ఉంచలేక ఏడుపొచ్చేసేది. నెలా ఎలా గడిపానో నాకే తెలియదు. జీతం అందుకుని యింటికి వచ్చాను. ఆనందంగా తొలిజీతం అందుకున్నందుకు గర్వం. మాణిక్యం లెక్కలు తీసింది. "ఇంటద్దె నీవంతు ఏభై. తిండికి, టీలకి అయిన ఖర్చులో సగంవంతు నాలుగువందలు. సబ్బు, తలనూనె, చాకలి..."

"ఆగాగు. నా మూడొందలూ యింటద్దెకి, తిండికి చాల్లేదే" వెర్రిమొహం వేసింది తను.

ఇంకా చీరెలు కొనుక్కోవాలనుకుంది తను. ఉద్యోగంలో చేరిన పదిరోజులకి...

"మీరు కాస్త శుభ్రమైన చీరెలు కట్టుకొస్తూండండి మాడమ్" అన్నారు తోటి మగ టీచరు.

తనకి పౌరుషమూ వచ్చింది. సిగ్గూవేసింది.

"డిసిప్లిన్ ఉండాలి. అదీకాక పిల్లలకి కూడా టీచరంటే గౌరవం కలగాలికదా? మాసిపోయి, నలిగిపోయిన చీరెలు కట్టుకొస్తే బాగుండదుకదా"

తన దగ్గర మంచి చీరెలుంటే కదా కట్టుకురావడానికి? జీతమందాక అర్జంటుగా రెండు చీరెలు కొనాలనుకుంది ఆ క్షణంలో.

మరో మగ టీచరడిగాడు "లలితగారూ! మీరుండేదెక్కడ? "

చెప్పింది. ఆ జవాబు విని అతను గుంభనంగా నవ్వాడు.

"నే చెప్పిందాన్లో నవ్వడానికేముంది"

"నాకు చెబితే చెప్పారుకానీ మరెవరికీ చెప్పకండి. ప్రిన్సిపాల్ అసలే ముక్కుసూటి మనిషి. తన కాలేజీ టీచరు సానివీధిలో ఉండేదంటే ఉద్యోగం ఉంచడు. నిజానికీ జీతం వక్కదానిమీదా బతకడం అసాధ్యమే. సైడున ఆ బిజినెస్ కూడా చేసుకుంటూంటేనే వేణ్నీళ్ళకు చన్నీళ్లు. పగలిక్కడా, రాత్రిక్కడా సంపాదిస్తూంటేనే మీలాటివాళ్ళు స్వతంత్రంగా జీవించగలరు"

"ఏమిటి మీరనేది? " కోపంగా చూసింది తను అతని మాటలలో అర్థాలకి.

"యదార్థవాదీ లోకవిరోధీ. తింటేకాని రుచి తెలియదు. దిగితే కానీ లోతు తెలియదు. ఒకటిరెండు నెలల్లో మీరే తెలుసుకుంటారు. మీరేకాదు. ఎవరూ కేవలం యీ జీతం ఒక్కదానిమీదే తనని తాను పోషించుకోలేరు. ఛాలెంజ్..."

అతని మాటలు నిజమని నెల తిరిగేసరికే నిరూపించబడిపోయింది.

"నీవంతు ఖర్చు ఆరువందలు ఇవ్వు"

"మూడువందలే నీకివ్వడానికుంది. నా జీతం యింతే"

"ఈ నెలకి అప్పు పెడతాను. కాని ఎన్ని నెలలిలా? ఈ అప్పు పెరగడమే కానీ తీరడమనేదుంటుందా? చదువుకున్న దానివిగా ఆలోచించు"

టీచర్‌గా మంచి చీరెలు కట్టుకెళ్లాలి. మంచిప్రాంతంలో నివసించాలి. పాఠాలు చెప్పేందుకు ఓపికకోసం బలమయిన తిండి తినాలి. మూడువందల జీతంలో యివన్నీ





కావు, యిందులో కొన్నయినా సాధ్యమేనా అని. ఇచ్చేది యీతకాయ, లాగేది తాటి కాయ అంటారే యిదేనేమో. కుటుంబంలో ఉంటూ వేణ్ణీళ్ళకి చన్నీళ్ళుగా సంపాదించే వాళ్లకయితే ఫరవాలేదు కానీ యీ జీతం మీద బతకాలంటే అసంభవమే.

తను మర్నాడు వెళ్ళేసరికి ప్రిన్సిపాల్ తన ఉద్యోగానికి ఉద్వాసన చెప్పేశారు. తనలా టిది పవిత్రమయిన టీచరు ఉద్యోగానికి పనికిరాదుట. నాలో లోపం ఏమిటి?

ఒక్క నెలే చేసిన యీ ఉద్యోగంలో కొంచె జ్ఞానం కలిగింది. ప్రపంచం తెలి సింది.

"బిస్కట్ల కంపెనీలో పనుందట. రోజుకు పదిహేను రూపాయలు. వెళ్తావా?" అడి గింది మాణిక్యం.

"పదిహేను రోజుకి. నెలకి నాలుగువం దల యాభై, చాలదు."

జీవితం లెక్కల్లోకి దిగింది. ఎందుకేనా మంచిదని పనిలోకి వెళ్ళింది చూద్దామని. ఉదయం ఎనిమిదిన్నరనుంచి సాయంత్రం అయిదువరకు వళ్ళు పులిసిపోయేలా పని. నిజంగా సమస్య అది కానేకాదు. మూడోరో జున మస్తరు మనిషి తనని పక్కకి పిలిచి తన కోరిక తీరిస్తే రోజూ మస్తరేస్తాన న్నాడు. ఇరవై రూపాయలవాళ్ళలో కలిపే స్తానన్నాడు. మాణిక్యంతో ఉండడంతో ఆ మాటలూ, ధైర్యమూ అబ్బినతను, ఆ పని చేసేకాడికైతే యింతవరకూ రాడందేనికీ కాళ్ళపీకు? నువ్వు రోజుకిప్పించే యిరవై రూపాయిలూ నేనొక్క నిముషంలో గడి స్తాను' అంది పొగరుగానూ, మొండిగానూ. అంతే అక్కడికక్కడే అప్పటికప్పుడే తన పని వూడింది. ఈ చిన్న అనుభవాలతోనే తనకి చాలా జ్ఞానోదయం అయింది.

చదువుతున్న మాధవ్‌కి ఆమె పరిస్థితి మీద జాలివేసింది. ఈ ప్రపంచంలో అన్ని టికంటే దుర్భరమైనది ఒంటరిగా బతకడం. అందులోనూ అలా ఒంటరిగా బతకవలసిన వారు వయసులో ఉన్న అమ్మాయియితే మరి చెప్పనే అక్కర్లేదు. మగాడిగానే తనకి ఒంటరిగా బతకడానికప్పుడప్పుడేడుపొచ్చేది. ఆ దుఃఖం మరిచిపోడానికి ఏ సినిమాకో పోయేవాడు. అమ్మాయికి కనీసం రోడ్డు మీద తిరిగేందుకేనా స్వేచ్ఛ ఉండదు. ఏ హోటలుకో పోయి కాఫీ తాగుదామన్నా కుదరదు. ఒక్కతే వెళ్లిందో రౌడీలో, యీవ్ టీజర్లో చికాకు పెడతారేమోని. ఇంటికంటే గుడి పదిలమనేది మగాళ్లకే వర్తించే సామెత. ఆమెకు నా అనేవారు లేక పోబ ట్టేకదా సినిమా ఛాన్స్‌కని వెళ్లి శీలాపహర ణకు గురయింది? ఆ విశ్వనాథమేకాని ఆమెకి నిజంగా తండ్రో సోదరుడో అయ్యుంటే ఆమెనలా ఆరుబయలుకి వొది లేసేవాడా?

అతనొక్కసారి కళ్ళు తుడుచుకుని, మళ్ళీ ఆమెకథ చదవసాగాడు.

★ ★ ★

ఏమిటీ జీవితం? ఎందుకీ జీవితం? మనిషికి ఇంత అశక్తతా! అసమర్థతా! ఒక చిన్న కలని కూడా నిజంచేసుకోలేని నిర్భా గ్యమా! తనేమయినా కోరరానివీ కొరకానివీ కోరుకుందా? మనిషి కనుక మరో మనిషి తోడు కోరుకుంది. జీవితానికి సహచరుడిని కోరుకుంది. అతను తనని పోషించేందుకు ప్రతిగా అతనికి సేవలు చేస్తుంది.

తోడు, సాహచర్యం, రక్షణ... ఇవి కూడా అందని చందమామలేనా? మనిషి కనీస కోర్కెలు కావూ? వీటికోసమూ తీవ్ర పోరాటం సలపాలా? మానవ జన్మ ఇంత నిర్భాగ్యమైనదా? ఐనా దేముడికెందుకింత కక్ష తనమీద?

కష్టపడడానికి తను సంసిద్ధురాలే. కాని ఆ కష్టం తన కడుపుని సగం కూడా

నింపదు!

ఏ వ్యభిచారమంటే తనకి పరమ అసహ్యమో, ఏదంటే తనకి అత్యంత అయిష్టమూ, ద్వేషమూ, రోతో-ఆ దిశకి తనని నెట్టుతూంది జీవితం.

దేనినయితే తను చీదరించుకుంటోందో, దానినే తన నొసట రాస్తున్నట్టున్నాడు విధాత. విధినెదిరించటం తనలాటి ఏకాకిత రమా?

చిన్న ఇల్లు, దానిలో తనూ తన భర్తా, పిల్లలూ. వారి సేవలో తనువు జీవితం అలా వెళ్లిపోతే చాలు. అంత సామాన్యమయిన కోరిక కూడా తీరకపోడానికి తను చేసిన నేరమేమిటి? ద్రోహమేమిటి? పాపమేమిటి?

ఒకవేపు ఒంటరితనం మరోవేపు ఇటువంటి కఠిన జీవితం. రెండింటినీ ఎదుర్కుంటూ బతకగలగడం తన తరమేనా? ఎందుకిలాటి నికృష్టపు బతుకు? ఎవరినుద్ధరించాలని. ఇలా బతకడంకంటే చావడమే నయంకాదూ? ఈ జీవితంకంటే ఆ చావే సుఖంకాదూ తనలాటి దానికి? మళ్లీ తనని చావనివ్వకుండా ఏవో ఆశలు. ఉద్యోగమని అనదగని పనులు. నెలకి మూడొందలొచ్చే డాక్టరు దగ్గర నర్స్‌లాటి ఉద్యోగాలు. చిన్న చిన్నరాళ్లు చిల్లర దేవుళ్లలాటివే ఇలాటి ఉద్యోగాలు. ఇవి మనిషిని బతకానివ్వవు, చావానివ్వవు. ఇలాటివి తనలాటి ఒంటరి పోగులకి ఎంతమాత్రమూ కాదు. కుటుంబంలో ఉండేవారికి. తను ఆడది, అందమయిందీ, వయసులో ఉన్నదీ కావడంతో మగాళ్ల కన్ను తనమీద పడుతుంది. ఉద్యోగం నిలువుకుందుకేనా వ్యభిచరించవలసిన పరిస్థితులెదురౌతున్నాయి. వ్రతం చెడినా ఫలమయినా దక్కాలికద! ఇలాటి బోడి ఉద్యోగాలు నిలుపుకుందుకు చేసే





వ్యభిచారమేదో నేరుగానే చేసుకోడం మంచిది. లాభసాటిగానూ స్వతంత్రంగానూ అయినా ఉంటుంది.

అప్పటికలా ఆలోచించినా ఆమె మనసు వ్యభిచారంమీద బతకడానికి మొగ్గలేదు. సగటు స్త్రీకి మల్లేనే ఆమెకీ అప్పుడాలూ కుట్టుమిషనూ వంటి ఐడియాలొచ్చాయి. కాని వాటికి పెట్టుబడి? అదే లేదు ముందు. తరువాత అవి తనకు ఆర్జననిచ్చినా మానినా ప్రారంభించడానికే లేదలాటివి. పెట్టుబడిలేని వ్యాపారం ఒక్కటే కనిపిస్తుంది. వ్యభిచారం.

రోజీ అన్నట్లు ఒకసారి చెడినా చెడడమే. వెయ్యిసార్లు చెడినా చెడడమే. ఇప్పటికి తను చెడిపోయింది. ఇష్టపడో పడకనో. కొత్తగా చెడేందుకేముందిక? తననితాను పోషించుకోగలిగేపాటి ఉద్యోగాన్ని సంపాదించి పెట్టేందుకు తన చదువేమూలకీ చాలదు. ఈ రోజుల్లో పదోక్లాసు గుడ్డి గవ్వ పాటి విలువయినా చేయదు. పోనీ కాయ కష్టం చేసుకు బతుకుదామన్నా వాటిలో వచ్చేది అంతంత మాత్రమే. చూడబోతే తనలాటి పరిస్థితిలో ఉన్న ఆడదానికి వ్యభిచారం తప్ప మరో సంపాదనా మార్గంలేదేమో! స్వతంత్రంగా బతికించేదీ ఆర్థికంగా ఆదుకోగలిగిందీ.

ఎంత దౌర్భాగ్యం! దేశంలో జనం పెరిగిపోడంవల్ల కాబోలు మగాళ్లకే పనులు దొరకడంలేదు. ఇక ఆడాళ్లకేం దొరుకుతాయి?

ఇంటికొచ్చి విచారంగా పడుకున్న ఆమెను చూసి "ఏమైందమ్మా?" అని అడిగింది మాణిక్యం ఎంతో లాలనగానూ ప్రేమగానూ. మనసులో దాచుకోలేక బిస్కట్ కంపెనీలో జరిగింది చెప్పేసి భోరున ఏడ్చేసింది. మాణిక్యం ఆమె తల నిమురుతూ, "దీన్లో బాధపడడానికీ ఏడవడానికీ ఏముంది తల్లీ? లోకన్నైజం అంతే. పువ్వు కనిపిస్తే తుమ్మెద వాలిచూద్దామనుకుంటుంది. మగాడు తుమ్మెదకంటే తుంటరికదా? ఏమయినా నువ్వు వాడికి మహబాగా జవాబు

చెప్పావ్, చెప్పుచ్చుక్కొట్టినట్లు. మాటలో మాణిక్యం బిడ్డవనిపించుకున్నావ్. సెభాసుగా బదులిచ్చావ్. ఈ ప్రపంచం ఇలాగే ఉంటుంది తల్లీ. దీన్లో బతకడం ఓ కళ. ఈ చిన్నా చితకా పనులు చేసి ప్రాణానికి సుఖముండదు. బతుక్కి ఎదుగుదలా ఉండదు. చాలీచాలని మెతుకులెన్నాళ్లు. కాకిలా కలకాలం బతికేదానికంటే హంసలా ఆర్నెల్లే బతికినా అది సెభాషేకాదూ? "

ఆమె ఏమీ అనలేదు. మాణిక్యం కూడా ఇంకేమీ అనలేదు



**ఆవేళ** ఎవరింటి ద్వారంమీదో రికార్డింగ్ డాన్సరనే బోర్డు చూడడం తటస్థించింది. వ్యభిచారంకంటే అదినయమే అని రికార్డింగ్ డాన్సర్ ఔదామనుకుంది లలిత. నటనలాగే నాట్యమూ కళేకదా అనుకుంది. అంతే తప్ప అప్పటికామెకేమీ తెలియదు దాని గురించి. సినిమా స్వర్గమయితే రికార్డింగ్ డాన్స్ త్రిశంకు స్వర్గం! అప్పటికి తనకా విషయం తెలియదు. వేశ్యగా తప్ప మరెలాగయినా బతకాలని తాపత్రయం. రికార్డింగ్ డాన్స్ ఆర్టిస్టుల మేస్త్రీల్ని మానేజర్లంటారు. అలాటి ఒకరివద్దకు తీసుకెళ్లి పరిచయం చేసింది మాణిక్యం. అతని పేరు అప్పారావ్. రౌడీలా కనపడుతూ తాగుబోతు వాసనేస్తున్నాడు సినిమా నిర్మాతా, దర్శకుల స్థాయిలో పోజుకొడుతూ.

"నీ పేరు!" అడిగాడు ముద్ద మాటలతో.

"చిత్ర" నోటికొచ్చింది చెప్పేసింది అసలు పేరు కాకుండా.

"పేరు బాగుంది. ఫిగరూ బాగానే ఉంది. ఎటొచ్చీ మెన్‌టెన్ చెయ్యాలి. ఆఁ నీ వయసెంత? నిజం చెప్పాలి సుమీ. నా దగ్గర అబద్ధమాడకూడదు" జోకేసినట్లు నవ్వాడు. తన వయసు చెప్పింది. అతని చూపులూ, వాలకమూ ఒంటిమీద గొంగళీలు పాకుతున్నట్లున్నా.

"అప్పారావ్ రికార్డింగ్ డాన్స్ కంపెనీ అంటే హోల్ జిల్లాకే పేరు. నువ్వు నా పేరూ నా కంపెనీ పేరూ నిలబెట్టాల. నా ఆర్టిస్టుల్లో ఎందరో సినిమాల్లోకెళ్లారు. నువ్వు నేను చెప్పినట్లు వింటూ నమ్మకంగా ఉంటే నిన్ను కూడా తొందర్లోనే సినిమాలకి పంపేత్తాను. ఆ నీకు డ్యాన్సింగేమేనా వచ్చా? భరత నాట్యం కాదు. సినేమా డాన్సులు. రాక్ అండ్ రోలు లాటివి"

"రావు"

"పర్లేదు. నేన్నేర్పిత్తా. మరి సినేమాలు ఎక్కువ చూత్తావా? "

"అప్పుడప్పుడు"

"అలా కుదర్దు. రికార్డింగ్ డాన్సు చేసే వోళ్లు కూడా సినిమా చూడకపోతే ఎలా? ఇకనుంచి ఎక్కువగా చూడు. ఊ నీ అబిమాన ఈరోయినెవరు? అబిమానయీరో ఎవరు? "

"ప్రత్యేకంగా ఒకరని లేరు. ఎవరు బాగా నటించారనిపిస్తే వాళ్లే"

"అలా కుదర్దు" అంటూ గ్లాసెత్తి నోట్లో పోసుకుని "నీలో కొంచెం ఊరుమిళ పోలిక లగుపడుతున్నాయి. అంచేత నువ్వు ఊరు

మిళనబిమానించాలి. ఆమె సినిమా వస్తే అన్నాటలూ చూడాలి. ఆవిడ పాటలకెలా డాన్సు చేస్తుంటే ఎలా స్టెప్పులేత్తూందో పట్టే యాలి. అలాగే తెరమీదెవరు డాన్స్ చేసినా పట్టేసి నువ్వూ ఆ స్టెప్పులేసేగలగాలి. అంటే బాగా ప్రాక్టీసు చెయ్యాలి. అబ్యేసం కూసు విజ్జ. ప్రోగ్రాము లేనప్పుడు ఊరికే తిని కూర్చుంటూ ఒళ్లు పెంచీకూడదు. అలా అయితే ఫీల్డులో ఆట్టేకాలం ఉండలేవు. ఎందుకూ పనికి రాకుండా పోతావ్" బెదిరి స్తున్నట్లే అన్నాడు. ఆమె ఏమీ అనలేదు. మళ్లీ అతనే అన్నాడు.

కొత్త దానివి కనుక రెగులర్ ఆర్టిస్టుకిచ్చే దాన్లో సగమిస్తాను ప్రస్తుతానికి. నీ పెర్ఫా ర్మెన్స్ చూసి మెల్లగా పెంచుతాను. నీకిష్ట మైతే రేపటినుంచి రిహార్సల్స్‌కిరా. ఈ ఆఫీ సువెనక గొడౌనులోనే రిహార్సల్స్. ఎల్లుండి గైరమ్మ పండగ. ప్రోగ్రామ్‌లున్నాయి" అన్నాడు, అలాగే అని వచ్చేసింది.

మర్నాడు వెళ్లింది. గొడౌనులో రిహా ర్సల్స్. ఓ టేప్ రికార్డర్‌లోంచి పాట వస్తుంటే దానికనుగుణంగా గంతులె య్యడం. ఔను గంతులెయ్యడమే. ఓ శాస్త్రమూ పద్ధతీ ఏమీలేవు. "కొత్తగా వచ్చావా? " అడిగిందామె ఎవరో. ఔన న్నట్లు తలూపింది చిత్ర బెరుకుగా.

"బెదిరిపోకు. ఇదేటన్నా డాన్సేటి? జనాల్ని పిచ్చెక్కించేలా మనం గెంతడం పాటకి. ఒకటి గుర్తెట్టుకో. ఒంటిమీద గుడ్డ ఎంత తప్పించగలిగితే అంత గొప్ప డాన్సరూ, అంతపేరూ. అంతే" సులువూ సూత్రమూ చెప్పింది రికార్డింగ్ డాన్సుకి. చెప్పి "అన్నప్రేశననాడే ఆవకాయన్నట్లు ఇవాళ తెగగెంతావో రేపు స్టేజీమీద బబ్బుం డిపోతావ్. అలవాటు లేకపోతే అంతే. ఒళ్లు న్నొప్పులూ కాళ్లపీకులూ. ఇకచాల్లే. మందు కొడదామా" అడిగింది లీల.

"ఉహుఁ.. నేను తాగను. అలవాటు లేదు. ఇష్టముండదు"

వెర్రిమొహాన్ని చూసినట్లు చూసిందామె. "మందుకొట్టకపోతే డాన్సేం చేత్తావ్? "

మర్నాడు సంబరం. ఊరినిండా స్టేజిలు కట్టారు. చాలా స్టేజిల మీద రికార్డింగ్ డాన్సుల ప్రోగ్రాములే. రాత్రి పదినుంచీ కార్యక్రమాలు ప్రారంభం. అదృష్టవశాత్తూ లీల, చిత్ర ఒకే గ్రూపు. మేకప్ దగ్గర చెప్పింది లీల. "పేరుకి రికార్డింగ్ డాన్సు తప్ప ఏమాత్రం వీలున్నా ఇవి సాని మేళా లైపోతాయి. బూతుపాటలు... వాటికి తగ్గట్లు బ్రా, లంగాలతో డాన్సులు. వీలుంటే వాటినీ విసర్జించేస్తారు. జాగ్రత్త. పోలీసులు న్నట్లున్నారు"

మొదటి పాట లీల అండ్ రాజ్ ది. లీల అతి తక్కువ డ్రెస్‌తోనే వెళ్లింది వేదికమీ దకి. పాటలో ఓ చరణానికి గెంతారోలేదో "అవీ విప్పెయ్యాలి, బ్రా తీసెయ్, లంగా పీకేయ్" అని ప్రేక్షకులలోంచి అరుపులూ గోలా. వాళ్లు స్టేజీమీదకి వచ్చేసేటట్లు న్నారు. బ్రా తొలగించబోతుంటే పోలీ సులు. "కాబరే అనుకున్నావుటే కంగాళీ ముండా! గుడ్డలు తీసేసి దిసమొలతో గెంతుదామనుకున్నావేటి? " లాఠీలు ఝుళి పింపు.

"తియ్యకపోతే తంతాం" ప్రేక్షకులు తాగి నానా అల్లరి.

"తీస్తే తంతాం" లా అండ్ ఆర్డర్ పోలీ సులు.

ఏం చెయ్యాలో తోచలేదు. కరవమంటే కప్పకి కోపం, విడవమంటే పాముకి కోపం. కొద్ది నిముషాలలో ప్రేక్షకులూ పోలీసులూ వేదిక మీదకొచ్చేశారు. అంతా గందరగో ళమూ రసాభాసా. ఆ కొట్లాటలోంచి ఎలాగో బయటపడింది డాన్స్ ట్రూప్. చిత్ర కొకటర్థమయింది. రికార్డింగ్ డాన్స్ పేరిట చాలామంది కోరుకునేవి బూతు పాటలూ నగ్న ప్రదర్శనలూ.




మానేజరు మరో స్టేజి దగ్గరకి తీసుకెళ్లాడు. అక్కడ కూడా ప్రోగ్రాముంది కంట్రాక్టు ప్రకారం. "ఇక్కడ రౌడీమూకలుండవు. ప్రోగ్రాము సవ్యంగా సాగుతుంది" అని చెప్పాడు. మళ్లీ మేకప్ చేశారు ఆర్టిస్టులకి. తీరా ఐటమివ్వడానికి ఆర్టిస్టులు వేదిక మీదకి వెళ్లేటప్పటికి పెళపెళమంటూ చప్పుళ్లు. వేదిక కూలిపోసాగింది. దాంతో షార్ట్‌సర్క్యూట్. మంటలు... ప్రమాదం.. గోల హాహాకారాలు. ఈ ఆర్టిస్టులన్నా వాళ్ల ప్రాణాలన్నా ఇంత చులకనన్నమాట. కనీసం స్టేజినయినా జాగ్రత్తగా నిర్మించలేదు. అదృష్టవశాత్తూ ట్రూప్‌లో అందరూ క్షేమంగానే మిగిలారు. సామానూ ఏమీ పోలేదు.

మళ్లీ మరో ప్రతిపాదన తెచ్చాడు మానేజరు. "ఇక్కడికి ఇరవై కిలో మీటర్లలో ఓ పల్లెటూరుంది. ఇప్పుడక్కడ ఎలాగూ స్టేజి రెడీగా ఉంది. మనం వెళ్తే సరాసరి ప్రోగ్రామిచ్చేడమే. ఇప్పుడింకా పదకొండున్నరే కాలేదు. వెళ్లేది పల్లెటూరు కనుక అన్నీ బాగుంటాయి. ఆతిథ్యమూ, మర్యాదలూ.. మనకి ముట్టే పారితోషికమూ" అంటూ ఊరించేడు. అక్కడ అందరికీ డబ్బవసరమే. అంచేత పదంటే పదండన్నారు. రెండు ఆటోలద్దెకి తీసుకుని బయలుదేరారు. ఆ పల్లెటూరు చేరేటప్పటికి పన్నెండున్నర అర్ధరాత్రి మద్దెలదరువన్నట్లు అప్పుడు రికార్డింగ్ డాన్స్. నిజంగా ఆర్టిస్టులు ప్రేక్షకులని పిచ్చెక్కించేశారు. పోలీసుల బెడదలేకపోడంతో డాన్సర్లు విజృంభించేసి ఒంటిమీద గుడ్డలని పీకిపారేశారు. ప్రేక్షకులందించే కల్లు సారా తాగేశారు. కుప్పిగంతులూ దిగంబర నాట్యాలూ చేశారు. మూడున్నరవుతుంటే ముగింపు చెప్పేరు. డబ్బు బాగానే ముట్టింది. తాగిన వాళ్లకి తాగినంతా, తిన్నవాళ్లకి తిన్నంతా.

"ఆటోలుండకుండా వెళ్లిపోయాయి. రెండు కిలోమీటర్లు నడిస్తే లారీలూ అవీ దొరికే రోడ్డు తగులుతుంది. వెన్నెల. నడిచి పోదాం ఏమంటారు? "

కొందరటన్నారు, కొందరిటులాగారు. ఉండిపోయినవాళ్లల్లో ఉంది తను. లీల ఉందని తనూ ఉంది. ముగ్గురు లేడీ ఆర్టిస్టులూ ఓ మగగాయకుడూ బయలుదేరారు రాత్రి రెండున్నర కిలోమీటర్లు నడవడానికి. గ్రామస్తులు తమకి పడుకుందుకు సురక్షితమైన జాగా చూపారు. మనసులో ఆందోళన.. కొత్తచోటు... తెగ అలసి ఉండడం నిద్రరావడంలేదు.

"మరోలా అనుకోకు. ఇలాటప్పుడు మందు కొడితేకాని మనసూ ఒళ్లూ వశంలోకి రావు" అంటూ సీసా తెరిచింది లీల. ఎక్కడ దాచిందోమరి. అది తాగుతూ తాగుతూ వాగడం దాని అలవాటు. "నువ్వు కొత్త దానివికదూ. ఈ వృత్తి గురించి చెబుతాను. నీకు పనికొచ్చే విషయాలు. వినగలవా? " అడిగింది.

తను అలాగే అన్నట్లు తలూపింది.

"మనని ఆర్టిస్టు అంటారు. కాని మనం నిజంగా అంత గౌరవమయిన పదానికి తగము. మనది కళ అనడమూ స్థాయిని పెంచడమే. మన బతుకులు ఊసరవెల్లి బతుకుల కంటే కనాకష్టం"

"ఎందుకనీ? "

"మనం ఈ వృత్తి చేసేది ఉదరపోషణ కోసం. కాని ఈ దేశంలో కేవలమూ రికార్డింగ్ డాన్సరుగా బతకడం అసాధ్యం. మేస్త్రీ దయాధర్మాలమీద మన బుకింగులు ఆధారపడి ఉంటాయి. ఒంట్లో అందమూ ఆరోగ్యమూ ఓపికా ఉంటేనే స్టేజీమీద చైతక్కులాడగలం. మన ప్రోగ్రాములు సీజనుమీద ఆధారపడుంటాయి. పండగలప్పుడూ, గణపతి నవరాత్రులూ, శ్రీరామనవమప్పుడూ తగుల్తాయి. వర్షాకాలంలో దాదాపు ఉండవు"

ఓ గుక్క తాగి మళ్లీ మొదలుపెట్టింది.



"జనాలు రికార్డింగ్ డాన్సు చూడ్డానికొచ్చేది లేడీ ఆర్టిస్టులని వీలయినంత నగ్నంగా చూడాలనే తప్ప డాన్సు చూడ్డానికి కాదు. సినిమాలకు సెన్సారుంది కానీ వీటికి లేదు. ఏమిటలా చూస్తావ్? నేనింగ్లీషు మాట్లాడుతున్నాననా? నేను కొంచెం చదువుకున్న దాన్నేలే. పూజాపునస్కారాల్లేక బూజుపట్టున్నానుకానీ నైవేద్యం పెట్టు నా మహిమ చూపిస్తానన్నాట్ట వెనకటికో పాడుబడ్డ కోవెల్లోని దేముడు. మన పరిస్థితీ అంతే. అవకాశాలు లేక మట్టిలో మాణిక్యంలా మిగిలిపోయాం. ఆc ఊసరవెల్లనికదూ అన్నాను. ఎందుకంటే రికార్డింగ్ డాన్సరుగా మనం సంపాదించేది ఏడాదికి మూణ్ణెల్లు కూడా బతకడానికి చాలదు. అంచేత మనం సమయానుకూలంగా వేషాలు మారుస్తాం. నాటకంలో నటీమణిగా, హరికథకురాలిగా... అలాగ. అప్పటికీ అన్ని రోజులూ గడవవు. మొగుడనేవాడుండి పోషిస్తే అదృష్టవంతులమే. లేకపోతే మాత్రం వేశ్యావతారం ఎత్తక తప్పదు. పగలు పొట్టనిండాలంటే రాత్రి పడుపువృత్తి చేసితీరాల్సిందే. రికార్డింగ్ డాన్సుల సంపాదనమీద ఆధారపడకుండా బతకగలిగితే వేరు. సినిమా ఆర్టిస్టుల్లా సంపాదన వుండదుకాని ఇక్కడ కూడా ఇబ్బందులకి లోటుండదు. చవక రకం రంగులు పూసుకోటంతో చర్మరోగాలు, ఫ్లడ్‌లైట్లు, రంగుల లాంతరూవల్ల కళ్ళకి శ్రమ. అవికాక ఫిగర్ మెయిన్టినెన్స్. ఒళ్ళు పెరక్కూడదు. పెరిగితే గెంతులెయ్యడానికి పనికిరాదు. దిబ్బ... బొండాం అంటూ ప్రేక్షకులు ఛీ కొడతారు. సినిమాల్లోలా ఆర్టిస్టు శరీరక లోపాలని కొంత మేరక యినా కప్పేందుకు కెమేరా ఉండదు. అంచేత కడుపు రాకుండా జాగ్రత్తలు తప్పనిసరి. ఒళ్లొచ్చినా, వడిలినా ఇంటికి పోవలసిందే. వెధవముండకేనా వేవిళ్ళ తప్పదని రికార్డింగ్ డాన్సరయినా సౌందర్య రక్షణా ఆరోగ్యపోషణా పాటించాలి. ఈ వృత్తికి గ్లామర్ అవసరమే" ఆగింది గుక్క తీసుకుందుకు.

"రికార్డింగ్ డాన్సరయ్యీ వేశ్యకాకుండా ఉండగలిగేవారు.." ఉంటారా అన్నట్లు చూసింది.

"అది వేశ్యకి నువ్విచ్చే నిర్వచనంమీద ఆధారపడుంటుంది. తన ట్రూప్‌లో చేర్చుకుందుకు మానేజరు లేదా మేస్త్రీ ఆమెని లంచంగా మంచం అడుగుతాడు. దొరజాం కాయలా ఉంటుంది కనుక, ఇక మనవి లైవ్ ప్రొగ్రాములు కనుక ఆర్టిస్టుని చూసి క్షణికావేశం చెందిన ధనవంతుడైన ప్రేక్షకుడు ఆమె మీద వ్యామోహపడి డబ్బుతో లొంగదీసుకోవచ్చు ఒక్కొక్క పొగరుబోతూ, మదమెక్కినవాడూ పశుబలంతో ఆమె ఇష్టానికతీతంగా ఆమెని చెరచవచ్చు పల్లెటూళ్లో ప్రొగ్రామ్‌చేస్తే ఆ వూరి పెద్దో, మోతుబరో అడిగితే కాదని ఇవతలకి రాగలగడం కష్టం. స్థానబలిమికదా వాళ్లది? అలాటి వాళ్లతో పడక చెయ్యమని మన మానేజరే ఒత్తిడి తెస్తాడు. తెరమీద బొమ్మలం కాక నిజమైన సజీవమయిన మనుషులం కావడంవల్ల ఈ బాధలు. అందులోనూ మనమేం ప్రేక్షకులని తక్కువ రెచ్చగొట్టి ఒదలంగదా!" లీల సిగరెట్ అంటించి మరీ గుక్క తాగింది.

"మనం ఇక్కడికి రావడం ఒక్క ఆటోలో ఏడుమందిమి కూరుకుని.. అలాగే ఉంటుందా ఎప్పుడూ?"

"ఎప్పుడూ అలా ఉండదుగానీ అలవాటుగా ఒక్కో ఆటోలో కనీసం ఎనమండుగుర్నైనా ఎక్కిస్తారు. మానేజర్లు మహా పొదుపరులీ విషయంలో. మనకి గౌరవం ఎందుకుండదో తెలుసా? ఒక డాన్సర్‌కీ రికార్డింగ్ డాన్సర్‌కీ మధ్య బాబాకీ గారడీ వాడికీ మధ్య ఉండేంత విలువల వ్యత్యాసం ఎందుకో తెలుసా?"

"ఎందుకు?"




"మనది శాస్త్రీయమయిన నృత్యం కాదు. ఒట్టి గంతులు. పిచ్చి గంతులు. పద్ధతీ పాడూ ఉండవు. ఎంతగా ఒళ్లు చూపించ గలం. ఎంతలా బూతు భంగిమలు ప్రద ర్శించగలం. ఎంతగా కవ్వించగలం. ఇలా టివే మన ధ్యేయాలు. బూతు పాటలకి వేసే బూతు గంతులకి విలువ ఎక్కడినుం చొస్తుంది? "

"ని... జమే... మరి పల్లెల్లో ప్రొగ్రామ్‌లు సుఖమా, టౌనుల్లోనా? "

"దేని కష్టం దానిది. పల్లెటూరికి రాకపో కలు సమస్య. కొన్ని వూళ్లకి కాలినడకన కూడా వెళ్లవలసి ఉంటుంది. కాని అక్కడ అతిథ్యం బాగుంటుంది. పట్నాల్లో గుడ్డలిప్ప కపోతే ప్రేక్షకులు తంతామంటారు. విప్ప బోతే పోలీసులు తంతామంటారు. పల్లెల్లో అయితే ఆ డ్యూటీ మోతుబరులో, పొగరు మోతులో, కామాంధులయిన కామందులో తీసుకుంటారు. మన బతుకులన్నా ప్రాణా లన్నా తేలికగా కనిపిస్తాయి కనకనే కూలి పోయే స్టేజిలూ, షార్ట్‌సర్క్యూట్ జరిగే వైరింగులూ"

"ఈ పరిస్థితులకెప్పటికీ మోక్షంలేదా? దీనికి పరిష్కారమేమిటి? " నీరసంగా అడి గింది.

"సమాజమూ ప్రభుత్వమూ ఇప్పటికేనా కళ్లు తెరిచి సత్యమూ, వాస్తవమూ, సాధ్యమూ గుర్తించాలి"

"ఏమిటది? " ఆమెకు లీల మాటలు వింతగా అనిపిస్తున్నాయి.

"ఈ దేశం భాగ్యవంతమయినదేమోకాని దేశంలోని చాలామంది బీదవారే. నిష్క ర్షగా చెప్పాలంటే నిర్భాగ్యులూ దరిద్రగొట్టు దామోదరులూ, వీళ్లందరికీ ప్రధాన సమస్య ఆకలీ, బతుకూ. ఎంగిలి మెతుకులాకలి తీర్చవు. చింకి గుడ్డలు మానం కాపాడవు. అయినా అలాగే బతుకుతున్నారు మనలాటి ఎందరో. నిజానికి మనని చావనివ్వకా బత కనివ్వకా మధ్యలో నలిపేస్తున్నది పెద్దలూ ప్రభుత్వాలే"

"ఎలా? " అడిగింది చిత్ర.

"వ్యభిచారాన్నతి ప్రాచీన వృత్తంటారు. ఈ దేశంనుంచి దాని నెలాగూ నిర్మూలించ లేదు ఏ సమాజంకానీ ప్రభుత్వంకానీ. ఈ వృత్తిలోనివారికి పునరావాసమూ కల్పించ లేరు. వ్యభిచారాన్నీ రికార్డింగ్ డాన్స్‌నీ వృత్తిలా తీసుకుంటున్నారు చాలామందే. వాళ్లమానాన వాళ్లని బతకనిస్తే అదే పది వేలు. పోలీసుల పరిధినుంచి రికార్డింగ్ డాన్స్‌ని తప్పించెయ్యాలి. అంత మాత్రాన కొత్తగా మునిగిపోయే కొంపేమీలేదు"

"ఆ" ఆశ్చర్యంగా చూసింది.

"రికార్డింగ్ డాన్స్ అనేది సినీ నాట్యానిక నుకరణే అయినా పచ్చి బూతు ప్రదర్శించే స్తున్నారనే కదా గొడవ. నడుముకింద గుడ్డ యినా లేని శిల్పాలెన్నిలేవు? చిత్రాలెన్ని లేవు? గొప్పకళాత్మక చిత్రాలనబడే చాలా వాటిలో స్త్రీ ఒంటిమీద నూలుపోగుండదు కద? అవన్నీ నగ్న చిత్రాలేకద? అంత కంటే దారుణం ఖజురహో, కోణార్క శిల్పాలు ఏకంగా కామశాస్త్ర భంగిమలే కదా? వాటిన్నిటినీ కళంటారు! పామరులు కళనీ బూతునీ శృంగారాన్నీ విభజించి చూడగలిగే సంస్కారదృష్టి కలిగి ఉంటారా? ఆ శిల్పాలనూ చిత్రాలనూ ఎవ రిని పడితే వారిని చూడనివ్వడంలేదూ? మనం చూపే అర్ధనగ్న శరీరం ఒరిజనల్. శిల్పమూ చిత్రమూ డూప్లికేట్. డూప్లికేటుకి విలువా, గౌరవమూ. ఒరిజినల్‌కి నిందా! విగ్రహంలో కళ, జీవంలో బూతు! ఎందుకీ ద్వంద్వం? మనిషిని సజీవ దిగంబరి రెచ్చ గొట్టినట్లే నిర్జీవ విగ్రహమూ రెచ్చగొట్ట గలదు. అందుచేత అలాటి శిల్పాలనీ చిత్రా లనీ ఆమోదించి సజీవుల నంగీకరించకపో వడంవల్ల సమాజంలో నీతేమీ పెరిగిపోదు. అదీకాక ఈ దేశంలోకి విదేశీ ఛానెల్సొ



బ్లూఫిలిమ్‌లూ, పోర్నో మాగజైన్‌లూ తక్కువ అవినీతిని దిగుమతి చేయడంలేదే"

"నిజమే" అనిపించిందామెకి.

"ఇక ఆర్థిక కోణంలో ఏ దేశం తన ప్రజలకు కడుపునిండా తిండిపెట్టలేదో ఆ దేశంలో ప్రజలు తిండి సంపాదించుకుందుకు ఏ పని చేసినా అది తప్పుకాదు. నేరం నాదికాదు ఆకలిది అనడం వింటూనే ఉన్నాంగా? తిండి కోసమే ఈ డాన్సులూను. దీనిని ఈ రికార్డింగ్ డాన్స్‌ని కళగా గుర్తించి ప్రదర్శనకెదురుగా పోలీసులు కూర్చోటం మానేస్తే కొంతనయం. నిజానికి పోలీసుల కర్తవ్యం మహిళా కళాకారిణులకు అసభ్యకరంగా ప్రవర్తించే ప్రేక్షకులనుంచి భద్రత కల్పించడం. దీనినెప్పుడైతే కళగా గుర్తిస్తారో ఈ కళాకారులకి విలువ కలుగుతుంది. నిర్లక్ష్యపు వేదికలవల్ల సంభవించే మరణాలు తగ్గుతాయి" గ్లాసులో ఇంకేమీ మిగలకుండా గొంతులో పోసుకుంది లీల. సరిగ్గా అదే సమయంలో బయటగోల. ఏమైందా అని ఇద్దరూ తలుపు తీసుకుని పైకొచ్చారు.

"మన రికార్డింగ్ డాన్సర్లని ఎవరో తోవలో అడ్డుకుని దారుణంగా రేప్ చేశారుట"

ఆ మాట వినడమేమిటి, ఇద్దరూ మిగిలిన ట్రూపుతో కలసి అటు పరుగెత్తారు ఆత్రంగానూ ఆందోళనగానూ. అందరూ కలసి అక్కడికి చేరేసరికి ముందు వెళ్లిన ముగ్గురు లేడీ ఆర్టిస్టులూ మూర్ఛపోయినట్లు పడున్నారు. వాళ్లకి ముఖం మీద నీళ్లు జల్లి ప్రాథమిక చికిత్సలు చేస్తూంటే వాళ్లతో వెళ్లినతను చెప్పసాగాడు.

"మేం సరిగ్గా ఇక్కడికొచ్చేసరికి ఎటునుంచొచ్చారో ఏడెనమండుగురు కుర్రాళ్లు కర్రలు, కత్తులు పట్టుకుని వచ్చారు. మమ్మల్నటకాయించేరు. మా దగ్గరున్న డబ్బులు తీసి ఇవ్వబోయాం. వాళ్లు నన్ను దూరంగా తొలగించేసి ముగ్గురాడవాళ్ల మీద పడ్డారు. నేనరవకుండా నోట్లో గుడ్డలు కుక్కారు. లేడీస్‌ని ఈ పొలంలోకి తీసుకొచ్చి పరమ దుర్మార్గంగా గ్యాంగ్‌రేప్ చేశారు. నేనుండి కూడా ఏమీ చెయ్యలేని వాడినయ్యాను" అంటూ ఏడిచేశాడు.

"ఇంకెప్పుడూ ఇలా రాకూడదు. వచ్చినా రాత్రులు వూరుదాటి రాకూడదు"

"ఆ వూరివాళ్లే అయ్యుంటారు"

"అందరూ కుర్రాళ్లే. ఎవరికీ పాతికేళ్లు మించి ఉండవు" చెప్పాడు మేల్ ఆర్టిస్టు.

"రికార్డింగ్ డాన్సర్లకి బొత్తిగా రక్షణ లేకుండా పోతోంది. పోలీసు రిపోర్టివ్వవలసిందే"

ఎవరికి తోచినట్లు వారు చెబుతున్నారు. ఆమె మాత్రం మౌనంగా ఉండిపోయింది. రికార్డింగ్ డాన్సరయినా స్వతంత్రంగా పొట్టపోసుకోడమూ, ఆర్థికంగా ఎవరిమీదా ఆధారపడకుండా బతకడమూ వీలుకానప్పుడింక ఆ పని ఎందుకు చేయాలి? రికార్డింగ్ డాన్సరుగా కూడా వ్యభిచరించడం తప్పనప్పుడు వ్రతం చెడినా ఫలం దక్కనప్పుడు ఇంక అదెందుకు? లీల చెప్పినట్టు వ్యభిచారంలో అయితే అందరిముందూ అంగాంగ ప్రదర్శన వంటి బాధలుండవు. ఇంటిలోనే కనుక భద్రతకు ముప్పుండదు.

ఆ కేసుని పోలీసులకు రిపోర్టుచేశారు. నిందితులు సులభంగానే దొరికారు. నేరస్తులకి శిక్ష విధించబడింది కానీ అది స్వల్పమే. అయితే పట్టణ పరిధిలో రికార్డింగ్ డాన్సులని నిషేధించారు పోలీసుల వారు. అదీ మళ్లీ రికార్డింగ్ డాన్సర్ల పీకమీదకే వచ్చిపడింది. వాళ్ల సంపాదనావకాశాలు పోయాయి. వాళ్ల పొట్టమీద తగిలింది దెబ్బ. దాంతో ఆ వృత్తి కళాకారులందరూ ఊరేగింపుగా అధికారులవద్దకు వెళ్లి తమ సాధక బాధకాలను చెప్పుకుని రికా





ర్డింగ్ డాన్సులని నిషేధిస్తే తమ బతుకులే చితికిపోతాయని మొరపెట్టుకున్నారు. నిరాహారదీక్షలు చేశారు. ఉద్యమం లేవదీశారు.

అప్పుడు కరుణించింది అధికార యంత్రాంగం. ఎన్నో నిబంధనలు విధిస్తూ వాటికి లోబడి మాత్రమే రికార్డింగ్ డాన్సు కార్యక్రమాలు నిర్వహించవచ్చునని అనుమతించారు. మునుపులేని కొత్త నియమాలు కొన్ని వచ్చిపడ్డాయి ఆ డాన్సర్ల పీకల మీదకి. అదంతా చూసేసరికి చిత్ర మనసు మరింత విరిగిపోయింది. వేశ్య కావడం కంటే గత్యంతరం లేదేమో అనుకుంది.

★ ★ ★

ఆ సాయంత్రం ఏమీ తోచక రోడ్డుమీద ఒంటరిగా, మెల్లగా నడుస్తూంటే వెనుక నుంచి "ఇదుగో నిన్నే" అనే పిలుపు వినిపించింది.

అటు తిరిగి చూసింది చిత్ర. ఎవరో మగాడు. పెద్దజుత్తుతో కొంచెం భయం గొల్పుతున్నాడు. రౌడీలా ఉన్నాడు. ఆమెకు భయమేసింది.

అయితే వెంటనే మాణిక్యం చేసిన ఉపదేశం గుర్తుకొచ్చింది. మగవాడికి భయపడకపోడమే అతన్ని జయించే ఆయుధం.

"ఏం? " నిర్లక్ష్యం, నిర్భయమూ నటిస్తూ అడిగింది.

"కొత్తగా వచ్చావా ఈ వీధికి? " మెల్లగానే అడిగాడు.

"ఆ అయితే? " మరింత నిర్లక్ష్యంగా చూసింది.

"ఎవరి దగ్గరుంటున్నావ్? "

"మాణిక్యంతో"

"ఓహో! ఏ వూర్నించొచ్చావ్? బలే అందంగా ఉన్నావ్"

"ఏదో ఒక వూరు నీకెందుకు? "

"పేరూ... ఏదో ఓ పేరేనా? " నవ్వి... "వృత్తిలో చేరెన్నాళ్లయింది? " అడిగాడు.

"వృత్తేమిటి? ఏ వృత్తి? " అమాయకంగా చూసింది.

"గడుసుదానివే. నేను నిన్నెందుకడుగుతున్నానో ఈ ప్రశ్నలు తెలుసా? "

"ఏమో నాకెలా తెలుస్తుందీ? "

"నిన్ను పెళ్లిచేసుకోవాలని" మళ్లీ నవ్వాడతను ఆమెనాపాదమస్తకం చూస్తూ. ఆమాటకామె ఒళ్లు ఝల్లుమంది. గుండె ఆనందంతో ఒక్కసారి గెంతింది. సిగ్గుమొగ్గలు వేసింది. "ఛీపో" అనేసి రెండు చేతులతోనూ ముఖం కప్పుకుని వెనక్కి తిరిగి ఇంటికి పరుగెత్తింది. అతను వెనుకనుంచి అరిచాడు.

"నా పేరు రామారావ్. గోల్డ్‌మాన్ అంటే తెలుస్తుందందరికీ"

పరుగులోనే చేరిందింటికి. వరండాలోనే ఎదురయింది మాణిక్యం. "ఏమిటలా పరుగెడుతూ వస్తున్నావ్? ఏమైందేం? ఎవరేనా ఏమేనా అన్నారా? "

ఆమె ఇంకా అతన్ని మనోఫలకంమీంచి చెరిపెయ్యలేదు. పెళ్లి చేసుకుంటాననడం వల్ల కాబోలు అతని రూపం మనసులో నిలిచిపోయింది. జుత్తూ అది రౌడీలా ఉన్నా మనిషి బాగానే ఉన్నాడు. అయినా మగాడికి అందమెందుకూ? కట్టుకున్న దాన్ని పోషించే సత్తా ఉండాలికాని.

"గోల్డ్‌మాన్‌ట... రామారావ్. రోడ్డుమీద కనిపించి..."

"కనిపించి? ..." ఏమిటన్నాడన్నట్లు చూసింది మాణిక్యం.

పెళ్లిచేసుకుంటానన్నాడని తన నోటితో చెప్పడానికి చిత్రకి సిగ్గేసింది.

"నన్ను పెళ్లి చేసుకుంటానన్నాడు" అంది.



ఎంతో సిగ్గుపడిపోయింది.

"ఆ!... అప్పుడే వాడి కన్ను నీమీద పడిందీ" తిడుతున్నట్లే అంది మాణిక్యం.

"ఏమీ? " హతాశురాలయినట్లు చూసింది.

"వాడెవడో, ఏమిటో, ఎలాటివాడో నీకు తెలియక- వాడు పెళ్లి చేసుకుంటాననగానే సంబరపడి పోతున్నట్లున్నావమాయకంగా. చూడు చిత్రమ్మా! ఈ వీధిలో రామారావు లాటివాళ్లు చాలామందున్నారు. వాళ్ల గురించి నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి సుమీ" హెచ్చరించింది.

ఆమె తన ఆశలమీద నీళ్లు జల్లుతున్నట్ల నిపించి- సందేహాస్పదంగా చూసింది చిత్ర ఆమెవేపు. చెప్పడమే మంచిదన్నట్లు చెప్ప సాగింది మాణిక్యం. "ఈ వీధిలో రామారా వ్‌లాటివాళ్లు చాలా ఇళ్లలో చాలామంది న్నారు. వీళ్లకి చదువూ సంధ్యా లేవు. ఏ పనీ చేయరు. కూర్చుని తినడం మరిగారు. ఆడవాళ్లు పడుపువృత్తి చేసి తెస్తే వీళ్లు వాళ్ల కష్టాన్ని తింటారు సిగ్గూ, లజ్జా, పౌరు షమూ లేకుండా. మగ జన్మెత్తీ అలా ఆడ దాని సంపాదనమీదపడి తినడానికి మన సెలా వొప్పుతుందో? ఇలాటివాళ్లు పెళ్లికెం దుకెగబడతారో తెలుసా? "

"ఎందుకూ? "

"పెళ్లాన్ని పోషించలేని ఈ చవటలు- పెళ్లి చేసుకునేది పెళ్లాన్ని తార్చి సంపాదిం చడానికే. పెళ్లాం సంపాదనయితే దానంత టిమీద తనదే పూర్తి హక్కు కదా? అందు కని ఈ సంపాదించలేని చవటలు, మొల తాడు లేని మగాళ్లు పెళ్లి చేసుకుందామను కుంటారు"

"అంటే- పెళ్లయినా వ్యభిచారం చేసుకునే బతకాలా ఆ ఆడది? "

"బతకాలనుకుంటే అంతే. తను బతు కుతూ మొగుణ్ణి కూడా పోషించాలి. పిల్లలు పుడితే వాళ్ళనీ తన కష్టంమీదే పోషించాలి చిత్రమ్మా! బాగా ఆలోచించుకో. ఇలాటి చవ టతో పెళ్లి సంబరంకాదు, లంపటం. వృత్తి చెయ్యక తప్పదు. అయినా నీ సంపాదన మీద నీకు హక్కుండదు. నీ బతుకుమీద నీకు స్వేచ్ఛ ఉండదు. నువ్వు అందంగా ఉన్నావు కనుక మరింతగా సంపాదించగల వనీ, నీ కష్టాన్ని మరింత దోచుకుంటూ తాను జల్సా చెయ్యొచ్చనీ వాడి ఆశ. వాడు నీ మెడలో కట్టేది పసుపుతాడు కాదు, పలు పుతాడే. అలాటి పెళ్ళి ఒట్టి రొంపే. ఆడదా నికి ఏమాత్రమూ సుఖముండదు. వృత్తిలో పగలయినా హాయీ, స్వేచ్ఛా స్వతంత్రమూ ఉంటాయి. నీ సంపాదన నీదే అవుతుంది. పెళ్లి చేసుకుని వ్యభిచారంమీద బతికే ఆడ దానికి సుఖమన్నది శూన్యం. మొగుడి చేతుల్లో డబ్బు పోసేసి వాడిచేత తన్నులు తినాలి. అడ్డెడు బియ్యమూ సమర్పించుకుని అమ్మా నీ ప్రసాదమని ఆధారపడ్డట్లే. కష్టం నీదీ కాసులు వాడివీ. వాడు తాగొచ్చి తంతూంటాడు. అందుకు వాడిని నువ్వు పోషించాలి"

"నిజంగానా...? "

"చూడు చిత్రమ్మా! మనసు కష్టపెట్టుకో నంటే చెబుతాను. నీకు తల్లిదండ్రులున్నా లేనట్లే లెక్క. అంటే అటూ ఇటూ ఎవరూ లేని వొంటిపేగుకింద జమ. ఆస్తిపా స్తులా... శూన్యం. చదువా? వానాకాలం చదువు. ఉన్నదల్లా అందమూ, వయసూ, మంచితనమూ మాత్రమే. వీటికి మంచి సంబంధాలు రావు. మగాడికి ఆడదక్క ర్లేదు. పెళ్లనేసరికి- ఆడదాని వంశం, కుటుంబ ప్రతిష్ట, కట్నం... అవి కావాలి. అవి నీకు లేవు. అంచేత పెళ్లి గురించి ఆశ పడితే అత్యాశే అవుతుంది"

చిత్ర కళ్లనుంచి నీళ్లు రాలాయి. మాణిక్యం ఆమెను దగ్గరగా తీసుకుని కళ్లు తుడిచి "ఏడవకమ్మా నీకు నిజం తెలియా లనే తప్ప నీ మనసు నొప్పించాలని కాదమ్మా" చెప్పింది.





"అందుకు కాదమ్మా. ఏమిటో దిగులే సింది. నేనెంత దురదృష్టవంతురాలినో చూడు. అమ్మా నాన్నలకు బరువయ్యాను. నన్ను ఇంట్లోంచి తగిలేశారనే అనుకోవాలి"

"దురదృష్టం నీది కాదమ్మా. నిజానికి వాళ్లే దురదృష్టవంతులు. తల్లిదండ్రుల య్యుండీ పిల్లలు లేకపోవడం తక్కువ దౌర్భాగ్యం కాదు తల్లీ. చిత్రమ్మా! నీకు మళ్లీ చెబుతున్నాను. నేను నీకు అమ్మని. నువ్వు నాకు అమ్మాయివి. మనం అలా భావించు కుంటే- నాకు పిల్లలు లేని లోటూ నీకు తల్లి దండ్రులు లేని లోటూ కొంతయినా తీరు తుంది. చూడూ, బతుకంటేనే సర్దుబాటు. ఉన్నదానితో సర్దుకుని సంతోషపడడం"

ఆమె మాటలలోని నిజాయితీకీ, అభిమా నానికీ, వాత్సల్యానికీ కరిగిపోయి- "అమ్మా" అంటూ మాణిక్యాన్ని పట్టుకుని ఏడ్చేసి గుండెబరువు తగ్గించుకుంది. అప్పుడు ప్రశాంతంగా ఆలోచించుకుంది జీవితం గురించి. ఎంత ఆలోచించినా తన పరిస్థి తిలో వేశ్య కావడం కంటె మరో మార్గమూ బతుకుతెరువూ కనిపించలేదు.

"నేను వృత్తి చేయడంకంటె మరో తోవ లేదా? " దీనంగా అడిగింది.

"ఈ పరిస్థితుల్లో నాకింకేమీ తోచలేదు. ఎందుకమ్మా వృత్తంటే అంత భయపడ తావ్? అసహ్యించుకుంటావ్? స్వధర్మమే గొప్పదని గీతలో చెప్పలేదూ? వృత్తిలో కూడా మానవసేవ చెయ్యెచ్చు. ఆర్తితో వొచ్చిన మగవాడి తాపం తీర్చి ఆనందం కలిగించడమేకదా వేశ్య చేసేది? కామమూ ఒక విధమయిన శారీరక బాధే. ఆ బాధని నివృత్తి చేయడమూ సేవా వైద్యమే. డబ్బు తీసుకోడమంటావా, నొప్పి పోగొట్టేందుకు డాక్టర్ తీసుకోడూ? ఒకటి గుర్తుంచుకో అమ్మా. తీసుకున్న డబ్బుకి సేవ చేయడం కూడా ఘనకార్యమే.

నిజానికి వంచన అతిస్వల్పంగా ఉండే వ్యాపారం వ్యభిచారమే. నువ్వేమీ భయప డక్కర్లేదు. నాలుగురోజుల్లో నీకే తెలు స్తుందంతా. అలవాటయిపోతుంది"

"సరే అమ్మా"

"అయితే మంచి మూహూర్తం పెట్టిం చేదా? "

"నీ ఇష్టం"

"నిశ్చింతగా ఉండమ్మా. నీ పక్కనుండేది నేను" అని ఆమెను ఒంటరిగా వదిలి వెళ్ళింది మాణిక్యం. నీ ఇష్టం అనక ఏంచే సేది? నాకయిష్టం అనేందుకు తనకేం భరోసా మిగిలి ఉందని? ఇప్పటికే ఎన్నో రోజులనుంచి మాణిక్యంమీద పడి తింటూంది తను. ఏమైనా సంపాదించి ఇచ్చినా అది తన కోసం మాణిక్యం చేస్తూ వస్తున్న ఖర్చు ముందు అతిస్వల్పం. చుట్టమై చూడొచ్చి దెయ్యమై పట్టుకుంద న్నట్లు తయారయింది తను ఆమె పీకలమీ దకి. వృద్ధురాలయిన ఆమెని తాను పోషిం చడానికి బదులు ఆమెకి భారంగా మిగ లడం తనకి బాధగానూ ఉంది, సిగ్గుగానూ ఉంది. ఎన్నాళ్లిలా? ఒకరిమీద ఆధారపడి బతకడం ఎంత హీనం! అందులోనూ పెద్దా విడమీద! అలా పరాన్నజీవిగా బతకడం కంటె ఏం చేసినా నయమే. ఆఖరికి- వ్యభి చరించినా. అయినా తనిన్నాళ్లూ సవ్యంగా ఆలోచించలేకపోయింది కాని... మూడు మృగాలచేత మానభంగం చేయబడి శీలం కోల్పోయిన ఈ పతితకు ఇంకా వివాహార్హతె క్కడ మిగిలుంది? చూస్తూ చూస్తూ చెడిన దాన్నెవడు కట్టుకుంటాడు. ఎవడేనా కట్టు కుందుకు సిద్ధపడినా ఏ తలమాసినవాడో తప్ప సవ్యమైన పురుషుడెవడు ముందుకొ స్తాడు? అంచేత తనకి వ్యభిచారం కంటె గతిలేదు కాక గతిలేదు. సగం పొట్టా నింపని, సగం బట్టా ఇవ్వని ఉద్యోగాల కంటే పడుపువృత్తే నయమేమో మాణిక్యం

చెప్పినట్లు బతికిన ఆరునెలలయినా హంసలా బతకొచ్చు.

ఎంత గుండెదిటవు చేసుకున్నా ఆమెకు కన్నీరాగడంలేదు. ఇష్టంలేని వృత్తి చేయవలసివొస్తున్నందుకు. సరిగ్గా అప్పుడక్కడికి వొచ్చింది మాణిక్యం. ఏడుస్తున్న ఆమెని చూసింది.

"దుఃఖమెందుకమ్మా" అంటూ ఆమె కన్నులు తుడిచింది. తల నిమిరింది. దగ్గరకి తీసుకుంది. ఆ ఓదార్పుకి కరిగిపోయింది లలిత. "నేనెవరినని నేనంటే నీకింత ప్రేమ? "

"ఎవరివేమిటి? నా కూతురివమ్మా. చూడు... సమయమూ సందర్భమూ చూసి నా కథ చెబుతానన్నానప్పుడు. చెప్పేదా ఇప్పుడు? వినగలవా? "

"చెప్పు" అంది మరేమనాలో తెలియక.

"తాగలేని పిల్లి ఒలకబోసుకుందనే సామెతకి సరిగ్గా సరిపోయే కథ నా బతుకు. సామెతలంటే జీవితానుభవసారమే కదా. నేను పుట్టడం- భోగం కుటుంబంలోనే. కళావంతులంటారు వారినే. కళావంతులకీ పడుపు వృత్తి చేసుకునేవారికీ తేడా ఉంటుంది. కళావంతులం కనక నాక్కొంచెం చదువూ సంధ్యా చెప్పించారు మావాళ్లు. సంగీతమూ, నాట్యమూ ఆనవాయితీగా చెప్పించారు. నేను అప్పుడు చాలా అందంగా ఉండేదాన్ని. నమ్ముతావా? "

"ఎందుకు నమ్మనూ? ఇప్పటికీ ఆ అందపుఛాయలు మిగిలే ఉన్నాయిగా నీలో? "

"పదిహేనో ఏటికే గజ్జల గుర్రంలా ఉండేదాన్ని. ఆటపాటలలో ఆరితేరాను. మాట చమత్కారం మా కళావంతులింట వెన్నతో పెట్టిన విద్య. శృంగారం- చీరతో పెట్టిన విన్నె. పడకలో రంభని. అందుకే నేనంటే మగాళ్లు పడిచచ్చేవాళ్లు. పదిహేనోయేట కన్నెరికం చేయడమేమిటి, మరి నాకు తిరుగులేకపోయింది. పగలూ రాత్రీ సందడే సందడి. బంగారం... రొక్కం... పట్టుచీరలు, మేడ. నా ఇంట లక్ష్మీదేవి ఘల్లు ఘల్లుమంటూ నాట్యం చేసేది. విపరీతంగా సంపాదించేదాన్ని"

"శ్రమగానూ అలుపుగానూ అనిపించేది కాదూ? "

"నాకు సంరక్షకురాలిగా ఉండే పిన్నమ్మ ఒకటే చెప్పేది- నేను బద్ధకించబోతే. చూడు మణీ! వ్యభిచారం కూడా ప్లీడరీ, వైద్యమూ లాటి వృత్తే. లాయరుకికానీ డాక్టరుకికానీ ఒక దశ ఉంటుంది. ఆ పదేళ్లూ కనకవర్షం కురుస్తుంది. పట్టిందల్లా బంగారమవుతుంది. అప్పటి ఆర్జనే ఆర్జన. అలాగ ఎప్పుడూ ఉంటుందనుకుంటే తప్పే. వేశ్యకీ అలాగే ఓ దశ ఉంటుంది. అయితే అదామె యౌవనంలోనే. ఏం సంపాదించుకున్నా అప్పుడే. ఆ తరవాత బిగి సడలిపోయాక, బిగి మాసిపోయాక, యౌవనం మళ్ళిపోయాక నువ్వు హారతిపళ్లెం పట్టుకునెదురు వెళ్ళినా విటుడు రాడు. కనక ఇప్పుడు బద్ధకించకు అని పొడిచేది. కళావర్ రింగుకీ చిట్టి చిలకమ్మకీ వొచ్చినంత డబ్బూ పేరూ రావాలి నీకు అని ఎగసన తోసేది. అంచేత నాకు విధీ విరామమూ దొరికేవి కావు. ఆ శ్రమనుంచి విసుగునుంచి తప్పించుకుందు కని విటులకి తోడుగానూ తాగడం మొదలు పెట్టాను"

"అప్పుడు ఆడవాళ్లు కూడా తాగేవారా? "

"ఆడదానికీ నోరూ కడుపూ గుండే మనసూ అప్పుడూ ఉండేవి. ఆత్మనాశనం చేసుకుందుకు ఆడేమిటి, మగేమిటి? యౌవనమూ సౌందర్యమూ ఉండగానే సంపద కూడ వేసుకోవాలనే పిన్నమ్మ నా సంరక్షకురాలు హఠాత్తుగా చనిపోయింది. ఇక ఈ గుర్రానికి కళ్లెం లేకపోయింది. తాగుడు లేకపోతే ఉండలేని స్థితికి దిగజారిపోయాను. ఈ తాగుడు ఎన్నివిధాల నాశనం చేసిందని





నన్ను. నా ఒళ్లు గుల్లచేసింది. నా ఇల్లు డొల్ల చేసింది. మొదట నా ఆరోగ్యాన్నీ, అందాన్నీ, డబ్బునీ తినేసింది. నా అందమూ ఆరోగ్యమూ చెడిపోవడంతో విటులు రావడం మానేశారు. ఆదాయం తగ్గిపోతూ తాగుడు ఖర్చు ఎక్కువవుతుంటే ఏమౌతుంది? సర్వనాశనమే అయింది. అంతవరకూ సంపాదించింది. అప్పులవాళ్ల పాలయింది"

"తాగుడు అంత ఖరీదా? "

"తాగుడు కొంచెమే ఖరీదు. ఒళ్లు తెలియని మత్తులో మనం పెట్టే సంతకమో, వేలిముద్రో ఉంటుందే. అదే అసలు ఖరీదయింది. పూర్తిగా మునిగిపోయాక కానీ తెలియలేదు. వృత్తికి పనికిరానంతగా చెడిపోయాను. బతుకు రోడ్డుమీద పడింది. చిప్ప చేతికొచ్చింది. ఇల్లు కాలిపోయాక బొగ్గులేరుకున్నట్లు. అప్పులాళ్లకి పోగా మిగిలిన కొంచెమూ జాగ్రత్త చేసుకున్నాను. తాగుడు మానేశాను. వేశ్యమాతగా అమ్మాయిలని తార్పుతూ బతకసాగాను. యౌవనసౌందర్యాలుండగానే ఇల్లు చక్కబెట్టుకోకపోవడం ఒక దురదృష్టం. అంతకంటె పెద్ద దురదృష్టం..." కళ్లు తుడుచుకుంది మాణిక్యం.

"ఏమిటి? "

"సంతానం లేకపోవడం.. నిజానికి సంతానమే మనుషులకుండే పెద్ద ఆస్తి"

"కాని నలుగురూ నడిచేదారిలో గడ్డి మొలవదనీ, వేశ్యలకి పిల్లలు కలగరని"

"తెలియనివాళ్లనుకునేమాట. వృత్తికాటంకమౌతుందని రెండుసార్లు గర్భం తీయించుకున్నాను. అదే నేను చేసిన పెద్ద పొరపాటు. నాకే కాని ఒక్క ఆడపిల్లయినా ఉండుంటే నా బతుకు వేరుగా ఉండేది" కళ్లు ఒత్తుకుందామె. "నా కర్మిలా కాలేది కాదు. ఆడపిల్లయితే సంపాదించి పెడుతుందికదా అనే కాదు. తల్లినయినా తండ్రినయినా నిజంగా ప్రేమించేది ఆడపిల్లే. కడాకూ ప్రేమించేది కూతురే. ఆడపిల్లకుండే అభిమానం మగపిల్లడికుండదు"

"అమ్మా!"

"తల్లీ! నేనిన్నాళ్లూ కుంచమంత కూతురుంటే మంచం దిగక్కర్లేదనీ, కూర్చున్నచోటుకి కూడా నిలుచున్నచోటకి నీళ్లూ అనీ అనుకునేదాన్ని. అంతకిమించి నువ్వు నాతో ఉండడంవల్ల ప్రాణానికేమిటో హాయిగా ఉంది"

"నాకూ అంతేకదా"

"అందుకే మనమిద్దరమూ ఎప్పటికీ కలిసే ఉందాం- నేను పోయేవరకు"

"అలాగే"

"కాని... నువ్వు బీద బతుకు బతుకుతూంటే ఎలా చూడగలను? ఆడపిల్లవయ్యుండీ నీకేం కర్మ చాలీచాలని బతుకు బతకడానికి? "

"అదేమిటలా అంటావ్? ఆడజన్మ వద్దని అందరూ అనుకుంటూంటే"

"ఆడపిల్లలని వయసులో ఉన్నా, వయసు రాబోతున్నా, ఎత్తుకుపోయే ముఠాలుంటున్నాయి. నగరాలకీ విదేశాలకీ తరలించేస్తున్నారు. ఆడదానికింత గిరాకీ ఉంది మరి. అందమూ వయసూ ఉన్న ఆడపిల్ల తలచుకోవాలే కాని మగాడిని ఎటువంటి మగాడినయినా తన చుట్టూ తిప్పించుకోలేదూ? చదువుకున్నదానివేగా. చరిత్రలో ఆడదానికోసం యుద్ధాలు జరిగాయని చదువుకోలేదూ? ఆడదానికోసం రక్తపుటేరులు పారలేదూ? "

"నిజమే. కాని" ఏదో అడగబోయీ ఆగిపోయింది.

"అసలు.. ఆడదాన్ని సృష్టించింది మగాడు తోడులేకుండా బతకలేకపోవడంవల్లనేకదా? మగాడిమీద జాలిపడి అతని అవసరాలు తీర్చే తోడునిద్దామనేకదా?

మగాడికి తోడు లేకపోతే పిచ్చెక్కిపోతాడు. పురాణాలలో దేవవేశ్యలు, దేముళ్లకి దేవదాసీలూ, రాజులకు ఆస్థాన నర్తకులూ, సామాన్యులకి వేశ్యలు. అందుకే దీనిని ప్రాచీన వృత్తని అంటారు"

"అమ్మా! నువ్వెంతవరకూ చదువుకున్నావ్? "

"పుస్తకాల చదువుకంటె శ్రుత విద్య ఎక్కువ. జీవితాలనుంచి తెలుసుకున్నదే ఎక్కువ. మా కాలంలో వేశ్యకెన్ని తెలిసుండాలని! తన శరీరం గురించి, మగవాడి శరీరం గురించీ, అతన్ని సుఖపెట్టగలిగే విధానాల గురించి తెలియాలి. అతని మనసుకి స్వాంతన కలిగించేందుకు సహనమూ, మాటనేర్పు ఉండాలి. అతనెంత వికలమయిన మనసుతో వచ్చినా ఓర్పుతో అతని కష్టసుఖాలూ సమస్యలూ తెలుసుకుని తగు మాటలు చెప్పి, స్వస్థతపరచి ఉత్సాహవంతుణ్ణి చెయ్యాలి. ఇప్పుడంటే రోజులు మారిపోయి యధా విటాః తధా వేశ్యాః అన్నట్టు దిగజారిపోయారుగానీ పూర్వం వ్యభిచారమంటే కళ. శృంగార కళే"

త్రుళ్లిపడింది లలిత. "వ్యభిచారం తప్పు కాదూ? నిజంగా దానిమీద బతకడం సాధ్యమేనా? "

"వ్యభిచారం తప్పో ఒప్పో చెప్పే తాహతు నాకు లేదు. నేను మామూలు మనిషిని. ఆడదాన్ని. నేను చెప్పగలిగేదొక్కటే. మనిషిగా పుట్టాక బతక్కపోతే మాత్రం తప్పు. బతకలేకపోతే మాత్రం తప్పు. బతకడానికేం చేసినా ఒప్పే. భగవంతుడు పుట్టించింది బతకమని. బలవంతంగా చావడమంటే దేముడి ఆజ్ఞను ధిక్కరించడమే. ఇక వ్యభిచారం సంగతి. మగాడి అవసరం అది. ఆడదాని కనవసరం. కాని మగాడొక్కడే వ్యభిచరించలేడు కనుక అతను ఆడదాన్ని లాగుతాడు. ఆడది తప్పనిసరై అతని పక్కకి వెళ్తుంది"

"ఎందుకెళ్ళాలీ? " అమాయకంగా అడిగింది లలిత.

"ఎందుకెళ్లాలంటే- మొగాడు మొరటువాడూ, బలవంతుడూ ఆడదానికంటె. అంతకంటె ముఖ్యంగా సంపాదించడం అతనికే చేతనైనపని. అంటే అందరాడవాళ్లూ సంపాదించలేరని కాదు. నేను చెప్పేది ఎక్కువమంది సంగతి. చదువూ సంధ్యా లేనివాళ్లు. పనీపాటా చేసుకున్నా వాళ్లు సంపాదించుకోగలిగేది అంతంత మాత్రమేకదా. వాళ్ల సంపాదన వేన్నీళ్లకి చన్నీళ్లు కాగలదే తప్ప అన్ని నీళ్లూ అదే కాలేదుకదా? అంచేత ఆడది తనకాళ్లమీద తను బతకలేదు. ఆధారపడాలి. తనమీద ఆధారపడినవాళ్లంటే ఎవరికేనా లోకువే. అందుచేత మగవాడు ఆడింది ఆటా పాడింది పాటగా చెల్లుతుంది. అతన్ని అదుపులో ఉంచేశక్తి ఆడదానికుండదు. అదీకాక మగాడిది గాలిపటం తత్వం. సీతాకోకచిలకతీరు. ఎప్పటికప్పుడు కొత్తరుచులు కోరుతూంటాడు. పరాయి ఆడది పసందుగా కనిపిస్తుందతని కళ్లకి. ఆడదానిలాకాక మగాడెందరితో తిరిగినా అతని కంటేదీ, తగిలేదీ ఏమీ ఉండదు. గర్భంలాటివి ఆడదానికే. అంచేత అతనికేవి ధంగానూ బాదరబందీ ఉండదు ఎందరితో ఎలా తిరిగినా. అదో సుఖం అతనికి. ఆపైన మగాడికి ఆడది నిత్యావసరం. అతనికి కోరిక పుట్టినప్పుడు భార్య అందుబాటులో ఉండకపోవచ్చు ఆడాళ్లకి నెల మూడురోజులూ, ప్రసవాలూ అలాటివి ఉంటాయి. తరవాత మగాడు పనులమీద పైవూళ్లు వెళ్లి రోజులతరబడి ఉండిపోవలసి వొస్తుంది. తను వెళ్లేచోటికల్లా పెళ్లాన్ని పట్టుకుపోలేడుగా? అందుకని వెళ్లేచోటే పెళ్లాన్ని చూసుకుంటాడు టెంపరరీగా. మరి వ్యభిచారులు లేకపోతే ఎలా? అందుచేత మగాళ్లే వేశ్యలని తయారుచేశారు- తమ





అవసరంకొద్దీ. మగాడెందరాడవాళ్లతో తిరిగినా తప్పులేదు. అలా చెప్పించుకున్నారు ధర్మశాస్త్రాలలో. మగాడు తన అవసరం కోసమూ సరదా కోసమూ సృష్టించిన వ్యభిచారం- చివరికి మనలాటివాళ్లకి వృత్తి, బతుకుతెరువూ అయింది. ఆమాత్రం ఆడది ఏ పనికీ పనికిరాకపోయినా వ్యభిచరించేందుకు మాత్రం పనికొచ్చేస్తుంది. నీకొక విషయం తెలుసా? "

"ఏమిటి? "

"చీకటిపడేవేళకిక్కడికొచ్చి రాత్రి పదివరకో పన్నెండువరకో వ్యభిచారం వృత్తి చేసే వాళ్లలో సగంమందికి పైగా సంసారులే. అంటే- మొగుడూ, పిల్లలూ ఉన్నవాళ్లే. డబ్బు కోసం పెళ్లాన్ని తనే పంపేవాళ్లు కొందరయితే పెళ్లాం వ్యభిచారం చేసి సంపాదిస్తూందని తెలిసినా తెలియనట్లూరుకునేవాళ్లు కొందరు. వీళ్లకి డబ్బు రావడమే ప్రధానం. కొందరు మగాళ్లు తన భార్య సంపాదించేదానిమీదే ఆధారపడి బతుకున్నారిక్కడ. అంటే వ్యభిచారం ధర్మం అనేకదా. ఆడది మగాడినీ కుటుంబాన్నీ పోషించగలుగుతోంది? ఇలా తాళికట్టి తనమీద వాలిపోయే అప్రయోజకుడి తరఫున.

"నీ ఉద్దేశంలో ఇది... వృత్తి చేయడం తప్పు కాదా? "

"మెదడు. మేధ, తెలివి కుదవబెట్టి గుమాస్తాలూ, ఆఫీసర్లూ, జడ్జీల్లాటివారు పనిచేస్తారు నెలజీతాలకో, ఫీజులకో. కూలీలూ, రిక్షావాళ్లూ శరీరశ్రమతో సంపాదించుకుంటారు. అలాగే వేశ్య తన ఆడతనాన్ని కుదవబెట్టి ఆర్జిస్తుంది. బతకడం కోసం పని. బాధ తగ్గించి నొప్పి పోగొట్టే ఫీజు తీసుకుంటారు. కామాన్ని కూడా శారీరక అసౌకర్యమూ బాధా అంటారు. దానిని నివారించేది వేశ్య. ఆమె చేసే ఆ బాధానివృత్తిని నేరంగా ఎందుకు పరిగణించాలి? న్యాయమేనా? వ్యభిచారాన్ని డబ్బు సంపాదించే మార్గంగానే తీసుకుంటున్నారిప్పుడు... కస్టమర్‌కి సర్వీస్‌చేసి రుసుము తీసుకోవడం. ఇది కూడా సర్వీస్ కిందే వస్తుంది. నిష్పక్షపాతంగా చూడగలిగితే. సేవాపరమో ధర్మః ఇదీ ఒక సేవామార్గమే- సరిగా నిర్వహించగలిగితే. లలితమ్మా! చదువుకున్నదానివి. నీలాటిది చేస్తే ఈ వృత్తికి గొప్పతనమొస్తుంది. గౌరవమొస్తుంది. నామాట నమ్ము. మనం చూడడంబట్టి ఉంటుంది ఏదయినా. ప్రస్తుత వివాహ వ్యవస్థలో వ్యభిచారమనేది అత్యవసరం. కామదాహం తీరకపోతున్నకొద్దీ సమాజంలో నేరాలధికమవుతాయి. వేశ్యలుండబట్టే నేరాలు కొంతవరకేనా అదుపులో ఉంటున్నాయి. లేకపోతే మరింత ఎక్కువౌను. 'విటుడికి సేవ' అనే దృక్పథంలో చూడు నీ వృత్తిని. అప్పుడది చాలా సంతృప్తికరంగా ఉంటుంది. నీ వృత్తి- మానవసేవగా, సమాజసేవగా, ప్రజాసేవగా కనిపిస్తుంది. ఆ వృత్తిలో నువ్వు నిమగ్నమై తాదాత్మ్యం చెందగలుగుతావు. ఆకలీ, దాహమూ తరవాత అంతటి మానవావసరమైన కోరికని తీర్చడం చిన్న విషయం కాదు. ఒక విటుడి మనసుకీ, శరీరానికీ విశ్రాంతి కలిగించడం తక్కువ సంగతి కాదు. ఇదీ మానవసేవే. అంటే మాధవసేవే" మాణిక్యం ప్రవాహంలా అలా చెబుతుంటే ఆమె చెప్పేది కూడా నిజమే ఏమో అనిపిస్తోంది లలితకి.

"ప్రభుత్వం నిషేధించిందికదాని వృత్తిని నేరంగా భావించకు. పోలీస్‌స్టేషన్లు నెల మామూళ్లకీ కేసులకీ ఆశ్రయించేది వేశ్యావాటికలనీ వేశ్యా గృహాలనే. పగలు వ్యభిచారాన్ని ఖండించే పెద్ద మనుషులలో చాలామంది చీకటిపడేసరికి ఈ వీధిలోనే తిరుగుతారు. అలాటి ద్వంద్వప్రమాణాల మనుషులమయమైన ఈ సమాజం చెప్పే నీతులకి విలువేమిటి? మనిషికి కనపడేనాలుకొకటే అయితే- కనపడని నాలుకలెన్నో! పగటివేళ

సంస్కారం గురించి లెక్చర్లిచ్చే పెద్ద మనుషులే రాత్రిపూట సానివాడలో షైర్లు కొడతారు"

ఇక్కడకెలాటి విటులొస్తుంటారు? పెళ్లి కాని వాళ్లూ, భార్యలేని వాళ్లేనా? "

"నిజానికి వాళ్ళు తక్కువే. పెళ్లయి పెళ్లాముస్నవాళ్లే ఎక్కువమంది వస్తారు"

"అదేమిటి? " నమ్మలేనట్లడిగింది.

"పెళ్లయిన మగాడంటే శృంగారం రుచి ఎరిగినవాడు. నరమాంసపు రుచి ఎరిగినపులి లాటివాడు. శాస్త్రాలేం చెప్పనీ కానీ మగవాడికి కామం ఎక్కువ. నిగ్రహ శక్తి తక్కువ. స్త్రీకి నిగ్రహం ఎక్కువ. అదీ కాక ఆమెకు బోలెడన్ని సమాజపు కట్టుబాట్లు. అందుచేత ఆమెకు కోరిక కలిగినా చటుక్కున బయటపడలేదు. శృంగారంలో స్వేచ్ఛగా భర్తతోనే మసిలినా ఆమెనతను తెగించినదానిగా భావిస్తాడని ఆమె భయం. అందుచేత ఇల్లాలు భర్తకి పూర్తి శృంగారమివ్వదు పడకమీద. ఆ లోటుని వేశ్య దగ్గర భర్తీ చేసుకుందామనుకుంటారు చాలా మంది పురుషులు. తరువాత ఇప్పుడు జరిగే వివాహాలలో అధికభాగం కట్నం మీదే. ఆ మగాడికి పెళ్లికూతురు నచ్చకపోయినా కట్నంకోసం తాళికడతాడు. భార్యని ఇష్టపడి చేసుకోడు కనక కట్నం కోసం భార్య, శృంగారం కోసం వేశ్యా అన్నట్లు వ్యవహరిస్తారు. తాగిన మగవాడిలో విశృంఖలత వస్తుంది. ఏదో చేసెయ్యాలనుకుంటాడు. ఇంటి ఇల్లాలు తాగుబోతుని దగ్గరకి రానివ్వదు. అంచేత అతను వేశ్యనాశ్రయిస్తాడు. ఇప్పుడు ఉద్యోగరీత్యా ఆడవాళ్లు ఎక్కువగా రోడ్డుమీదకి వస్తున్నారు. వీరిలో ఏ కొందరు రకరకాల ఫ్యాషన్ల డ్రెస్‌లలో ఉన్నా చూసే మగాళ్లకి బుద్ధి మరోలా ఆలోచించకమానదు. సినిమా, టీవీ, పుస్తకాలు, పాటలు, మాటలు, రోడ్లమీద స్త్రీలు ఇన్ని కోణాలనుంచి శృంగారం ఉవ్వెత్తున ముంచెత్తిస్తోంటే మగవాళ్లు వ్యభిచరించక ఎలా ఉంటారు. పెళ్ళి కావలసినవారు కుతూహలంకొద్దీ వేశ్యా దర్శనం చేసుకుంటారు. వివాహితులు భార్య సహకరించక వీధిన పడతారు. ఈ పరిస్థితి ఇంతలో మారేది కాదు. అంచేత వ్యభిచారవృత్తికి కష్టమర్లు కరువవడమనేది ఇంతలో జరగదు" మూడో రోజున ముహూర్తానికి లలితకు వేశ్యా ముద్రపడి కన్నెరికం పేరిట తొలివిటుడి వద్ద ఐదువేలు తీసుకుంది మాణిక్యం. బోణీ మంచిదవాలని ఒక షావుకారు చేత కన్నెరికం చేయించింది. అదొక చిన్న సంబరమే. పెళ్ళికి నోచుకోని ఆమెకు కన్నెరిక మహోత్సవం మాత్రం జరిగింది.



వృత్తిలో ఆసక్తి కొంచెం తగ్గుతున్నట్లుంటే, మళ్ళీ క్లాసు తీసుకుందామె. వేశ్యగా తీసుకోవలసిన జాగ్రత్తలూ, మెలకువలూ, పాటించవలసిన ధర్మాలూ చెప్పింది.

"వేశ్య కూడా సినిమాతారలంత జాగ్రత్తలూ తీసుకోవాలి. ఆమె ఎవరినేనా అక్కా అనే పిలవాలి. అలాగ తను చిన్నదాన్నని స్ఫురింపజెయ్యాలి. ఎట్టి పరిస్థితిలోనూ నిజ వయసు చెప్పకూడదు. సౌందర్యాన్ని

పోషించుకుందుకు తగిన తిండి మాత్రమే తింటూ వ్యాయామం చేస్తూండాలి. చటుక్కున ఒంటరిగా రోడ్డుమీదకీ నలుగురిలోకి వెళ్లిపోకూడదు. ఎప్పుడూ మంచి బట్టల లోనూ అలంకరించుకునీ తప్ప పైవాళ్ళ కంటపడకూడదు. చిరునవ్వుతో, అందంగా, శృంగారదేవతలా కనిపిస్తుండాలి. తనని తోడు తీసుకెళ్లకుండా ఇల్లు విడచి వెళ్లకూడదు. మృదువుగా ఆహ్లాదకరంగా మాట్లాడాలి విటులతో. ఏ విటుడితోనూ నిజంగా మనసు పారేసుకోకూడదు. కాని ప్రతి విటుడితోను అతన్ని మాత్రమే ప్రేమిస్తున్నట్లు, అతనంటే ప్రాణమన్నట్లు ఉండాలి, మాట్లాడాలి. డబ్బు దగ్గర అరువూ, మొహమాటాలూ ఉంచుకోకూడదు. ఆ విషయంలో తనని అడ్డు పెట్టొచ్చు మరీ తప్పనిసరైతే తప్ప తాగకూడదు. ఏమాత్రం అపరిశుభ్రతనీ సహించలేనట్లుండాలి. విటులముందు ఏ విషయంలో అయినా లెవెల్ చూపుతుండాలి. భర్త ఉన్నట్లే ప్రవర్తించాలి విటుల ముందు. కావాలంటే పెళ్లి గురించి కథ చెప్పొచ్చు మెడలో మంగళసూత్రం ధరించాలి విటుడిముందుకెళ్లేటప్పుడు. పొరుగువాడి పాదుపచ్చన అన్నట్లే మరొకడి భార్యంటే మగాడికి మహామోజు. వేశ్య అనే సరికి తేలిక భావమూ పరపత్ని అనేసరికి గ్లామరు. ఎట్టి పరిస్థితులల్లోనూ డబ్బిచ్చిన విటుడితో తేలిక మాటలాడకూడదు. అతని మనసు నొప్పించకూడదు. అతనెంత చవటయినా అతని శృంగార సమర్థతను పొగడాలి. ఎక్కువ డబ్బు తీసుకుని మంచి సేవ అందించి క్లాస్ అనిపించుకోవాలి. విటుడుండగా బిగ్గరగా మాట్లాడడమూ, నవ్వడమూ చెయ్యకూడదు. వారానికొకసారయినా డాక్టరు పరీక్ష చేయించుకోవాలి. మగవాడి చేత కండోమ్ ధరింపజేస్తే మంచిదే. లేకపోతే తాను ఫెమిజోమ్ ధరించి తప్ప విటుడితో పడక చెయ్యకూడదు. ఈ వృత్తిలో ఉన్న పెద్ద ఇబ్బందులు- సుఖవ్యాధులు. అవి తీసుకోనూకూడదు, ఇవ్వనూకూడదు. డబ్బు విషయం నేరుగా మాట్లాడకుండా అమ్మకి చెప్పండనాలి. విటులు కానుకలిస్తే మాత్రం తనే తీసుకోవచ్చు అలా కానుకలిచ్చినప్పుడా విటులని ముద్దు పెట్టుకోవాలి. పడకనీ గదినీ పరిశుభ్రంగా ఉండేలా చూసుకోవాలి. అసలు పేరు ఏ విటుడికీ చెప్పకూడదు. వేశ్యానామం - చిత్ర... అదే చెప్పాలి.

అలాటివి మరెన్నో చెప్పి. "చిత్రమ్మా! నీకు నామీద నమ్మకముందా? " అని అడిగింది.

"అమ్మని నమ్మనివారెవరయినా ఉంటారా? " అలిగినట్లు మూతి ముడిచింది చిత్ర.

"ఆ మాట చాలు బిడ్డా! నువ్వు నన్ను నమ్ము. నేను నిన్ను మోసం చెయ్యను. నువ్వు నా కూతురివి. నీ డబ్బు లావాదేవీలూ అవీ నేనే చూస్తాను, నువ్వొప్పుకుంటే" అంది.

"నువ్వుకాక మరెవరున్నారని చూడడానికి? "

ఆమాటకామె ఎంతో పొంగిపోయింది. బిడ్డా అంటూ కౌగలించుకుని ఏడిచేసింది.

ఊహల్లూళ్లేలుతూంటే కర్మ గాడిదలను కాసిందని. పెళ్లి చేసుకుని ఇల్లాలిగా బతకాలనుకుని తపించిన తను పక్కా వేశ్య అయింది. వేశ్య కావడంతో దినచర్యే మారిపోయింది. రాత్రంతా వృత్తి చేయడం. పగలు పడుకోడం. రాత్రి ఏ మూడు గంటలకో వృత్తి ముగించి వేడినీటి స్నానంచేసి పాపం కడుక్కుని. వేడిపాలు తాగి పడుకుంటే ఉదయం పదికి లేవడం. అప్పుడు టిఫిను, ఒంటిగంట దాటాక భోజనం. మళ్ళీ ఓ గంట పడక. ఈ జీవితం తనదిలా అనిపించేది కాదు. ఎవరిబతుకో తను బతుకుతున్నట్లనిపించేది. ఇదికాదు జీవితం అని

పించేది. తామరాకుమీది నీటిబిందువులా ఉండేది చిత్ర ఆ వృత్తిలో. విసుగు తప్పించుకుందుకు గ్రంథాలయంనుంచి పుస్తకాలు తెప్పించుకునేది మాణిక్యంచేత. పగలు చాలా భాగం ఖాళీయే కనుక రోజుకి రెండు పుస్తకాలయిపోయేవి. పేపరుకాక కథల సంపుటిలు. నవలలు, జీవితచరిత్రలు. మాణిక్యం చేతికందినవి తేవడమూ ఆమె చదవడమూ. ఇంగ్లీషు నేర్చుకోవడం ఎలా అన్న పుస్తకం కొని సరదాగా ఇంగ్లీషు నేర్చుకుంది. పుస్తకాలు ఆమె కోరుకున్న కాలక్షేపాన్నే కాక అదనంగా మనసుకి హాయినీ మెదడుకి విజ్ఞానాన్నీ బుర్రకి ఆలోచించే శక్తినీ ఇచ్చేవి.

ఆవేళ హడావిడి పడిపోతూ వచ్చింది మాణిక్యం. "చిత్రా! మన పంట పండింది. రాత్రికి మనం దొరగారి బంగ్లాకెళ్ళాలి. దొరగారు నీ గురించి ఎవరి ద్వారా విన్నారో ఏమో. ఒకసారి నిన్ను చూడాలనుకున్నారట. పోలీసు కబురు తెచ్చాడు. ఇలాటివాళ్ల పరిచయాలూ, ప్రాపకాలూ మనకెంతో లాభం. పోలీసులు మనవేపు కన్నెత్తి చూడరు"

"దొరగారెవరు? "

"పోలీసాఫీసరు"

తెల్లబోయింది చిత్ర. "వ్యభిచారం నేరమని వ్యభిచరించేవారిని పట్టుకుంటారు పోలీసులు. అలాటిది పోలీసధికారే వ్యభిచరించడమా!"

"ఆయన మాత్రం మగాడు కాదూ? పోలీసులకి నెలకిన్ని కేసులు పట్టుకోవాలని, స్టేషను ఇంత మామూలు చెల్లించాలనీ ఉంటుంది. అందుకని అవసరమైనప్పుడు మనవేపొచ్చి రెయిడ్లు చేసినట్లు నటిస్తారు. అంతేకాని అదంతా నిజమేమిటీ. వాళ్ల బాధలు వాళ్లవి. సీత కష్టాలు సీతవీ, పీత కష్టాలు పీతవీ"

ఆ రాత్రి చాలా బాగా తయారై పోలీసు జీప్‌లో మాణిక్యంతో కలిసి ఇనస్పెక్టర్ బంగ్లాకెళ్లింది. దొరగారితో సన్నిహితంగా గడిపింది.

★ ★ ★

ఆవేళ...

మధ్యాహ్నం మూడవుతోంది. ఓ నవల దీక్షగా చదువుతున్న చిత్ర వీధిలో గోలగా ఉంటే తలుపు తీసి వరండాలోకి వచ్చింది. పది పన్నెండుమంది గుంపుగా డోలక్‌లు, హార్మణీ వాయిస్తూ చప్పట్లూ, తాళాలూ కొడుతూ అల్లరి చేస్తున్నారు. వాళ్ళు చీరాజాకట్టూ ధరించినా ఆడవాళ్లలాలేరు. అలాగని మగవాళ్లలా కూడాలేరు. చిత్రంగా ఉన్నారు. చూడడానికి ఎబ్బెట్టుగా అనిపిస్తున్నారు. వాళ్ళు బీడీలు కాలుస్తున్నారు. వాళ్ళు చూడడానికి ఆడవాళ్లలా ఉన్నా వాళ్ల గొంతుకలు మగగొంతుకల్లా ఉన్నాయి. ఆ మూక తనని చూస్తూనే వరండాలోకి వచ్చేసింది "అక్కా!... అప్పా" అంటూ. ఆమెకి కంగారు వేసింది వాళ్ళేం చేస్తారో అని. అంతలో మాణిక్యం వచ్చింది ఆపద్బాంధవిలా.

"కొజ్జాలా! ఏమిటిలా వచ్చారు? " అంటూ పలకరించింది.

"చైత్రపూర్ణిమొస్తోంది కదా? కూవగన్ వెళ్తాంగా..." లీడర్‌లా ఉన్న మనిషి చెప్పింది.

"కొజ్జాలా!" ఆశ్చర్యంగా చూసింది చిత్ర. ఇంతవరకూ ఆమాట వినడమే కానీ కొజ్జాలంటే ఎలా ఉంటారో ఎవరినంటారో తనకేమీ తెలియదు. ఇప్పుడు చూస్తోంది.

"ఏటప్పా... అలా ఎర్రిమొగవేసి చూత్తావ్? మేమేం పరాయోళ్లమనుకుంటున్నావేటి? ఏం కాదు. మాదీ మీ కుటుమానమే. మీరు వేశ్యలు, మేము కొజ్జాలం"

"మీరు లంజలు, మేం కొజ్జాలం" కిసుక్కుమన్నారెవరో కోతిలాగ.

"మేం పురాణకాలంనుంచీ ఉన్నాం




మీలాగే. ఇంద్రుడి కొలువులో మీలాటి వేశ్యలు రంభ, ఊర్వశి, తిలోత్తమ లాంటి వాళ్ళుంటే రామాయణ కాలంలో మేమున్నాం"

"రామాయణంలోనా!"

"చెబుతా యినుకో. శ్రీరామచంద్రుడు వనవాసం వెళ్తున్నాడు. అయోధ్యప్రజలు వూరి పొలిమేరవరకూ వచ్చి.. 'రామా! మీరు వనవాసంనుంచి తిరిగొచ్చేవరకూ మేమిక్కడే ఉంటాం. నగరంలోకి మీరులేని అయోధ్యలోకి వెళ్లం' అని రోదించారు. రాముడు వారినోదార్చి, "సోదర సోదరీమ ణులారా! నాయందు గౌరవముంచి మీరు వెనక్కి వెళ్ళండి" అని బతిమాలాడు. కానీ రాముడు పద్నాలుగు సంవత్సరాల తర్వాత తిరిగొస్తుంటే కొందరక్కడే అలాగే నిలబడి పోయుండడం చూసి, "అదే"మని అడిగాడు. దానికి వారు యిలా చెప్పారు.

"రామా! ఆనాడు మీరు సోదరసోదరీమ ణులారా అంటూ వారిగురించే చెప్పారు వెనక్కి వెళ్లమని. మేం సోదరులమూ కాము. సోదరీమణులమూ కాము. కొజ్జాలం. అందుచేత మేమేం చెయ్యాలో మీరు చెప్పలేదని. ఏం చెయ్యాలో తెలియక యిలా ఉండిపోయాం అన్నారాయన. అంచేత మా కొజ్జాలమూ మీ భోగమాళ్ల లాగే పురాణపురుషులమే" అన్నారు. చిత్రకి జాలివేసింది. నవ్వూ వచ్చిందా కథకి. వాళ్ళెందుకో విరాళం అడిగారు. అర్థంకాక పోయినా ఏభై రూపాయలిచ్చి పంపింది. అప్పుడు మాణిక్యాన్నడిగింది కొజ్జాలగు రించి.

ఓ నిట్టూర్పు వదలి "ఏం చెప్పమం టావు? ఇదోరకం అవకరం. మనిషి మని షికి చేసే అవకరం. రాజులకాలంలోనూ, నవాబులకాలంలోనూ అంతఃపురాలూ, జనా నాలూ ఉండేవికదా. ఆ ఆడవాళ్ళ రక్షణకు మగవాళ్ళని నియోగిస్తే ఈ మగాళ్ళూ ఆ ఆడాళ్ళూ తప్పు చేసేస్తారని మగవాళ్ళ పురు షత్వం తీసేసి కొజ్జాలని చేసి నియమించే వారు. అలాగయితే వీళ్ళా ఆడవాళ్ళ శీలా నికి కళంకం తేలేరుకదా అని. ఎద్దులకి అదే... దూడలు ముదిరాక వాటి బీజాలు కొట్టడం చూళ్ళేదూ? అలా కొట్టెయ్యకపోతే అవి ఆబోతులౌతాయి. కొట్టేస్తే ఎద్దులై... సంతానం పొందే శక్తి కోల్పోతాయి..."

"ఎద్దులకయితే ఉపయోగం. ఈ కాలంలో మనుషులని కొజ్జాలుగా మార్చడం..."

"మనిషి... మగాడు... నిజంగా ఎంత వెర్రివాడో, నీచుడో చెప్పలేననుకో. మగవాడి కోరికలకి శుద్ధీ బుద్ధీ ఉండవ్. ఒక్కొక్క పుర్రెలో ఒకొక్క వెర్రి. జంతువులతో కలిసి చూద్దామని ఓ మానవుడి కోరికయితే, మరో మగవాడిననుభవిస్తే ఎలా ఉంటుందన్న కుతూహలం మరొకడిది. ఇవీ వికృత పురుష వాంఛా స్వరూపాలే. వేశ్యలవ ద్దకిలాగే కొజ్జాలవద్దకి కూడా అలవాటుగా వచ్చే విటులుంటారు తెలుసా? వెర్రి వెయ్యి విధాలైతే పిచ్చేమో పదివేల విధాలు. పోచె మ్మలు, మాచకమ్మలు గత్యంతరం లేక కొజ్జాలౌతారు. వేశ్యయినా, కొజ్జా అయినా డబ్బుకోసమే"

"మాచకమ్మలంటే?"

"కొందరాడవాళ్ళు ఎంత వయసొచ్చినా పుష్పవతులు కారు. వాళ్ళని మాచకమ్మలం టారు. వాళ్ళు తప్పనిసరిగా కొజ్జాలుగా మిగ లవలసిందే. కొందరిని చిన్నప్పుడే కొజ్జాలని చేస్తారు. తీరికూర్చుని కొజ్జా పురాణమెందు కులే..."

"వాళ్ళంతా ఎక్కడికో యాత్రకి కాబోలు వెళ్తామన్నారు. ఎక్కడికెళ్తారు వాళ్ళు?" అదొక్కటీ చెప్పమన్నట్టుంది.

"వీళ్ళూ మనుషులే. ఎన్నికలప్పుడు



వాళ్ళకి ఓట్లుండవు స్త్రీగా రాయాలో, పురుషునిగా నమోదు చేయాలో తెలీక కాబోలు. ఏదేమయినా వాళ్ళూ మనుషులే కనక వాళ్ళకీ భక్తివిశ్వాసాలూ అవీ ఉంటాయి. వాళ్ళెందరు దేవుళ్ళకి మొక్కినా కొజ్జాలకి ఆరాధ్యదైవం మాత్రం అరవన్నే. తమ మొక్కుల్ని అరవన్ ఎదుటే భక్తి పూర్వకంగా నివేదించుకుంటారు"

"ఎవరీదేవుడు? " అరవన్ అనే పేరామె ఎప్పుడూ విన్లేదు. అలాంటి పేరుగల దేముడున్నట్లే తెలియదు.

మాణిక్యం వివరించసాగింది. "మహాభారతయుద్ధంలో ఒకానొక దశలో పాండవులు ఓటమి అంచుకు వచ్చేసినప్పుడు వారిని గెలిపించాలంటే 'ఒకవీరుడు, శూరుడు, ధీరుడు బలికావలసిందే' అంటారు మునులు. అరవన్ గొప్ప హృదయంతో బలిదానానికి సిద్ధమౌతాడు. కానీ అలా బలి కావడానికి ముందు పరిణయమాడాలనే తన కోర్కెను తీర్చుకోవాలనుకుంటాడు. అయితే పరిణయం తర్వాత తన సతీమణి వితంతువు కావడం అతనికి నచ్చదు. అప్పుడు సమయానుకూలంగా శ్రీకృష్ణుడు స్త్రీ రూపంలోకి మారగా అతన్ని పెళ్ళి చేసుకుని... తనని వివాహమాడినందుకు కృతజ్ఞతలు తెలుపుకుని... పాండవ విజయంకోసం మహదానందంగా ప్రాణత్యాగం చేస్తాడు. శ్రీకృష్ణుడి వంటి మగవాడిని పెళ్ళిచేసుకున్నందుకూ, త్యాగశీలి అయినందుకూ అరవన్ అంటే కొజ్జాలకి భక్తి. భక్తి ఒక్కటేకాదు. ప్రేమ, వాత్సల్యం అన్నీనూ. అన్నట్లు అరవన్ ఎవరనుకున్నావ్? అర్జునుడి కొడుకే"

"వీళ్ళు వెళ్ళేదెక్కడికి? "

"మద్రాసుకి నూటపాతిక మైళ్ళలో కూవగన్ అనే గ్రామముంది. అక్కడ అరవన్ దేవాలయముంది. చైత్ర పూర్ణిమనాడు కొజ్జాలు అరవన్‌ని పెళ్ళాడతారు. మరుసటి రోజు ఆచారం ప్రకారం వితంతువు వేషం ధరిస్తారు. ఈ తంతునంతటినీ వాళ్ళెంతో భక్తిప్రపత్తులతో నిర్వహిస్తారుట. కొజ్జాల ఆచారమిది. ఈ పండగ విషయంలో వాళ్ల కెంత పట్టింపో! ఎంత కట్టో!" వాళ్ళని మెచ్చుకుంటున్నట్టుంది మాణిక్యం. చిత్రకి మాత్రం వాళ్ళమీద జాలేసింది. దేముడు పనికట్టుకుని యిలాంటి సృష్టి ఎందుకు చేస్తాడో?

"ఇంతవరకూ నేనెప్పుడూ చూడలేదే వీళ్ళని? "

"ఎలా చూస్తావ్? నువ్వు రోడ్లమీద తిరగవుగా"

"నువ్వు తిరగనివ్వవుగా..."

"ఎందుకు తిరగాలి నువ్వు నేనుండగా? అమ్మని నేనుండగా..."

నిజమే. అమ్మ తనని కంటికి రెప్పలాగే చూసుకుంటుంది. తను కేవలమూ వృత్తి చేస్తూందంతే. మిగిలిన వ్యవహారాలన్నీ ఆమే చేసుకుంటుంది. బజారు పనులు, బ్యాంక్ పనులు, లైబ్రరీనుంచి పుస్తకాలు తేవడం... ఒకటేమిటి, అన్నీను.

"అమ్మా! మేం భగవద్గీతా ప్రచారకులం, గీతా గ్రంధాన్ని మీకివ్వాలని మా సంకల్పం"

అప్పుడు చూసిందామె అటు. ఇద్దరు స్వాములు కాషాయవస్త్రాల్లో. స్ఫురద్రూపులు. చూడగానే నమస్కారం పెట్టాలనిపించి చేతులు జోడించింది. "నేను వేశ్యను స్వామీ"

"గీతాపఠనానికి వేశ్య నిషిద్ధురాలు కాదమ్మా. వేశ్యనని నీవు నిన్ను కించపరుచుకోనవసరమూ లేదు. ఎవరి ధర్మం వారు నిర్వర్తించాలనే చెప్పాడు గీతాకారుడు"

"స్త్రీనయిన నేను పఠించవచ్చునా? పామరురాలినయిన నాకు మహోన్నతమూ, ఉత్కృష్టమూ అయిన భగవద్గీత అర్థమౌతుందా? అందుతుందా? "





"తెలుగు టీకా తాత్పర్యసహితం తల్లీ. గంగాగోదావరులనెవరు ఔపోశనం పట్టగలరు? మన సంస్కారం మేరకు అర్థమవుతుంది, అందుతుంది. దేనికయినా మొదట ప్రయత్నమనేది ప్రధానం కదా? " చిరునవ్వు నవ్వారాస్వామి. మరుక్షణం చిత్ర లోపలికి వెళ్ళి వందరూపాయలు తెచ్చి అందించింది. "మీరపవిత్రమౌతారని లోపలికాహ్వానించలేదు స్వామీ"

"అపవిత్రః పవిత్రోవా" అంటూ రెండు గీతలనందించాడాయన.

"రెండెందుకు స్వామీ? "

"ఒకటి పూజించడానికి, రెండోది పఠించడానికి. గీతాపఠన పుణ్య ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించి వెళ్ళిపోయారు వారు. ఆ గ్రంథంలో మురళీధరుడైన గోపాలకృష్ణుడి వర్ణచిత్రం. దానిని చూస్తూ మైమరచిపోయిందామె ఏదో దివ్యానుభూతికి లోనైనట్లు.

ఆనాటినుంచి ఆమె కృష్ణభక్తురాలూ, గీతా పాఠకురాలూ అయిపోయింది. దినచర్యలో గీతాపఠనాన్ని భాగం చేసుకుంది.



విటులను ఆకర్షించే ఉపాయాలు, ఒకసారి వచ్చిన విటుణ్ని ఆకట్టుకుని నిలుపుకునే విధానాలు, విటుడికి తెలియకుండానే విత్తం గ్రహించే మెలకువలు మాణిక్యం సలహాలను అమలుపరుస్తూ త్వరలోనే చిత్ర పేరొందిన వేశ్య అయిపోయింది. ఇపుడు గార్డెన్ పార్టీలు, కాల్ గర్ల్‌గా పెద్ద హోటలు రూములు ఆమెను ఆహ్వానిస్తున్నాయి. అందమైనది, చిన్నవయసు. ఎంతో సౌమ్యమయిన ప్రవర్తన. మృదువయిన మాటతీరుతో ఆమె ప్రత్యేకంగా అనిపించేది. రసికులకు ఆమె మనోరాణి అయిపోయింది.

ఆమె సంపాదన వరదలా పొంగుతోంది. సంవత్సరాలు రోజుల్లా దొర్లాయి.

అప్పుడు ఒక్కసారిగా ఆమెవద్దకు వచ్చే విటుల సంఖ్యే కాక వేశ్యావాటికని దర్శించే వారి సంఖ్యే గణనీయంగా పడిపోయింది.

తెల్లబోయిన చిత్రకు మాణిక్యం వివరణయిచ్చింది. "ఎంతయినా వ్యభిచారమూ వృత్తే. కనుక దీనికి ఆటుపోట్లూ, సీజన్‌లూ ఉండకమానవు. వ్యభిచారానికి అనువైన సీజన్ చలికాలం. అప్పుడు వ్యాపారానికి మంచి గిరాకీ ఉంటుంది. వేసవిలో వేడికీ ఉక్కకీ ఎవరి ఒళ్ళు వారికే అసహ్యమేస్తున్నట్లుంటుంది. ఇక వారిలో శృంగార వాంఛలేం కలుగుతాయి? "

ఆమెకు నిజమే అనిపించాయి అమ్మ మాటలు.

"మన వృత్తిమీద సామాజిక పరిస్థితులూ సైన్సూ కూడా ప్రభావం చూపుతాయి కొంత వరకూ. ఆమధ్య ప్రొహిబిషన్ పెట్టారుకదా రాష్ట్రంలో? తాగుడుకీ తరుణికీ కొంతలింకుంది. తాగితే తరుణి అవసరమనిపిస్తుంది. మద్యపాన నిషేధం అమలులో ఉండిన సమయంలో వృత్తికి కొంచెం దెబ్బ తగిలింది.

మనసు ఆనందంగా ఉన్నప్పుడు మగాడు శృంగారం కోరతాడు. ఈ రోజుల్లో మనిషి

ఉషారుగా ఉండాలంటే డబ్బు వస్తేనే. పంటలు చేతికి రావడం, షేర్ మార్కెట్ బాగుండడం, అలాటి సందర్భాలలో మన వ్యాపారమూ మూడు పువ్వులూ ఆరు కాయలే. ఈమధ్య నువ్వూ చదివే ఉంటావు పేపర్లలో..."

"దేనిగురించి? "

"ఎయిడ్స్ మహమ్మారి గురించి. ఇది మిగిలిన సుఖవ్యాధుల్లాటిది కాదనీ, ఇది అంటితే మందు లేదనీ, మరణమే శరణ మనీ పేపర్లలో, పత్రికల్లో, రేడియోలో, టీవీలలో ఇంకా అనేక రకాలుగా ప్రభుత్వం తెగ ప్రచారం చేస్తూంది. నెలకిందట విశాఖప ట్నంకి చెందిన స్వచ్ఛంద సంస్థ ఎయిడ్స్ గురించి ప్రజలకు తెలియజేయడానికి సభలు, సమావేశాలు, ప్రదర్శనలవంటి కార్యక్రమాలు నిర్వహించింది. దాంతో ప్రజలలో చాలామందికి ఎయిడ్సంటే తెలిసి, పరస్త్రీ అంటేనే గజగజ వొణికిపోతున్నారు. వేశ్యంటే చాలు విపరీతంగా భయపడిపోతు న్నారు. మనవృత్తికి ఎయిడ్స్ పెద్ద దెబ్బే కొడుతూంది. కొన్నాళ్లపాటు తప్పదు మరి. ఐతే, మళ్ళీ ప్రజలు దీనికీ స్పందించనంతగా అలవాటుపడిపోతారు. మళ్లీ యథాప్రకారమే వృత్తికి గిరాకీ వచ్చేస్తుంది. అంతవరకూ ఓపిక పట్టాలి. తప్పదు. రైలు తమ మీంచి వెళ్లేటప్పుడు పట్టాలు కొంచెం వొంగు తాయి, రైలెళ్లిపోయాక యథాస్థానానికొ స్తాయి. ఎయిడ్స్‌వల్లే ప్రస్తుతం వృత్తికి గిరాకీ పడిపోడం"

ఏ సుఖం ప్రాథమికమో, ఏ సుఖం సృష్టికి దారితీస్తుందో, ఏసుఖం జీవులకు అత్యంతానందమో, అద్భుతమో అది అను భవించడంవలన అపశ్రుతులు, రోగాల శిక్షలు. ఏమిటీ జీవితం? ఎందుకది?

వృత్తిచేస్తున్నా ఉండీ ఉండీ ఈ ప్రశ్నలు చిత్ర మనసులో. చదివిన పుస్తకాలు ఆమె మనసుని ఆమెకు తెలియకుండానే ప్రభావితం చేస్తున్నాయి ముఖ్యంగా భగవద్గీత. 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అన్న జీవనసూత్రం ఆమెకి చాలా నచ్చింది. రోజూ ఒకశ్లోకం క్షుణ్ణంగా పఠించడమేకాదు, మనసుకీ జీవితానికీ పట్టించుకుందుకు కూడా ప్రయత్నిస్తోంది చిత్తశుద్ధితో. అలాగని ఆమె సర్వసంగ పరిత్యాగి కాలేదు. జీవితంలో ఉంటూనే జీవితానికి వెలుపల ఉంటోంది.

"అమ్మా"

"చెప్పమ్మా"

"మన ఆర్థిక పరిస్థితేమిటి? ఎలా ఉంది? "

"ఎప్పటికప్పుడు చెబుతూనే ఉన్నానుగా? నామీద అనుమానమా"

"ఛ... అమ్మననుమానించేంత అధమురాలిని కాను. మొత్తం మనకున్నవి చెప్పు"

"నువ్వేమీ తక్కువ సంపాదించలేదమ్మా. వృత్తిచేస్తున్నది నాలుగయిదేళ్లనుంచే అయినా ఈ యిల్లు కొన్నాం. బ్యాంకులో అయిదు లక్షలున్నాయి. వడ్డీలొస్తాయి. ఇంట్లో ఉన్న బంగారం నీకేతెలుసు. బీరువాడు పట్టుచీరలూ, కొంచెం వెండిసామానూ"

"ఇవి మనిద్దరి శేష జీవితానికీ సరిపోతాయా? "

"నేనెన్నాళ్ళుంటానమ్మా. ఆలోచించవలసింది నీ గురించి. నీ జీవితమంతా ముందే ఉంది. సరిపోడానికంతేముంది? ఎంత చెట్టుకంతగాలి. అయినా యిప్పుడెందుకమ్మా యివన్నీ? "

"ఊరికే అడిగానంతే, అమ్మా దీనంతటికీ మూలకారణం నువ్వే. నీ అండదండలే"

"నువ్వొచ్చాక నా బతుకు బాగుపడింది చిత్రమ్మా. ఇది నిజం. కూతుర్ని కనకపోతే ఏం? అంతకంటె ఎక్కువగా చూసుకుంటు




న్నావు. నీ రుణం..." ఆమె కంఠం గద్గదిక మయింది.

"తల్లీ కూతుళ్ళమధ్య రుణాలుంటాయా? "

వారిస్తున్నట్లు అంది చిత్ర. మాణిక్యం ఆమెనొక్కసారి కౌగలించుకుని కన్నీరు కార్చి లోపలికి వెళ్ళింది.

తన తల్లితండ్రుల ఆచూకీ తెలుసుకుందా మని ఒకసారి ప్రయత్నించింది చిత్ర. వాళ్ళకి కొంత డబ్బివ్వాలని ఆమె ఉద్దే శమూ, వాంఛా... కానీ వాళ్ళెక్కడికి మకాం మార్చేశారో ఎవరికీ తెలియదు. వెళ్ళేట ప్పుడు వారెవరికీ చెప్పలేదుట.

పనున్నా లేకపోయినా కార్యాలయం తెరిచి ఉంచేటట్లే ఆ వేళకి గదిలోకి వస్తుంది చిత్ర. మునుపటిలా కిటకిటలాడక విటుడికీ విటుడికీ మధ్య విరామముం టోంది. అలా వచ్చిన విరామంలో పుస్తకం చదువుకుంటుందామె. ఇదివరకటంత కాక పోయినా యిప్పుడూ ఆమెకు సంపాదన ఉండకపోలేదు. ఆమె సంపాదన గురించి పట్టించుకోడమూలేదు, విచారించడమూ లేదు.

"ఏమిటో... చిత్రమ్మా... నువ్వీ మధ్య ఏదోలా ఉంటున్నావు. నాకు చెప్పమ్మా ఏదేనా ఉంటే. తల్లిలాంటిదాన్ని. ఆర్చేదా తీర్చేదా అనుకోకు. నాచేతనైనది నేను ప్రయత్నిస్తాను"

"ఏమీలేదమ్మా"

"నిజమేనా? "

"నిజమే. ప్రత్యేకంగానూ, చెప్పేందుకు యిది అని ఏమీలేదు"



రాత్రి తొమ్మిది దాటుతోంది. శుక్ల పక్షమవడం మూలాన వెన్నెలగా ఉంది.

వేణు తన గదిముందు ఆరుబయట చాపవేసుకుని వాలిపోయి ఆకాశాన్నీ చంద మామనీ చూడసాగాడు. చల్లగా గాలివీస్తూ వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది.

"వేణుబాబూ!" అంటూ వచ్చారు అయ్య రుగారు.

"రండి రండి..." చాపమీద లేచికూర్చుని వారినాహ్వానించాడు.

"ఏం చేస్తున్నావు? "

"ఏమీలేదు. ఊరికే అలా పడుకున్నాను"

"చూడగా... యీమధ్య నీ ఆదాయం అంతమంచిగా ఉన్నట్లు లేదే! ఏమీ? ఎందు వలనా? " చాపమీద కూర్చుంటూ యధాలా పంగా అడిగినట్లడిగారు. "దాచమని నువ్వీ మధ్య నాకు దుడ్డు యివ్వడంలేదు"

"నిజమే. ఎందుకనీ... అంతగా డబ్బు రావడంలేదు"

"ప్రజలకి పాటలమీద రుచి తగ్గెనా? "

"ఏమో. అంతకీ పౌరాణిక పద్యాలు కూడా నేర్చుకున్నాను కొందరడుగుతున్నా రని. నా సంగీతపు అంగడిలో వివిధర కాలూ పెట్టినా అమ్మకాలు బాగుండడం లేదు. ఏం చేయాలో తెలియడంలేదు" నీర సంగా అన్నాడు.

"నీ వయస్సెంత? "

"ఇరవై నాలుగు"

"ఇకనేమీ? పెండ్లి చేసుకో. పెండ్లాం వస్తే దశ తిరుగుతుంది మగాడికి"

"తాడూ బొంగరమూ లేనివాడిని నాకు పెళ్ళేమిటి? ఆస్తిపాస్తులా, ఉద్యోగమా స్థిర మయిన సంపాదనా? ఏం చూసి పిల్లని స్తారు నాకెవరయినా? "

"నీకేమయ్యా? మంచి సింగర్‌వి" పొగు డుతున్నట్లన్నారయ్యర్.

"సింగర్‌ని! స్ట్రీట్‌సింగర్‌ని... వీధిగాయ కుడ్ని పూటకి టికానాలేనివాణ్ణి" నిట్టూర్చాడు వేణు.

"నువ్వు ఊ అను. నేను నీకు మంచి అమ్మాయిని చూస్తాను"

"పెళ్ళి చేసుకుంటే సరిపోదుగా. పెళ్ళానికి ఫుడ్ పెట్టాలిగా. నా ఫుడ్‌కే డొటుగా ఉంటోంది, నేనింకొకళ్ళకి ఏం పెట్టగలను? " నిర్వేదంగా అన్నాడు.

"మగాడివి. అలా భయపడతావేం పెళ్ళంటే? పెండ్లానికి ఫుడ్డే పెట్టలేకపోతావా? "

"నా పెళ్ళికిప్పుడప్పుడే తొందరేముంది లెండి"

"అది కాదయ్యా. ఒకమంచి అమ్మాయుంది తెలిసినవారి దగ్గర. అందుకే చెబుతున్నాను. ఏ వయస్సులో జరగవలసినవి ఆ వయసులో జరగాలి. లేకపోతే చాలా కష్టమౌతుంది"

"కానీ సంపాదన సరిగా లేకుండా మెడకో డోలు తగిలించుకుంటే మరీ కష్టమౌతుంది కదా? "

"పెళ్ళి చేసుకొనకపోతే నువ్వు చెడిపోదువేమో అని నా భయం. వయసటువంటిది కదా..."

"అదా మీ భయం? " నవ్వేశాడు వేణు.

"నేను హామీ ఇస్తున్నాను. నేనేమీ పాడయిపోను. ఇప్పుడు వివాహం అయితేనే పాడయిపోతాను"

"సరే. నీ యిష్టం. ఒంటరివాడివని చెబుతున్నాను. నీకుదా వివాహం చేసుకోవాలని ఎప్పుడు మనసుకనిపించినా సిగ్గుపడకు. నాకు చెప్పు. నేను అమ్మాయిని చూసి చేస్తాను. పెద్దవాళ్ళు లేరుకదా నీకని యిలా చెబుతున్నాను. జ్ఞాపకముంచుకో. నీకు నేనున్నాను"

"థ్యాంక్యూ సర్" అన్నాడు వేణు.

అయ్యరుగారు వెళ్ళిపోయారు. అతనికి తప్పు చేసినట్లనిపించింది. ఆయనముందు తను నిజం చెప్పలేదు. మనసుని దాచుకున్నాడు.

ఆయన అనుమానం రైటే. వయసు తన మీద ప్రభావం చూపుతోంది యీ మధ్య నుంచి. ఆడవాళ్ళని అందమయిన అమ్మాయిలని చూడాలనిపిస్తూంది. వాళ్ళతో మాట్లాడాలనిపిస్తూంది. ఇంకా చాలా అనిపిస్తున్నాయి. బాగున్న అమ్మాయిని ముద్దుపెట్టుకోవాలనీ, కౌగలించుకోవాలనీ... అలాగ. అమ్మాయిలని చూస్తే మనసదోలా అయిపోతుంది. ఎక్కడికో పోతుంది. పాట వినేవాళ్ళల్లో అమ్మాయిలుంటే వాళ్ళని చూస్తుంటే పాటశ్రుతి తప్పడం... గొంతు ఆరిపోడం.. సిగ్గువెయ్యడం... జరుగుతున్నాయి. అనవసరంగా శరీరం చిరుచెమటలు కమ్ముతోంది. ప్రేమపాటలు మాత్రమే పాడాలనిపిస్తూంది. ప్రేమసినిమాలు చూడాలనిపిస్తుంది పదేపదే. అమ్మాయిలతో మాట్లాడాలనిపిస్తుంది.

నిద్రపోతే కలలలోకీ అమ్మాయిలే. ఆ అమ్మాయిలని కౌగలించుకున్నట్లు... ఆమే తనూ కలిసి ఏవేవో లోకాల్లో ఎగిరిపోతున్నట్లు. ఆమెతో కలిసి జలకాలాడుతున్నట్టు. ఆమె ఒక్కతికోసమే తను పాడుతున్నట్లు... ఆమె తనగొంతులో గొంతు కలిపినట్లు...

మళ్ళీ అనుకునేందుకే సిగ్గుపడే కలలు. పడకగది కలలు...

ఊరికినే శరీరం వేడెక్కిపోడం. మరొకరి స్పర్శకోసం తపనకలగడం ఎవరి వొడిలోనో సేద తీరాలనిపించడం... ఆమెతో ఏకాంతం అభిలషించడం... అలాటివి. తనని యిబ్బంది పెట్టేవి.

అయ్యరుగారు తన పరిస్థితిని సరిగానే పసికట్టారు. అందుకు చికిత్స కూడా చెప్పారు. స్త్రీ అంటే ఏమిటి? స్త్రీకీ పురుషుడికీ భేదమేమిటి? ప్రేమంటే ఏమిటి? పెళ్ళంటే ఏమిటి? స్త్రీ నగ్నంగా ఎలా





ఉంటుంది? చూడాలనే కోరిక.

ఒక కల. తనూ ఓ అమ్మాయీ ఒక యింట్లో నివాసం. అందమయిన అమ్మాయి. ఆనందదాయకమైన జీవితం. ఆమె తన గుండెలమీద వాలి ఏవేవో తీయ నికబుర్లు, ప్రేమమాటలు... వలపు గుసగుసలు, చిలిపి శృంగారచేష్టలు.

తనకి తెలిసిపోతోంది వాటి అంతరార్థమేమిటో. కానీ ఆ కల నిజం కావడం ఎలా?

స్త్రీ సౌందర్యాన్ని సమగ్రంగా వీక్షించాలనే ఆకాంక్ష. స్త్రీ అనే పదార్థం మిస్టరీలా తనని వేధించడం మొదలుపెట్టింది కొన్నినాళ్ళుగా.

ఏమిటి స్త్రీ? ఎలా ఉంటుంది? మనసుని వేధించే వేదనయిపోయింది.



మనిషిలోకి వేదాంతమూ, వైరాగ్యమూ ఎందుకొస్తాయి?

అనే ప్రశ్నకున్న సమాధానాల్లో వయసు... వృద్ధాప్యం అనేవి ప్రధానం కావచ్చు

మరి కొందరికి ముసలితనం రాకుండానే ఎందుకు వైరాగ్యమూ విరక్తీ వస్తాయి? జీవితంలోని అనుభవాలవల్ల కావచ్చు లేదా జీవితంలోని విసుగూ, భారమూ వల్ల కూడా కావచ్చు

జీవితాన్ని ధ్యేయంలేకుండా గడపడం కాదు సమస్య. అలా ధ్యేయరహిత జీవితాన్ని గడుపుతున్నట్లు ఆత్మజ్ఞానం కలిగితేనే మొదలౌతుందసలు సమస్య.

తినడం, డబ్బుకోసం ఎవరికో శరీరాన్నద్దెకివ్వడం, నిద్రపోడం... యిదేనా జీవితం? ఇలా బతకడంవల్ల ఉపయోగమేమిటి? బతక్కపోతే వచ్చే బాధేమిటి?

తను చదివిన పుస్తకాలవల్లనో, గానుగెద్దులాటి జీవితంవల్లనో మాధవిలో యీ ప్రశ్నలు ఉదయించాయి. మెల్లమెల్లగా అవి తీవ్రమై ఆమె మనసునీ, ఆలోచనలనీ ఆవరించుకోసాగాయి. ఆ ప్రశ్నలకు జవాబు దొరక్క చచ్చిపోవాలనిపించింది. కానీ చావంటే భయం. పైగా ఆత్మహత్య మహాపాపం అంటారు, దాంతో చచ్చినట్లు బతకటం వినా గత్యంతరం లేదనుకుంది. కనీసం తన జీవనశైలిలో వీలయిన మార్పులు చేసుకోవాలనుకుంది. మార్పువల్ల విసుగు తగ్గుతుంది. జీవితంలోకి మళ్ళీ ఉత్సాహం రావచ్చు

నైట్‌కి బుక్ చేసుకున్నా రెండో ఆటయ్యే సరికి విటుడు వెళ్ళిపోవలసిందే. అది వేశ్యా వ్యాపారంలోని అవగాహన. అలిఖిత వప్పందం. ఒంటిగంటకు రెండో ఆట అయిపోతుంది. సినిమాహాళ్ళు మూసేస్తారు. ఆమెకూడా ఠంచన్‌గా ఒంటిగంట అయ్యేసరికి విటుడ్ని తోలేసి... అప్పుడు స్నానం చేసి బట్టలు మార్చుకుని ఊరిబయటి నదికి బయలుదేరేది. అసలే అర్ధరాత్రి. ఆపైన స్త్రీ. అందులోనూ వేశ్య. నిర్జనమయిన రోడ్డుమీద ఒంటరిగా వెళ్తూంటే ఎదురుపడ్డ ఏ మగాడయినా వూరుకుంటాడా? అందుకే ఆమె జడని టోపీలోకి తోసేసేది. గుండె ఎత్తులు కనపడకుండా వదులయిన అంగరఖా... కాళ్ళకి మగవాళ్ళ పైజమా. ఏ

బీటు కానిస్టేబులో, రిక్షావాడో, మరెవరో పలకరించినా వారికనుమానం రాకుండా కంఠంలోకి కూడా మగతనం తెచ్చుకునేది. స్వరంలోకి బొంగురుతనం తెచ్చుకుని ఆమె మగవాడిలాగే మాట్లాడేది. అలా బయలుదేరేది అర్ధరాత్రి వ్యాహ్యాళికి.

అప్పటికి సన్నగానో దట్టంగానో మంచు పడుతుండేది. తారురోడ్లమీద మంచు పాదాలకు చల్లగా తగుల్తుంటే అదో హాయిగా ఉండేది. రోడ్లు నిర్జనంగా, నిద్రపోతూ, నిశ్శబ్దంగా ఉండేవి. అవి పడుకున్న నల్లపాముల్లా ఉండేవి. వీధిదీపాలు ఎందుకు ఎవరికోసం వెలుగుతున్నాయా అని ఆలోచనలలో పడ్డట్లు పరధ్యానంగా వెలిగేవి. గాలి చల్లగానూ స్వచ్ఛంగానూ వీచేది. ఆ అర్ధరాత్రి నడక... ఒంటరి నడక... చాలా యిష్టమైపోయి, అనతికాలంలోనే అలవాటయిపోయింది. విటులెప్పుడు పోతారా, వ్యాహ్యాళికి బయల్దేరుదామా అని తహతహలాడిపోయేది. వర్షం వస్తే గొడుగేసుకునయినాసరే వెళ్ళి వచ్చేది.

ఊరిచివర నది. నదిమీద వంతెన. ఆమె నివాసానికి అది రెండు కిలోమీటర్లదూరం. పైన వంతెన. కింద ఎక్కడో నది. అర్ధరాత్రి ఆ వంతెనమీద వాహనాల రాకపోకలట్టే ఉండేవి కావు. అటునుంచే కాక యింకా చాలాచోట్లనుంచి ఊళ్ళోకి రావడానికి మార్గాలూ, వంతెనలూ ఉన్నాయి. ఆ వంతెనమీద అర్ధరాత్రి చీకటిలో నిశ్శబ్దంలో నిలుచున్నా... లేదా కూర్చున్నా... నదిలో పారే నీటి గలగలలు. పగటిగోలలో ఆ గలగలలు వినిపించవు. రాత్రి నిశ్శబ్దంలోనే వినవచ్చే ఆ విశిష్ట సంగీతం. ఔను. అది ధ్వనికాదు సంగీతం. సమ్యక్ గీతం. దానిలో రాగం... భావం... లయ. మనిషి చెవులకి కాక మనసుకీ గుండెకీ ఆత్మకీ మాత్రమే అందేవీ అవగతమయ్యేవీ. ఆ వ్యాహ్యాళిలాగే ఆ సంగీతమూ మరో వ్యసనం. నిశీథిలో... ఏకాంతంలో... ప్రకృతిలో... నదీనాదాల రసాస్వాదన మరిగితే మరి మానలేనిదే.

ఆవేళ ఆరాత్రి కూడా అలాగే వెళ్ళిందామె అక్కడికి.

నదిమీది వంతెన రెయిలింగ్ నానుకుని కూర్చుంది చీకటిలో చీకటిగా కలిసిపోయి. నిలువునా నల్లని దుస్తులతో చీకటికద్దంపడుతున్నట్లుందామె.

అందుకే అతనామెను గమనించి ఉండడు. అతనామెకు పక్కగా వచ్చి అక్కడే నిలబడి వంతెనమీంచి తొంగిచూడసాగాడు.

అప్పటికే కొంతసేపటినుంచీ చీకట్లో ఉండడంవల్ల ఆమెకళ్ళు దానికలవాటుపడిపోయి చీకట్లో కూడా పరిసరాలను బాగానే పరికించగలుగుతున్నాయి.

ఎవరో యువకుడు ఇరవయ్యారో, ఏడో ఉంటుందేమో వయస్సు. అతనలా వంగీ తొంగీ నదిలోకి చూస్తూనే ఒక్కసారి బిగ్గరగా ఏడవసాగాడు. ఎంతసేపటినుంచో బిగబట్టుకుంటూ వస్తున్న దుఃఖాన్ని ఎంత మాత్రమూ ఆపుకోలేనట్లు.

"నన్నెందుకు పుట్టించావ్? పుట్టించావ్ సరే... ఎందుకు బతికించావ్. బతికించావ్ సరే... ఇప్పుడు నాకీ శిక్షేమిటి? చెప్పు. నేనే నేరం చేశానని యిలాంటి దారుణమైన శిక్ష విధించావ్? గాడ్! నువ్వొట్టి ఫూల్‌వి. దుర్మార్గుడివి. హృదయం లేనివాడివి. శాడిస్టువి. ఓ.కే. ఇదుగో నా పాతికేళ్ళ జీవితం. యౌవనం. తీసుకో. నీ పైశాచికానందాన్ని తీర్చుకో. రాస్కెల్" అంటూ అతను నదిలోకి ఉరకబోయాడు. అతని ప్రయత్నం ఆత్మహత్య చేసుకుందుకని అర్థంకాగానే ఆమె అందిన అతని కాలుపట్టుకుని లాగింది.

"ఎవరు మీరు? నన్నెందుకాపారు? " అడిగాడా మనిషి.

"మీరెవరు? ఎందుకాత్మహత్య చేసుకోబో




యారు?" పురుష కంఠంతో అడిగిందామె.

అతనొక్కసారి భోరున ఏడిచేశాడు. ఆమె చేతి తొడుగులు సర్దుకుంటూ కొంచెంసేప తన్ని ఏడవనిచ్చింది. నిప్పుతో వంటా చేసు కోవచ్చు, యిల్లూ తగలబెట్టుకోవచ్చన్నట్లు నిశీధి ఏకాంతంలోని నదిని తను ఆత్మని శాంతింపచేసుకుందుకు చేరగా యితను ఆత్మను హత్య చేసుకుందుకు చేరాడన్న మాట. ఔనూ... మనిషి చనిపోతే ఆత్మ అంటారు. ఆత్మ నాశనం లేనిదంటూ భగ వద్గీతలో శ్లోకమూ ఉంది. మరి ఆత్మ హత్యనే ప్రయోగమేమిటో?

"మిస్టర్... మీరెవరో కానీ నన్ను కాపాడి చాలా అపకారం చేశారు" అన్నాడతను నిందిస్తున్నట్లు. అతను తనని మగవాడిగా భావించడం మంచిదే అనుకుంటూ "ఏమీ?" అంది.

"లోకంనిండా శోకం. చితితో మాత్రమే అంతమయ్యే చింత. నా జీవితపు కఠోర సమస్యకి పరిష్కారం మృత్యువులోనే. నేను బతుకు పోరాటంలో చిత్తుగా చితికిపోయిన వాణ్ణి"

"భగ్నప్రేమా?"

"నా మొహానికి ప్రేమకూడానా?"

"నిరుద్యోగమా?"

"కాదు..."

"ఆప్తుల అకాలమరణమా?"

"ఆప్తులే లేని నిర్భాగ్యుణ్ణి"

"దుర్భర దారిద్ర్యమా?"

"పేదరికం నాకు కొత్తకాదు. అలవాటే... చిన్నప్పటినుంచీ"

"చూడబోతే మనం నేతి నేతి అను కుంటూ అనవసరంగా శ్రమపడుతున్న ట్లున్నాం. అసలు కారణం యిదీ అని చెప్పె య్యొచ్చుగా? ఇద్దరికీ సుఖం..."

"సరే. చెబుతాను. మీరూ మగవాళ్ళే కనుక నా బాధ మీకు బాగానే అర్థమౌ తుంది. కానీ అంతా విని నవ్వకూడదు. స్వేచ్ఛగా ఆత్మహత్య చేసుకోనివ్వాలి"

"మీ బాధ విని నవ్వననీ, చేతనైతే సాయం చేస్తాననీ వాగ్దానం చేస్తున్నాను. ఆత్మహత్య చేసుకోనివ్వడం గురించి యిప్పు డేమీ చెప్పలేను. ముందు మీ కథ చెప్పండి. దాన్నిబట్టి అవసరమైతే నేనూ చేయూతని స్తాను"

"నాది కథకాదు, తీరనివ్యథ. వేదన కాదు, అనంతరోదన" ఒక సారాగాడు. "వయసుకి పేదరికంతో పట్టింపుండదు. పూరిగుడిసెమీదా పాలరాతి భవనంమీదా నిష్పక్షపాతంగా వెన్నెల కురిసినట్లే పేదవా డికయినా ధనవంతుడికయినా ఒకేలా వస్తుంది వయసు. అలాగే వయస్సుతో పాటు వలపు భావనలూను" అలా మొదలు పెట్టాడతను తన కథ.

"ఔను కాలం పక్షపాతం చూపదు మృత్యువు లాగే"

"వాతావరణాన్ని బట్టి, వయసుని బట్టి స్వల్పమయిన వ్యత్యాసాలున్నా మగవాడిలో సాధారణంగా పధ్నాలుగూ పదిహేనూ నుంచి ప్రారంభమయ్యే యౌవనం పందొ మ్మిది నిండేసరికి బాగా వికసించి ఉద్ధృతం చెందుతుంది. అంటే ఊహలలో అధిక భాగం స్త్రీ ఆక్రమిస్తుంది. శారీరకంగానూ మానసికంగానూ మగవాడికి స్త్రీ అత్యవస రమూ తక్షణావసరమూ అనిపించడం మొదలౌతుంది. స్త్రీలో సౌందర్య దర్శనం కావడమూ, ఆమెని ముట్టుకోవాలనీ, కౌగ లించుకోవాలనీ కామభావనలు ప్రకోపించ డమూ అతన్ని స్థిమితం లేకుండానూ దేహ శాంతి, మనశ్శాంతి లేకుండానూ ఆవరించు కుంటాయి. ఇరవయ్యొచ్చేసరికి స్త్రీ శరీరం కోసం తపన మరింతౌతుంది. స్త్రీలేని జీవితం వృథా అనిపిస్తుంది. శరీరమూ

మనసూ కూడా చక్కగా వృద్ధి చెంది విక సించే వయసది. ప్రేమ, కామం, సౌందర్యా రాధన ఆ వయసుకి పరాకాష్ట చేరుతాయి"

ఆమె ఏమీ అనలేదు. మగవాడి జీవిత దశలలోని మనసు గురించి తనకేం తెలు సుగనుక.

"నా జీవన పరిస్థితినిబట్టి ఇరవయ్యేళ్ల వరకూ నాలో స్త్రీ గురించి వెంపర్లాట ఆరంభం కాలేదు. ఎవరూ లేని ఒంటరిని. చెడిపోడానికేనా ఈడు అయిన స్నేహితులు లేనివాణ్ణి. పెళ్లి చేసే వారంటూ పెద్దలు లేకపోడంతో పెళ్లనే ఊహా, ఆశా రెండూ లేకపోయాయి. అయితే ఒక అమ్మాయి పదిహేను పదహారేళ్లది. నాతో కొంచెం స్నేహంగా ఉండేది. అంచేతే కాబోలు నాకం టికి అందంగా కనిపించేది. స్నేహం ఎప్పుడూ సుందరమేకదా? రాత్రులు రకర కాల తియ్యని కలలు. నిద్రాభంగాలు... స్వప్నస్ఖలనాలు... భరించలేక స్త్రీ సాంగత్యం లేకనే అలాటి అవలక్షణాలు పొడసూపుతున్నాయనీ, అదో జబ్బనీ భయ పడి ఆ రాత్రి నేనొక నిశ్చయానికి వచ్చే శాను. తీవ్రమయిన నిర్ణయం తీసుకున్నాను"

"ఏమని? "

"ఎలాగైనా సరే ఆమెను రేపడిగెయ్యాలి ముద్దు పెట్టుకోనిస్తుందేమో అని, కౌగలించు కోనా అని, సుఖపెడతావా దేవతా... అని. ఆమె అందుకు ఆపాటి డబ్బడిగినా నా దగ్గర సిద్ధంగానే ఉంచుకున్నాను కనుక ఫర వాలేదు. నిజానికి నా మనసులో అవేకాక ఇంకా ఎన్నెన్నో కోరికలు పిచ్చివీ మంచివీ కూడా"

"ఏమిటవి"

"మగవాడివి కనక సిగ్గుపడకుండా చెబు తున్నాను. నాకు స్త్రీని నగ్నంగా చూడాలని పిచ్చి కోరిక. ఒంటిమీద బట్టలేకుండా స్నానం చేస్తుంటే ఆమె సౌందర్యాన్ని తనివి తీరా కాంక్షించాలనీ, స్త్రీ సౌందర్య రహస్యా లని తరచి తరచి చూడాలనీ... అలాటి ప్రగాఢ వాంఛలు. ఇక నేను తట్టుకోలేకపో తున్నాను. గుండెల్లో నిప్పుల కొలిమి పెట్టి నట్లు వొళ్లంతా ఎప్పుడూ వేడే. సెగలూ పొగలే. నరాలేమో తీపు. ఒంటినిండా మద నతాపం. మనసు సంగతి సరేసరి. అదో ఊహల ఉయ్యాలా, కోర్కెల గయ్యాళీను. నాకే తెలుసు నా జబ్బుకి వైద్యమేమిటో, పరిష్కారమేమిటో. నాలోని అగ్ని పర్వ తాన్ని చల్లార్చగలిగినది స్త్రీ మాత్రమే. నా మోహకీలలకీ కాంక్షాజ్వాలలకీ స్వాంతన ప్రసాదించగలిగింది స్త్రీ దేవతా, ఆమె స్పర్శా, ఆమె ముద్దూ, ఆమె కౌగిలీ, ఆమె నగ్న సౌందర్య దర్శనాలే"

"ఇక చాలు నేను బాగానే అర్థం చేసుకు న్నాను"

"తెల్లవారగానే అంటే మర్నాడే నివృత్తి మార్గమవలంబించుకుందుకు నిశ్చయించుకు న్నాను"

"ఊఁ"

"తెల్లవారి లేచి నా జీవనోపాధికై బయ లుదేరుతూ అద్దంలో చూసుకునేసరికి నా ప్రయత్నం లేకుండానే నా నోటివెంట పెను కేక. ఏమయిందంటూ పరుగెత్తుకొచ్చారు నాయరూ, అయ్యరూ"

"ఏమైంది? "

"మచ్చలు... నా ముఖం మీద నల్లగా మచ్చలు అసహ్యంగా మచ్చలు. భయంక రంగా పాము పొడల్లా మచ్చలు. అంటూ ఏడిచేశాను. వాళ్లు నా ముఖం చూసి "ఓస్ దీనికేనా? ఏమీకాదు. దీనిని శోభి అంటారు. వయసుకళకొద్దీ యౌవనంలో వస్తాయి. మొటిమల్లాగే. ఇవెన్నాళ్లో ఉండవు. తెల్లశోభి తెల్లమచ్చలు. నల్లశోభి నల్లమచ్చలు. తులసి ఆకులు రసం పిండి రాయి. అవేపోతాయి. అనవసరంగా కంగా

రు పెట్టేశావ్ అన్నాడు నాయరు. అయ్యరు కూడా నవ్వుతూ వెళ్లిపోయాడు. నేనయితే దుఃఖం పట్టలేకపోతున్నాను. నా సమస్య వాళ్లకేం పడుతుంది? నా మొఖం నాకే అసహ్యంగా ఉందే. ఈ మచ్చలతో నా స్నేహితురాలి దగ్గరకెలా వెళ్లేది? ఆమెనెలా అడిగేది? నాకే భయంకరంగా ఉన్న నా మొహాన్ని ఆమెకెలా చూపేది? ఈ మచ్చలు తగ్గేవరకూ చచ్చినట్లు ఆగాల్సిందే.

"ఔను అంతకంటే మరో మార్గమేముంది?" అందామె సానుభూతి చూపుతున్నట్లు.

"కెరటాలాగేక స్నానం చేద్దామనుకున్నాడట సముద్ర స్నానానికెళ్లిన ఒకడు. సముద్రంలోని కెరటాలని చూస్తూ" అతని గొంతునిండా విషాదమే. గతం తలుచుకుంటూ.

"పిచ్చివాడు పిరికివాడు. సముద్రంలో కెరటాలాగేదెప్పటికి?" నవ్విందామె.

"రెండు, మూడు, నాలుగు రోజులయినా ఆ మచ్చలు తగ్గలేదు సరికదా మరింత దట్టమూ నలుపూ అయ్యాయి. ముఖం మీంచి కిందకి మెడమీదకి కూడా పాకాయి. ఆ అమ్మాయికే కాదు, ఎవరికి ముఖం చూపాలన్నా సిగ్గు పడవలసిన పరిస్థితొచ్చేసింది"

"ఆ అమ్మాయిని ప్రేమించావా?"

"పేదవాళ్లకి ప్రేమ కూడానా! ఆమె అని కాదు. ఎవరో ఒక అమ్మాయి. నాకంటికి నదురుగానూ కుదురుగానూ కనిపించేది. నా కోర్కెల జాబితాను తీర్చేదీ, నాకందుబాటులో ఉండేదీ. అంతే. స్త్రీ శరీరమూ ఆ సౌందర్యమే తప్ప ఆమె మనసూ ఆంతర్యమూ కోరుకునేంత పరిణతి రాలేదేమో నాలోకింకా. నా కలలూ కోరికలూ స్త్రీ మీదే"

"క్షణిక కామానికి కూడా ప్రేమ ముద్రని వేసేస్తున్న ఈ రోజుల్లో నువ్వెంత నిజాయితీగా చెప్పావనీ! ఊ"

"గచ్చాకు పుచ్చాకు వైద్యాలయ్యాయి. అవి పనిచేయవని తేలిపోయింది. నాకొచ్చిన మచ్చలు మొండివని తెలిసిపోయింది. గట్టి వైద్యం అంటే ఇంగ్లీష్‌వైద్యం చేయించాల్సిందే. విచిత్రమేమిటంటే శరీరంమీద అసహ్యంగా ఆ మచ్చలు వచ్చాయి తప్ప నా ఆరోగ్యం మరేవిధంగానూ చెడలేదు. అంటే నా అందమే చెడింది తప్ప ఆరోగ్యం ఏమాత్రమూ పాడవలేదు. ఆరోగ్యమంటే యౌవనమూ తత్సహజమయిన భావనలూ అవీ"

"ఐతే నీకొచ్చినది ప్రధానంగా కాస్మొటిక్ ప్రాబ్లమే అన్నమాట"

"ఏదో ఒకటి నా ప్రాణం తియ్యడానికి. నాది పచ్చని రంగేమో నా ఒంటిమీద ఆ మచ్చలు మరీ కొట్టొచ్చినట్లు అసహ్యంగా కనపడసాగాయి"

"మరేం చేశావ్?"

"చుట్టమై చూడొచ్చి దెయ్యమై పట్టుకుందన్నట్లు నాకు వచ్చిన చర్మవ్యాధి నాల్రోజులు నా ఒంటిమీదుండి వెళ్లక స్థిరనివాసం ఏర్పరిచేసుకుంది. దాంతో నేను రెండింటికీ చెడ్డ రేవడినయ్యాను"

"అంటే?"

"నా జీవనోపాధి నలుగురిలోకీ వెళ్లి మాత్రమే సంపాదించగలిగింది. వీధుల్లో పాటలు పాడుకు బతికే వాడిని. ఈ మచ్చల ముఖం పెట్టుకుని నలుగురిలోకి వెళ్లి పాడబోతే వాళ్లు పాట వినడం మాటటుంచి నా ముఖం చూస్తూనే పారిపోవచ్చు"

"నిజమే పాటకీ రూపానికీ గాత్రానికీ ముఖానికీ సంబంధం లేకపోయినా ముఖం బాగుండని వారి పాటకి మెప్పు దొరకడం కష్టం. అందులోనూ నీది మామూలుగా ముఖం బాగుండకపోడంకాదు. చర్మవ్యాధి. అది అంటువ్యాధని కూడా జడిసి దూరంగా

పరుగెడతారు ప్రజలు"

"నా వ్యాధి అంటువ్యాధికాదు. అదొక్కటే గుడ్డిలో మెల్ల. అదే అంటువ్యాధయితే నాకు ఉండేందుకావాసం కూడా ఉండకపోను. అది అంటువ్యాధి కాదని చెప్పిన డాక్టరుకీ అతని మాటలను నమ్మినందుకు నాయర్, అయ్యర్‌లకీ నేను కృతజ్ఞుడినయ్యుండాలి"

"అదిసరే... రెండిటికీ చెడిన రేవడి వయ్యానన్నావ్? "

"ప్రజల మధ్యకి వెళ్లి పాటలు పాడడానికి ముఖం చెల్లకపోడంతో ఆ ఆదాయం తగ్గి పోయింది. రాత్రులు అంటే చీకటిపడ్డాక ముఖం కనిపించదుకనుక పాడేవాడిని. కాని అప్పుడు రోడ్లమీద జనం అట్టే ఉండరు. ఐతే సినిమాలకో లేకపోతే ఇళ్లకో పోతారు. పైగా చీకటిపడ్డాక ధర్మం చెయ్య కూడదని కొందరికి పట్టింపు. నిజానికి నేన డుక్కునే వాడినీకాను. నాకు చేసేది ధర్మమూ కాదు. ఎందుకంటే నేను పాడ తాను. వారు నా తియ్యని పాటవిన్నందుకు ప్రతిఫలం చెల్లిస్తారు. గానమిచ్చి డబ్బులు పుచ్చుకుంటాను. ఈ మచ్చలొచ్చాక ముఖా నికి ముసుగేసుకుని పాడబోయాను. అదో వెరైటీగా ప్రజలు భావిస్తారేమో అని. కానీ వాళ్లకు నా ముసుగు పాట నచ్చలేదు. పైగా పిల్లలు బూచిబూచి అంటూ వెంట పడి రాళ్లు విసిరే వారు కూడా. దాంతో అది విరమించుకున్నాను. అలా నా ఆదా యానికి కన్నంపడింది. ఇది ఒకవేపు"

"రెండోవేపు"

"ఆ డాక్టరు ఇంగ్లీషు డాక్టరు వారానికో సారి వచ్చి కనిపించమనేవాడు. దేముడి దగ్గరకి వట్టి చేతులతో వెళ్లినా ధర్మదర్శనం కావొచ్చునేమోకాని ఇంగ్లీషు డాక్టరు దగ్గరకి కన్‌సల్టింగ్ ఫీస్ పట్టుకెళ్లకుండా వెడితే గెటౌటేగా? వారానికి పాతిక చొప్పున ముడుపు చెల్లించేవాణ్ణి.

"పేదవాడివైన నీ దగ్గరకూడా"

"పేదవాడిని కాబట్టే పాతికట. లేకపోతే యాభయ్యట. నిజమైన కష్టం అది కానే కాదు"

"మరేమిటి? "

"ఆయన నేను వెళ్లినప్పుడల్లా చేంతాడంత మందుల జాబితా రాసేవాడు వాళ్ల దుకా ణంలోనే కొనమని. శెట్టిశేరూ, లింగం పది శేర్లూ అన్నట్లు డాక్టరు ఫీజు పాతికైతే మందులకి వంద! అసలు కంటే వడ్డీ ఎక్కు వంటే ఇదే కాబోలు"

"ఆ అదే... నీ వ్యాధి ఖర్చు నెలకి అయి దొందలు. నీ ప్రాణానికి చాలా ఎక్కువే"

"అసలు బాధ... నిజమయిన బాధ. అదే నా స్త్రీ కామన. అదే నన్ను వేధించీ వేపు కునీ తినేసేది. ఈ మచ్చలెప్పుడు చచ్చేను? నేనెప్పుడు అమ్మాయిని చేరగలను? నా ఆత్రుతంతా దీని గురించే. ఆరోగ్యవంతమ యిన యౌవనం తెగబాధపెట్టేసేది. పరిపరి విధాల ప్రాణాలు తీస్తుండేది"

"సహజమే. అందుకే ఏ వయసుకా కళ అన్నారు పెద్దలు"

"నాకు విసుగూ ఏడుపూ వచ్చేస్తున్నాయి. నా సహనం నశించిపోతోంది. ఓపిక చచ్చి పోతోంది. ఓర్పు అంతరించిపోతోంది

ఆవేళ డాక్టరు ముందు భోరున ఏడి చాను. నాలుగు నెలలనుంచీ మీ చుట్టూ తిరుగుతున్నాను. మచ్చలు వన్నెయినా తగ్గ లేదు. రంగయినా మాయలేదు. ఎన్నా ళ్లిలా? అని"

"చూడునాయనా! రుణాలూ చర్మవ్యా ధులూ ఒకింతట పోవని ఆర్యోక్తి. అది అక్ష రసత్యం. అప్పు ఒక పట్టాన తీరదు. చర్మ వ్యాధి ఓ పట్టాన తగ్గదు. వీటి విషయా లలో మానవులు గుండె నిబ్బరం తెచ్చుకుని నిదానమే ప్రధానం, అనుకోవాలి. మందులు పనిచేయలేదనుకోకు. కొత్త మచ్చలు రాకుండా నారాయణ కవచాన్ని అడ్డువే సింది ఈ మందులే. మందులు వాడడమే




నీ కర్తవ్యం. గీతలో కృష్ణ పరమాత్ముడేం చెప్పాడు? కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన. మనం నిమిత్తమాత్రులం బిడ్డా. వెళ్లిరా" అనేశాడు.

గుడ్డివాళ్ల రాజ్యంలో ఒంటికంటివాడే మహారాజయినట్లు ఈ వూళ్లో గొప్ప స్కిన్ స్పెషలిస్టాయనే. మరెవరి దగ్గరకి వెళ్లను?

డాక్టరు లోపంకాదు. నా కర్మ కొద్దీ మాత్రమే నా మచ్చలు తగ్గడంలేదు.

ఆత్మనాశనం లేనిదీ, అగ్నిచే దహించబడ నిదీ, శస్త్రములచే ఛేదించబడనిదీ వగైరాల వునో కాదో నాకు తెలియదుకానీ నా ముఖంమీద మచ్చలు మాత్రం మా డాక్టరు మందులచే లొంగదీయబడనివీ, ఆయింట్ మెంట్లచే అంతరించనివీ అని మాత్రం అర్థ మైపోతోంది. దమ్మిడీకోతి ఏగానీ కల్లు తాగి నట్లు ఈ మచ్చలు నా డబ్బునీ, కార్యకలా పాలనీ, మనశ్శాంతినీ, భవిష్య ప్రణాళికలనీ, సరదాలనీ, ముచ్చట్లనీ, కూతుహలాన్నీ ఎన్నో విధాల తినేస్తున్నాయి. ఈ మచ్చలే రాకపోతే ఈ పాటికి నేను స్త్రీ అనే రహ స్యాన్ని ఛేదించేసి ఉందును"

"ఔను"

"ఉరకలు వేసే వయసునీ ఉప్పొంగే వల పునీ ఆనకట్టలు వేసి ఆపగలగడం అసా ధ్యమే. కానీ ఏంచేయగలను? ఈమచ్చలు నా ఇచ్ఛలన్నిటికీ అడ్డుపడిపోతున్నాయి కదా? రావణాసురుడి కాష్టమేనా ఆరుతుం దేమోకాని ఈ మచ్చలు మాత్రం అంతర్ధాన మయ్యేట్లులేవు. మందులదారి మందులదే, మచ్చలదారి మచ్చలదే. కోపమొచ్చేస్తోంది నాకు నా మచ్చలమీదా నా మీదా కూడా. నాకూ స్త్రీకీ మధ్య సైంధవుడిలా అడ్డుప డ్డాయి కదా ఈ స్కార్స్"

ఆశ్చర్యంగా అడిగిందామె. "నీకిన్ని సామె తలు, ఇంత భాషా ఎలా తెలుసు? "

"కొద్దిపాటి చదువు. ఆపైన ఎక్కువగా రకరకాల మనుషులతో తిరగడమూ మాట్లా డడమూ. నాకు కొంచెం తమిళమూ, మళ యాళమూ కూడా తెలుసు. అందని ద్రాక్షలు మరీ తీయనన్నట్లు నాకు స్త్రీ పట్ల రాగమూ, మోహమూ, కాంక్షా, కుతూహ లమూ మరింతగా పెరగసాగాయి. తీరని కొద్దీ ఊరిస్తుందికదా కోరిక? స్త్రీపట్ల నాలో రేగి రగులుతున్న ఈ కాంక్ష ఎంత తీవ్రం కాసాగిందంటే నాకు పిచ్చెక్కిపోయేది. ఆరు నెలల పాపనేకానీ అరవయ్యేళ్ల ముసలిదా న్నేకాని నగ్నంచేసి చూసి కసితీరా అనుభ వించేసి ఆనందించేసి, అంత అవసరమైతే అప్పుడు ఆ స్త్రీని చంపేద్దామనిపించేది. పచ్చకామెర్ల వాడికి లోకమంతా పచ్చగానే కనిపించినట్లు కామరోగికి ఏవయసుద యినా స్త్రీగానే కనిపిస్తుందేమో మరి"

"శరీరంలో ఏవయసులో జనించే సహజ మయిన కోర్కెలా తరుణంలో తీరకపోతే బుద్ధి ఇలాగే అసహజమయిన మార్గాలు, పెడదార్లూ పడుతుంది. నేరం నీదికాదు. అంతగా ఆగలేనప్పుడు ఏ వేశ్యవద్దకేనా పోలేకపోయావా? "

"ఆ ప్రయత్నమూ చేశాను. డబ్బు కూడా జయించలేని అసహ్యం వంటివి కొన్నుండి పోయాయేమో మనుషులలో. నా ముఖం చూడడమేమిటి, కెవ్వునకేక కాలికొద్దీ పరుగు. ఒక్కసారిలా జరిగేసరికే అవ మానమనిపించింది. ఇప్పుడు నేను చెబు తూంటే మీరు నమ్మలేకపోవచ్చుకానీ నిజంగా ఈ మచ్చలే లేకపోతే నేనెంత అందమైన వాడినో. అప్పుడు ఎందరు సుందరాంగులు తమ హృదయాలని మాల గుచ్చి నా మెడలో వేసేవారో. ఎందరు నా కౌగిలికీ ముద్దుకీ తపించిపోయేవారో సరే చచ్చినాడి కళ్లు చారెడేసి. వేశ్యని మోసంచే యొచ్చు. గదిలోకి రాగానే **దీపం ఆర్పేమనీ, ఆ చీకట్లోనే నా ముఖం మీద ముసుగుతీసీ**

"ఇకనేం? "



"మోసం చేయడం కంటే నీచం మరొక టుండదు నాకు. ఒకసారొకర్ని మోసం చేస్తే తరువాత జీవితాంతమూ అంతరాత్మ ముందు దోషిలా నిలబడాలి. అదెంత శిక్షని! వేశ్యామనిషే. ఆమె ఇష్టాయిష్టాలూ సహ్యాసహ్యాలూ ఆమెవి. నాగోడు విసుగు తెప్పిస్తోందేమో మీకు? త్వరగా ముగించే సేదా? "

"విసుగు కాదుకానీ జాలితో హృదయం ఆర్ద్రమైపోతోంది. వినలేనంత బాధాకరంగా ఉంది మీ గాథ. మీ బాధలాటి చిత్ర విచిత్రమూ దారుణమూ విభిన్నమూ వినూత్నమూ అయిన గాథ ఎవరికీ ఉండదేమో. మీది సరికొత్త సమస్యేకాదు, అతి జటిలమయిందీని. మీ మానసిక పరిస్థితి నాకు బాగానే విశదమయింది మీ మాటలతో. వీలయినంత వేగంగా క్లయిమాక్స్ చెప్పెయ్యండి"

"ఒంటరిగా గదిలో నా ముఖం చూసుకుందుకు అసహ్యించుకుంటూ నా ప్రాణమూ ప్రాణాధారమూ అయిన పాటలు పాడుకోడంతో చేదు బతుకునీ బతుకులో చేదునీ మరచిపోవాలని ఎస్కేపిస్ట్‌లా విఫల యత్నాలు చేస్తూ ఇంకేమీ చేయలేకా చేత కాకా ఆంజనేయుడిలాటి బ్రహ్మచారి దేముణ్ణి ధ్యానించుతూ, చన్నీటి స్నానాలు చేస్తూ రోజులు, నెలలు, సంవత్సరం పైబడి పోయింది.

ఈ మచ్చలు తగ్గవుకాక తగ్గవు. ఈ బాధ తీరదుకాక తీరదు. పుట్టుక వ్యర్థంగాక వ్యర్థం. నేను బతకలేనుగాక బతకలేను. నేను చచ్చిపోతానుగాక చచ్చిపోతాను అనుకొంటూండగా నేను అద్దెకుండే అయ్యరింటి కామధ్యో చుట్టమొచ్చాడు. అతను మద్రాసులో ఇటువంటి మచ్చలని మూలికా వైద్యంతో బాగు చేసే వైద్యుడున్నాడనీ, తన బంధువొకడలా బాగుచేయించుకున్నాడనీ చెప్పి ఆ వైద్యుడి అడ్రసు కూడా ఇచ్చాడు. నా జేబులోనే ఉందది. కాని నాకు ఆశలేదు నేను చస్తాను"

"నిన్ను చావునుంచి బతుకువేపు తిప్పగలదేది? ఏ ధర్మాత్ములేనా దయతో నీక్కావలసినంత డబ్బిస్తే మద్రాసు వెళ్లి ఆ వైద్యమేదో ప్రయత్నించి చూస్తావా? "

"ఉహుఁ నన్ను బతుకువేపు మళ్లించగలదొక్కటే. అదయితేనే మళ్లీ నాలోకి ఊపిరీ, ఉత్సాహమూ, జవమూ జీవమూ, ఆశా కోరికా వస్తాయి"

"ఏమిటది? "

"ఇంకేమిటి? రామాయణమంతా విని రాముడికి సీతేమౌతుందని అడిగినట్లే అడిగావ్. స్త్రీ! ఒక స్త్రీ... వయసులో ఉన్నది. నా ముందు తన దివ్య సౌందర్యం ప్రదర్శించాలి. నిలువుదోపిడి ఇవ్వాలి. నా ముఖాన్నీ మచ్చలనీ చూసి బెదరకూడదు. అసహ్యించుకోకూడదు"

"చాలు అర్థమయింది. ఆల్ రైట్ లే" అందామె చాలా ఆలోచించే ఆ మాటలన్నట్లు.

అతను తెల్లబోయినట్లన్నాడు. "ఎక్కడికి? నా పరిస్థితిలో నా కోరిక ఎంత అసాధ్యమో తెలియలేదా? నన్ను హాయిగా చావనివ్వవా? "

"నా ఈ ఒక్క ప్రయత్నం చెయ్యనివ్వు. నాకొక్క అవకాశమివ్వు. అంత మాత్రాన నీకు పోయేదేముంది? మహా అయితే ఆత్మహత్య మరో రోజు ఆలస్యమవుతుందంతేగా"

"ప్రయత్నమంటే కొండని ఈకతో లాగబోడమే"

"ఓ వెంట్రుక తెగినా పోయినా పోయేదేమీలేదు. లే. ఇప్పటికే కాలాతీతమయింది" అంటూ ముందు తను లేచింది అతని చేయి విడవకుండానే.




“మిస్టర్... అనవసరపు శ్రమ”

“శ్రమయే ఆనందం... శ్రమయే గౌరవం’

“ఏమిటి నీ ఆశ? ”

“బాహ్యసౌందర్యాన్ని కాక అంతస్సౌందర్యాన్ని చూడగల స్త్రీ ఒకరేనా ఉండరా అని”

అతనొక్కసారి భళ్లున నవ్వేశాడు. తెరలు తెరలుగా నవ్వాడు. తెచ్చుకు తెచ్చుకు నవ్వాడు. నవ్వి... “బాహ్యసౌందర్యం... అంతస్సౌందర్య... కవిత్వం... కథల్లోకి తప్ప అక్కడినుంచి చచ్చినా వాస్తవ జీవితాలలోకి రానే రాలేనీ వ్యర్థ కవిత్వం. అమ్మాయికి కొంచెం అందం తక్కువైతే పెళ్లవని ఈ రోజుల్లో ఆత్మ సౌందర్యం! వహ్వా! ఎంత అమాయకుడివి మిస్టరూ నువ్వు!” అన్నాడు.

“విపులాచ పృథ్వీ... ఏ పుట్టలో ఏ పాముందో తెలియనట్లే ఏ చిప్పలో ఏ ముత్యముందో కూడా ముందు తెలియనిదే ఇక మాట్లాడకు పద”

“సరే ఎక్కడికి? ”

“నాతోరా”

గ్లవ్స్ వేసుకోడంవల్ల ఆమె చేతులు అతనికేమీ తెలియడంలేదు.

ఆ నిశీధిలో చీకట్లో ఇద్దరూ పూరివేపు నడవసాగారు.



“నాకైతే ఆశలేదు” అన్నాడతను నడుస్తూనే.

“నాకైతే ఆశ ఉంది” అందామె అతని పక్కనే నడుస్తూ, “ఐతే ఒక అనుమానమూ ఉంది”

“ఏమిటీ? ”

“ఆమె ఒక్కసారికే అంగీకరించవచ్చు”

“ఒక్క అనుభవమయినా చాలు. గుండెల్లో పదిలపరచుకుంటాను”

“అనుభవం అందిందే అనుకో బతుకుతావా? ”

“ప్రామిస్.. ఎలాగోలా మద్రాసువెళ్తాను. మచ్చలు మాపుకుందుకు ప్రయత్నిస్తాను”

“సరే అదే చెబుతానామెనొప్పించేందుకు. ఒక జీవితం నిలబెట్టిన దానవౌతావంటే ఆమె అంగీకరించొచ్చు”

“అలాగే జరిగితే ఆమె మానవాతీతురాలే. దేవతే”

చిత్ర తీవ్రంగా ఆలోచించసాగింది. కురుస్తున్న సన్నని మంచూ, వీస్తున్నగాలీ, వేస్తున్న చలీ ఏవీ ఆమెకు తెలియడంలేదు ఆలోచనల తీవ్రతలో.

పరోపకారార్థ మిదం శరీరం అన్నారు. అలాటి అవకాశం రావడమే అరుదు, తన లాటి క్షుద్రజీవితం గడిపే వేశ్యకి. కొన్ని నిముషాలు సహించగలిగితే ఒక జీవితం నిలబడుతుంది. పోతే అందమూ, అసహ్యమూ బ్యూటీ యీజ్ స్కిన్ డీప్ అన్నారు. స్పర్శ కూడా చర్మం వరకే. మనోనిగ్రహం తను ఎలాగూ అభ్యసిస్తోంది. కొన్ని నిముషాలు శరీరాన్నీ మనసునీ చర్యలనీ స్వాధీనంలో ఉంచుకోలేదూ? ఎంత అందమయిన శుభ్రమయిన ఆరోగ్యవంతమయిన మానవ చర్మం కిందనేనా ఉండేవి జుగుప్సకలిగించే రక్తమాంసాలూ ఎముకలే. అసహ్యాకరమయిన మలమూత్రాలకూ చీముకీ నిలయం దేహమే. లోపల ఇంత దుర్భరాన్ని పెట్టుకున్న మనుషులు పైన చూసి ఎందుకూ అంత స్పందించడం? ఆ మాటకొస్తే డాక్టర్లూ నర్సులూ అలా[illegible]రోగులనెంతో ఆప్యాయంగానూ దయగానూ ట్రీట్ చెయ్యడం లేదూ? షిర్డీశాయి వంటి మహానుభావులు ప్రపంచంలో అసహ్యించుకో దగినదేమీ లేదని బోధించలేదూ? అంటనయినా అంటని మచ్చలకోసం ఒక

జీవిని అతని సహజవాంఛలనుంచీ ప్రకృతి ధర్మమైన సుఖంనుంచీ ఎందుకు వంచిం చాలీ? ఈ క్షుద్ర అశాశ్వత శరీరం గురించి పట్టింపులూ తాపత్రయాలూ దేనికీ? ఎప్పుడు హంసెగిరిపోతుందో తెలియని ఈ కట్టె మీద వ్యామోహమూ మమకారమూ ఎందుకూ?

"నా చిరకాల వాంఛే తీరితే నీ మేలూ ఆ దేవత మేలూ ఎన్నటికీ మరువను. జీవి తాంతమూ రుణపడి కృతజ్ఞుడినయి వుంటాను"

"అంతంత పెద్ద మాటలొద్దులే"

ఇల్లొచ్చేసింది.

వీళ్లిద్దరూ మెట్లెక్కుతున్న అలికిడికి కాబోలు లోపలినుంచి "చిత్రా"అంది మాణిక్యం

"నేనే తలుపుతియ్"

అతన్ని ముందు గదిలో కూర్చోబెట్టి ఆమె లోపలికి వెళ్లింది. వేషం మార్చి కొంచెం అలంకరణ చేసుకుని మళ్లీ ఆమె విటులగది లోకి వచ్చింది. పెద్ద దీపం వేసింది.

అతను తుళ్లిపడి చూశాడు "మీరు... మీరు"

"మిమ్మల్నిక్కడికి తీసుకొచ్చిన వారి ద్వారా" ఒక్కసారి విరామం తీసుకుని అందామె.

"నాకంతా తెలుసు. వేశ్య కూడా స్త్రీయే అని మీరంగీకరించగలిగితే..." అంటూ అతని ముసుగూ తన వస్త్రాలూ తీసేసింది. "నేను మీకోర్కె తీర్చడానికే సిద్ధమై వచ్చాను. మీరు మీ మచ్చల గుఱించి కాని మరెందు గురించి కాని సిగ్గూ సంకోచమూ పడక్కర్లేదు. నిలువుదోపిడీ ఇచ్చేందుకు నేను సిద్ధమే. ఐదు గంటలు కొట్టేవరకూ నేను త్రికరణ శుద్ధిగా మీదాన్ని. మీ చర్మ వ్యాధి అసహ్యకరమేమోకాని అపాయక రమూ, అంటువ్యాధీ కాదటగా? నాక సహ్యం తక్కువ" అంటూనే అతని బుగ్గల మీద ముద్దుపెట్టుకుంది.

దేవతలు అడుగుపెట్టడానికే భయపడే చోట రాక్షసులు నాట్యాలు చేస్తారన్నట్లు ఇతరులు చూడడానికే ఇచ్ఛగించని అతని మచ్చల ముఖాన్ని ఆమె ప్రేమగా ముద్దుపె ట్టుకోడం! అతన్ని బిగియార కౌగలించు కోడం.

దాంతో అతనికి ధైర్యమూ, చొరవా, చనువూ వచ్చేశాయి. జంకూ సంకోచమూ వీడిపోయాయి. విజృంభించేశాడు. ఆమె అతనికి పూర్తిగా సహకరించింది. లాలిం చింది. స్వర్గం చూపింది, సౌందర్యం ప్రద ర్శించింది. సుఖాల అంచువరకూ తీసుకె ళ్లింది. అతను తనివితీరా ఆ శృంగార లహ రిలో ఓలలాడాడు. చూడాలనుకున్న అందా లన్నీ చూసేశాడు.

ముద్దులూ మురిపాలూ తీర్చుకున్నాడు. వ్యవధి ముగిసింది. ఆమె దుస్తులు ధరించే సింది.

"దేవతా! నీ రుణం ఎలా తీర్చుకునేది? " ఆమె పాదాలమీద పడి ఏడిచేశాడతను.

"అన్ని విధాలా ప్రయోజకులయి" నవ్వి "వెళ్లండిక" అంది.

"నాకింత మహోపకారం చేసిన ఆయనకి చెప్పొద్దూ? "

"నేను చెబుతాలెండి. త్వరగా వెళ్లండి. గుడ్‌లక్"

అతను వెళ్లలేక వెళ్లలేక వెళ్లాడు. వీధి మలుపు తిరిగేవరకూ వెనక్కి చూసు కుంటూ. ఆమెలోపలికి రావడమేమిటి, "ఎవరు చిత్రమ్మా? " అడిగింది మాణిక్యం.

అప్పుడు తెలిసిందామెకు తను చేసిన పొరపాటు. అతని పేరడగలేదు, ఊరడగ లేదు. అదీ మంచిదేనేమో. తను చేసింది శృంగార దానం. ఆ దానంలో దాతల పేరూ గ్రహీత పేరూ తెలియక పోడమే




మంచిదేమో ఒక్కొక్కప్పుడు. నిష్కామ కర్మలా ప్రతిఫలాపేక్ష రహితమైన శృంగార దానం చేసే యోగం కలిగింది తనకి. అందుకు సంతోషించి వూరుకుంటే సరి.

"అవన్నీ ఇప్పుడెందుకులే. నాకు నిద్ర వస్తోంది"

"ఆరోగ్యం జాగ్రత్తమ్మా. వేళాపాళా లేకుండా వృత్తి చెయ్యడం ఒంటికి మంచిది కాదు. పక్కవేసే ఉంది. వెళ్లిపడుకో"

చిత్ర లోపలికి నడిచింది.

ఉదయం మెలకువ వచ్చాక కూడా ఆమె ఎప్పటిలా మంచందిగలేదు. హఠాత్తుగా రాత్రి జరిగినది ఆమెకు జ్ఞాపకం వచ్చింది.

అది నిజంగా జరిగిందా? లేక కలా?

ఒక నిముషంపాటు సందేహంలో పడిపోయిందామె. కాని ఆమె తనంతటతానే ఆ సందేహం నుంచి బయటపడింది మెల్లగా.

తనకి ఎంత మంచి అవకాశం లభించింది! ఒక మనిషి ఆర్తి తీర్చగలిగే అద్భుతావకాశం. ఒక జీవితాన్ని నిలబెట్టగలిగే అమూల్యమైన అవకాశం.

పరోపకారార్థమిదం శరీరం అని ఆర్యోక్తి. ఇతరులకు ఉపకారం చేసే సువర్ణావకాశం అందరికీ రాదు. అందుకూ ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి. తనకి అలాటి అవకాశం వచ్చింది. తను దానిని సద్వినియోగం చేసుకుంది.

తన జన్మసార్థకమైంది. తన జీవితం సఫలమయింది. తన వేశ్యావతారం దాని ఫలితాన్ని సాధించింది. ఇంక తనేమైపోయినా ఫరవాలేదు. తను తృప్తిపడేందుకు తన జీవితంలోనూ ఒక మంచి పనుంది.

"చిత్రా!" మాణిక్యం పిలుపు.

"ఊఁ" ఆలోచనలలోనే గొణిగింది.

"బద్ధకంగా ఉందా? టీ తెచ్చేదా? రాత్రులు ఆ షికారు మానమంటే మానవు. జలుబు చేసిందో ఏమో. పైగా ఎప్పుడూ లేనిది వేళకాని వేళ అతనెవరితోనో పడక చేశావాయే. జ్వరం కాని రాలేదుకదా? " అంటూ ఆమె నుదుటిమీద చెయ్యివేసి చూసింది.

తన పట్ల మాణిక్యానికుండే శ్రద్ధకీ అభిమానానికీ ఆమె హృదయం ఆర్ద్రమయింది. కనకపోతేనే, పెంచకపోతేనేం ఈమె ఎంత మంచి అమ్మ!

"దేముడి దయవల్ల జ్వరం రాలేదులే. అయినా మిరియం వేసిన టీ కాచి తెస్తాను ఒంట్లోని నలతపోతుంది. ముఖం కడుక్కు వచ్చినా సరే లేదా టీ తాగాక ముఖం కడుకున్నా నీ ఇష్టం" అంటూ ఆమె వంటింట్లోకి వెళ్లిపోయింది. చెప్పినట్లే మంచి మిరియం, అల్లం వేసిన టీ తెచ్చి అందించింది వేడిగా. రెండు గుక్కలు తాగేసరికే ఒంట్లోంచి ఆవిర్లొచ్చినట్లయి ఒళ్లు తేలికయినట్లనిపించిందా ఘాటుకీ వేడికీ.

"అమ్మా!" మెల్లగా పిలిచింది. కిటికీలోంచి ఆకాశంవేపు చూస్తూ.

"ఏమమ్మా! ఏం కావాలీ? " ఆప్యాయంగా అడిగింది మాణిక్యం.

"నాకు పేరు మార్చుకోవాలనుందమ్మా" మెల్లగా అంది చిత్ర.

"ఏమిటీ? " కొత్త సంగతి వింటున్నట్లు చూసిందామె.

"ఔనమ్మా! నాకు పేరు మార్చుకోవాలనుంది"

"నీకంత మనసయితే అలాగే మార్చుకో దానికేం భాగ్యం? పేరులోన నేమి పెన్నిధి యున్నదన్నారు పెద్దలు. కాని నీకంత కర్మేంపట్టింది? "

"పేరుమార్చుకోడం కర్మా అమ్మా? " ఆశ్చర్యంగా చూసింది చిత్ర.

"మనవాళ్లు... అంటే వృత్తిచెసేవాళ్లు

చాలామందే పేరు మార్చుకుంటూంటారు. ఎందుకో తెలుసా? "

"ఏమో నాకెలా తెలుస్తుంది? "

"కొత్త పిట్టలంటే మోజూ, గిరాకీ కదా? విటులకి"

"ఔను"

"కాని మనుషులు కొత్తవాళ్లు కాలేరు కదా? శరీరం మారిపోదు కదా! కొత్తమ నిషైపోదామంటే అయిపోలేరుగా? "

"ఔను"

"అందుకని మనిషిలో సాధించలేని కొత్త దనం పేరులో చూపుదామనుకుంటారు. అదే మనిషి కొన్నాళ్లయ్యాక పేరు మార్చేసు కుంటుంది. అవ్వ అని పిలిచినా ముసిల మ్మని పిలిచినా ఆ మనిషేకదా? " హాస్య ధోరణిలో చెప్పింది మాణిక్యం.

ఆమె నవ్వింది మాణిక్యం చెప్తున్న తీరుకి.

"కొందరయితే ఊళ్లు మారుస్తారు. వృత్తి బాగుంటుందేమో అని. కలకత్తానుంచి కాశీ మారినా కాకి కాకే కాని కోయిల కాలేదుగా"

"ఔనుమరి" నవ్వుతూ "మరి నువ్వు నాకి న్నేళ్లుగానూ పేరు మార్చలేదేం? చిత్రగానే ఉంచేశావేం? " అడిగింది.

"వాళ్లకీ నీకూ తేడా ఉంది. నీకలాటికర్మ అక్కర్లేదు"

"ఎందుకని? "

"నువ్వు తొందరగా వాడిపోని పుష్పానివి. ఆహార విహారాల్లో ఆరోగ్య అందాల పోష ణలో నేను చెప్పిన జాగ్రత్తలు పాటిస్తావు మరి"

"ఓహో!"

"అందుకే నువ్విన్నేళ్లుగా వృత్తిలో ఉన్నా



దిబ్బరొట్టిలా తయారవలేదు. నాజూకుగా ఉన్నావు. అందుకే నువ్వు హైక్లాస్ దానివి"

"అది కేవలమూ నీ అభిమానమే అమ్మా. సరేకాని నాకు పేరు మార్చుకోవా లనుంది"

"ఏమని? "

"మాధవి అని. నేను కృష్ణ భక్తురాలిన య్యానుగా"

"మాధవుని భక్తురాలివి మాధవివి. సరే మెల్లగా అలవాటు చేసుకుంటాను. కాని నాకు మతిమరపెక్కువకదా! మరచిపోయి చిత్రా అంటే కోపగించకు" నవ్వింది మాణిక్యం.

"అసలు మా తల్లితండ్రులు నాకు పెట్టిన పేరు లలిత మాధవనే. అయితే లలితే మిగిలింది"

"వాళ్ల ప్రేమకి పిల్లలడ్డమనుకునే వాళ్లకి వాళ్ల పిల్లవయిన నీకు మంచిపేరు పెట్టేం దుకు శ్రద్ధ కుదిరిందే!"

ఆమె ఏమీ అనలేదిక.



ఆ దేవత పుణ్యమా అని, ఆ కరుణా మయి ధర్మమా అని... నా జీవితం నిలి చింది. స్త్రీ అనే మిస్టరీ తొలగింది. ఆమె స్త్రీ అంటే ఏమిటో తెలియజెప్పడమేకాక నా జేబులో ఐదు వందలు కూడా ఉంచింది. ఆ

క్షణంలోనే. నిశ్చయించుకున్నాను నా జీవితమంటూ ముడిపడితే ఆమెతోనే అని.

మద్రాసు చేరాను. ఆ వైద్యుణ్ణి పట్టుకున్నాను. నా వ్యాధి కుదిరేదే అన్నాడు. నా ఒంటిమీది మచ్చలు పోయేవే అన్నాడు. కాకపోతే 'ఏడాది సమయమూ నెలకి ఏడెనిమిది వందల డబ్బూ ఔతాయి' అన్నాడు. తెగించాను. సరే అన్నాను. ఆ దేవత కారణంగా ఈ వైద్యం ప్రారంభమౌతుంది కనుక నిర్విఘ్నంగానూ విజయవంతంగానూ ముగుస్తుందనే ఆశా విశ్వాసాలే నా పెట్టుబడీ ధైర్యమూ.

దక్షిణాదిలో నిజమైన సంగీత రాష్ట్రం తమిళనాడే. తెలుగు గాయకులని కూడా మొదట గుర్తించేదీ గౌరవించేదీ ఆ రాష్ట్రమే. చెన్నై నగరమే. త్యాగరాజుకి ప్రాచుర్యం కలిగించింది తమిళులే. వారు శాస్త్రీయ సంగీత పోషకులూ అభిమానులూ. సినిమా సంగీతంతోపాటు సమంగా శాస్త్రీయ సంగీతం కూడా అక్కడ తలెత్తుకుంటుంది. వారి సంస్కృతిలో ప్రధాన భాగం సంగీతం. అందుకే అక్కడ ఏ వివాహాన్నికైనా విధిగా ఓ సంగీత కచేరీ ఏదో ఒక స్థాయిలో. ఏమాత్రం ప్రతిభున్న సంగీత కళాకారుడికేనా అక్కడ బతకగలిగేందుకు బహుమార్గాలు. తెలుగు, తమిళ, మళయాల సినిమాలు అక్కడ తయారౌతాయికూడా.

అయ్యరుగారి ధర్మమా అని నాకు తమిళభాష అలవడిందికదా. అంచేత అక్కడ నాకు భాషా సమస్య ఎదురుకాలేదు. వెళ్లిన వారం పది రోజులవరకూ నా హార్మోనియం మెడకి తగిలించుకుని వీధుల్లోనూ కూడలులలోనూ పాడాను. ముఖ్యంగా త్యాగరాజు, అన్నమయ్య, పురందరదాసు వంటి వారివి. వాటికే నేనూహించనంత స్పందనా పారితోషికమూ అందేవి. అప్పుడు నన్నొక క్లబ్బు వారు నా మచ్చలనీ, నా బిచ్చగాడి స్థాయినీ కూడా చూడకుండా చిన్న కచేరీ చేయమని కోరారు! రెండు గంటలు పాడినందుకు ఐదు వందల ఏభై ఎనిమిది రూపాయల బహుమానం. ఇక ఆ తరవాత నేను వెనుదిరిగి చూడవలసిన అవసరం లేకపోయింది. పెళ్లిళ్లలో జరిగే కచేరీలకి ఫంక్షన్లకి పిలుపులూ ఆహ్వానాలూ కచేరీ చేయమని. నా పాటనే తప్ప నా మచ్చల నెవరూ పట్టించుకునేవారే కారు. కళని చూడగలిగిన కన్నులు వారివి. ఆ కళలో అనవసరమైనవి కొట్టుకుపోతాయి వారిదృష్టికి. ఒక వేపు వైద్యం.. మరో వైపు సంగీతం. మెల్లమెల్లగా మచ్చలు ముదురురంగునుంచి లేత బడుతున్నాయి. సంగీత కారుడిగా నా స్థితి మెరుగుపడుతోంది. లభించే డబ్బు, గుర్తింపు పెరుగుతున్నాయి. జీవితం చాలా ఆనందంగానూ ఆశాజనకంగానూ సాగుతోంది. ఆ దేవతను మనసులో తలుచుకోని రోజు లేదు. ఇదంతా ఆమె ప్రసాదమేకదూ?

ఒక సంగీత గురువువద్ద శిష్యుడిగా చేరాను. కచేరీలూ, వీధిపాటలూ యధావిధే. మందులు బాగా పనిచేస్తున్నాయి. ఒకరోజు మౌంట్ రోడ్‌లో అన్నమయ్య కీర్తన ఆలాపిస్తున్నాను. శ్రోతలు మెచ్చుకుంటూ తలలూపుతున్నారు. కీర్తన పూర్తవడమేమిటి, ఒకాయన నా చేయిపట్టుకుని తన కారువద్దకు నడిపించాడు.

"నేనొక మళయాళీ సంగీత దర్శకుడిని. కొత్తదనం నాకు సరదా. కొత్తరకం సినిమా తలపెట్టగా దానికి నన్ను కొత్తరకం సంగీతం సమకూర్చమన్నారు. కొత్త గొంతు కావాలి. శాస్త్రీయ ఆధునిక సంగీతాల ప్రాక్ పశ్చిమ సంగీతాల మేళవింపులో కొత్త రాగాలయితే సిద్ధంచేశాను. కాని వాటిని సరిగ్గా పలికించే సమర్థవంతమైన కొత్త గొంతే కరువయింది. ఇప్పుడు నువ్వు దొరికావ్. నా రాగాలను నీ గాత్రంలో ప్రెజంట్ చేయాలి. కాదనకేం? " బతిమాలాడు ఇంగ్లీషులో.

"ఇలాటి వరాలనెవరు కాదంటారు సార్?" మళయాళంలో అన్నాను.

"మీకు మళయాళం కూడా వచ్చునా? వెరీగుడ్. రేపు ఫార్మల్‌గా వాయిస్ టెస్ట్ చేద్దాం. నాకు తెలుసు. మీ వాయిస్‌కి తిరుగుండదు. దయచేసి రేపు మీరు ఈ అడ్రస్‌కి వస్తే" అంటూ అడ్రస్ కార్డు, టైమూ ఇచ్చాడు.

"తప్పకుండా వస్తానుసర్" అన్నాను మళయాళంలోనే. ఆయన వెళ్లిపోయారు. ఏనుగెక్కినంత సంబరంగా ఉంది నాకు. ఇది ఈ సినిమా ఛాన్సు నేనూహించనిదీ, ఆశపడనిదీ. నా ప్రయత్నమేమీ లేకుండానే వచ్చింది. ఇది అతి చక్కని అవకాశం. నేను దీనిని సక్రమంగా వినియోగించుకోవాలే కాని ఇది నన్ను ఎంత ఎత్తుకైనా ఎగరెయ్యగలదు.

మర్నాడు వాయిస్ టెస్ట్ చేశారు. నా గొంతు మైకుకి చక్కగా సూటయింది. రికార్డింగ్‌లో మరింత అందంగా వచ్చింది నా కంఠం. వాళ్లది విన్నాక అగ్రిమెంటు రాశారు. ఒక్కో పాటకీ అయిదు వేలు. సినిమాలో పాటలన్నీ నావే! కనీసం ఐదు పాటలుంటాయి సినిమాలో. అడ్వాన్స్‌గా అయిదు వేలిచ్చారు. నా ఆనందానికి మేర లేదు. నా దేవతకి కృతజ్ఞతలు తెలుపుకున్నాను. ఆమె కోసం ఒక పట్టుచీర కొనాలనుకున్నాను. ఇది ఆమె చలవేకదా?

పేరు కూడా డబ్బులాటిదే. రావడం మొదలుపెట్టిందంటే సలలితముగ నారికేళ సలిలము భంగిలో వస్తుంది. ఎటొచ్చి పేరు డబ్బులా త్వరగా పోదు. అందుకే డబ్బొచ్చాక మనుషులు పేరుకోసం పాకులాడతారు.

ఆ తర్వాత రోడ్డుమీద తిరుగుతూ పాడడం మానేయవలసి వచ్చింది. ఆ సినిమా పాటలు నిజంగానే ప్రత్యేకమైనవీ, కొత్త తరహావీ. అంచేత వాటి రికార్డింగ్‌లో చాలా సమయం ఖర్చయ్యేది. క్లబ్బుల వేదికలు, కచేరీలు, వివాహ సందర్భంలో పాడడం మాత్రం మానలేదు. ఆవిధంగా బిజీ ఐపోయాను. వీటికి తోడు మాస్టారి దగ్గర సంగీత శిక్షణ.

నా మచ్చలు తగ్గుతున్నాయి. ఎప్పుడైతే వాటిలో మార్పు కనిపించసాగిందో లోపలికి తీసుకోవలసిన మందులూ, పైన పూయవలసిన లేపనాలూ శ్రద్ధగా చూసుకోసాగాను. ఉండేందుకు సదుపాయమైన ఇల్లు. తడుముకోనవసరం లేకుండా డబ్బు. వీటివెంటే నాకో కల తరచుగా రానారంభించింది.

చక్కని చిన్న ఇల్లు. దానిలో నేనూ నా దేవతా. ఆమె నాకు భార్యేకాదు సర్వమూ. ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్ అంటారే అలాగ. ఆమె ఆలిన్ వన్. తల్లీ చెల్లీ చెలీ కూడా! ఇంతవరకూ నేను పొందలేని ప్రేమ ఆమెనుంచి పొందగలుగుతాను. ఆమె కార్యేషుదాసీ... కరణేషు మంత్రీ... శయనేషు రంభా అంటారే అలా అన్నీను.

ఆ కల నాకెంతో బాగుండేది. ఆ కలంటే నాకు చాలా ఇష్టం. ఆ కల తరచుగా వచ్చేది. ఆ కల... కలలోకి ఆ దేవతా రావాలని కోరుకునే వాడిని పడుకోబోయే ముందు.

ఆ సంగీత ప్రధానమైన మళయాళం సినిమా హిట్టయింది. ఆ ప్రయోగాత్మక సినిమాకి అవార్డులూ వచ్చాయి. దాంతో నాకు మంచి పేరొచ్చింది. మరి కొన్ని మళయాళ సినిమాలకీ తమిళ సినిమాలకీ పాడడానికి నన్ను తీసుకున్నారు. నేను నేర్చుకున్న శాస్త్రీయ సంగీతం, మిమిక్రీ... ఉపాధి కోసం రకరకాల పాటలు పాడడం.. అవన్నీ నాకు చాలా తోడ్పడ్డాయనుకుంటాను మంచి గాయకుడినవడానికి. నా రూపాన్ని కూడా పట్టించుకోకుండా కొందరు స్త్రీలు నాకు దగ్గ




రయ్యేందుకు ప్రయత్నించారు. కాని నా జీవితానికి తొలి స్త్రీగా దేవతే. ఆమె అనుగ్రహించకపోతేనే మరో స్త్రీ. మంచి ఆహారం.. మంచి వాతావరణం... చక్కని జీవితం... శ్రద్ధగా ఔషధ సేవనం. నా ఒంటికి మంచి రంగొస్తోంది. నా మచ్చలు వేగంగా మాసిపోతున్నాయి. వైద్యుడు నా పట్ల మరింత శ్రద్ధ తీసుకుంటున్నాడు.

★ ★ ★

"నాట్యానికి ఆధారం- శివతాండవం. భారతీయ విశ్వాసం ప్రకారం- సంగీతానికి మూలం ఓంకారం. భక్తిని వ్యాప్తిచేసేందుకు ఆయుధంగానే వికసించింది సంగీతం. అందుకే త్యాగరాజు, అన్నమయ్య, శ్యామశాస్త్రి వంటి సంగీత నిధులూ, వాగ్గేయకారులూ జన్మించారీ దేశంలో

భక్తి వేరు శృంగారం వేరు కాదు. పార్థివ స్త్రీ పురుషుల నడుమ విరిసేది ప్రాపంచిక శృంగారమైతే- భక్తుడికీ భగవంతుడికీ మధ్య నెలకొనేది దివ్య శృంగారం. అదే భక్తి. ఆ భక్తిని పెంపొందించేందుకే సంగీతం. అందుకే నిజమైనదీ, మంచిదీ అయిన సంగీతం నిండా భక్తి. జయదేవుని అష్టపదులు అందుకు చక్కని ఉదాహరణలు. త్యాగరాజకీర్తనలు, అన్నమయ్య కీర్తనలు సరేసరి. నిజమైన సంగీతం దేముడికంకితం కావాలి వేణూ! నువ్వొక్కసారేనా దేముడిముందు పాడు" అని సలహా ఇచ్చారు గురువుగారు.

"దేముని ముందు నివేదించిన సంగీతానికే సార్థకత"

దేముడు ఎక్కడుంటాడు? కోవెలలో...!

తూరుపు తెల్లారకుండా స్నానంచేసి శుచిగా కోవెలకి వెళ్ళాను. పూజారి అడ్డగించాడు. "ఎవరు నువ్వు? "

ఏం చెప్పాలో తెలియక నీళ్లు నమిలాను.

"ఏం చేస్తూంటావ్? "

"పాటలు పాడుతూ వీధులంట అడుక్కుంటాను"

"నీ కులమేమిటి? "

"తెలియదు. అనాధ బాలుడిని"

"నీవంటివాడు ఆలయప్రవేశం చేస్తే దేముడు మైలపడతాడు. ఫో"

"దేముడికీ కులాలూ, మైలా ఉంటాయా?

ఒక్క పాట పాడిపోతాను, దేముడి ముందుకు వెళ్ళనివ్వండి" ప్రార్థించాను.

అప్పటికే భక్తులు దైవదర్శనంకోసం వచ్చివున్నారు.

"వీల్లేదని చెప్పలేదూ? ఫో" కసిరాడు పూజారి.

"నేను అక్కడే నిలబడి 'తెరతీయగ రాదా' అంటూ త్యాగరాయకృతి అందుకున్నాను. బయట నిలబడే సంగీతాన్ని నైవేద్యం పెట్టాను. కృతి అయ్యేవరకూ భక్తులు కదిలితే ఒట్టు. మంచి సంగీతం- సినిమాలలో అయినా భక్తి పాటలలోనే ఉంటుందిప్పటికీ.

అది ఆనాడు! ఆ తిరస్కృతి ఆనాటి సంగతి! మరి నేడు ఆలయం వారి ఆహ్వానంమేరకు అష్టలక్ష్మి ఆలయంలో, గర్భగుడిలో అరగంటసేపు లక్ష్మీస్తవం చేశాను నిన్న. బండి ఓడయింది. నాకా కోవెలలో పాడగలగడం ఎంత ఆనందం ఇచ్చిందో! గాయకుడిగా నా జన్మ సఫలమయిందనిపించింది. ఆ కోవెల వారిచ్చిన కుంకుమని నా దేవత కోసం భద్రపరచి ఉంచాను కలుసుకున్నప్పుడిద్దామని. నన్ను గాయకుడిగా తెలుగు సినిమారంగం కూడా గుర్తించింది. ఒక తెలుగు సినిమాలో పాడడానికి నన్నాహ్వానించింది. నాకు చాలా ఆనందం కలిగింది. ఏదేమైనా మాతృదేశంమీదా, మాతృభాషమీదా మనిషికి మమకారం పోదు కదా? అందులోనూ మాతృమూర్తి నెరుగని వాడిని.



నా జీవితం మార్పు కోరుతోంది. నా ఒంటరితనం తోడు కోరుకుంటోంది. నా విజయాలను విని అభినందించే నా మనిషి కావాలనిపిస్తోంది. నా మనసులోని భావాలనూ, బాధలనూ, ఆనందాలనూ నిస్సంకోచంగా చెప్పుకోగల్గ నా మనిషి కావాలనిపిస్తుంది. నా శరీరమూ మనసూ కూడా

తోడు కోరుకుంటున్నాయి. ఈ ఒంటరితనం ఇక భరించమని మారాం చేస్తున్నాయి. విరామమెరుగని దినచర్య. తత్ఫలితంగా ఇల్లు చేరేసరికి అలసట. అంతకంటే బాధించే ఏకాంతం. డబ్బూ పేరూ వస్తున్నా జీవితానికి సుఖం మాత్రం రావడంలేదు. నా దేవత వచ్చేవరకూ అది రాదు.

నా దేవత రావాలంటే నేనామె వద్దకు వెళ్ళాలి. ప్రార్థించాలి. ప్రాధేయపడాలి. ఆనాడు నువ్వాదేశించినట్లు ప్రయోజకుడినయ్యానని చెప్పాలి.

కాని ఆమె ముందుకు వెళ్ళి ముఖం చూపగలిగే అర్హత నాకింకా రాలేదు. నా ముఖంమీదా వొంటిమీద మచ్చలు పూర్తిగా పోలేదు. వైట్‌గా కనపడుతున్నాయి. కొద్ది నెలలలో అవి పోతాయని హామీ ఇచ్చాడు వైద్యుడు. అంతవరకూ ఓపిక పట్టాలి. నిరీక్షించాలి. తప్పదు. ఓర్చినమ్మకే తేటనీరు. ఎదురు చూడగలిగినవారికే అదృష్టం. తపస్సు చేసేవారికే దేవత"

వింటున్న మాధవికి కళ్ల వెంట నీళ్లొచ్చాయి. అంతటి మహాగాయకుడు. గొప్పవాడు. తననింతగా ఆరాధిస్తున్నాడా! ఏంచూసి? తనేమీ అత్యద్భుత సౌందర్య రాశి కాదే! పైగా వేశ్య! తనపై అతనికెందుకింత ఉన్నతమైన అభిప్రాయం? ఆ రాత్రి... తన శరీరాన్ని ప్రదర్శించిందనా? అసహ్యించుకోకుండా అతన్ని కౌగలించుకుందనా! ముద్దు పెట్టుకుందనా? సుఖపెట్టిందనా? అందులో తన త్యాగమేముంది? తను వెలయాలు. కావలసినంత డబ్బిస్తే ఎవరికైనా తను వొళ్లివ్వవలసిందే. అది వృత్తిధర్మం. ఆ రాత్రి అతనిమీద జాలి పడింది కాని అతన్ని ప్రేమించలేదే. మనస్ఫూర్తిగా అతని కర్పితమూ అంకితమూ కాలేదే. ఒక రోగికి నర్సులా అవసరమయిన సేవ చేసిందంతే. కర్తవ్యనిర్వహణ మాత్రమే కావించింది తను. కాకపోతే డబ్బు తీసుకోలేదు. సరిగదా తనే ఇచ్చింది. అదేమీ ఘనకార్యం కాదు. తనకి డబ్బుమీద ఎప్పుడో విరక్తి కలిగింది. ఆ మాటకొస్తే జీవితంమీద కూడా. రాగానురాగాలకతీతంగా సహ్యాసహ్యాలను పట్టించుకోకుండా నిస్పృహలో, విరాగంలో, క్షుద్రమూ, అశాశ్వతమూ, క్షణభంగురమూ అయిన తన కట్టెను కొంతసేపు అతని అనుభవాలకు వొదిలినందుకు ఇంత ఆరాధనా! ఇంత కృతజ్ఞతా భావనా!

వొద్దు మాధవ్. వొద్దు. నీకీ వెర్రి వద్దు. నువ్వు కళాకారుడివి. కమనీయ గాయకుడివి. కలవాడివి. పరువు ప్రతిష్టలూ, పేరు ప్రఖ్యాతులూ ఉన్నవాడివి. నా వంటి పాపితో జతకూడితే గంధపు చెక్క అగ్నితో కూడినట్లే, పన్నీరు మురికినీటిలో కలిసినట్లే నీకు కళంకమూ, చెడ్డ పేరే వొస్తాయి. అవమానాలే ఎదురవుతాయి. అవహేళనలే మిగులుతాయి.

మళ్ళీ అతని కంఠం టేప్‌రికార్డర్‌లోంచి, "అనుకోని అవకాశం వచ్చింది. నా వూరి నుంచి ఎవరో వచ్చారు. సన్మానం చేస్తామంటూ ఆహ్వానించారు"

"సన్మానాల స్థాయికి ఎదగలేదు నేను. అభినందిస్తామంటారా? అలాగే" అన్నాను.

"నేను వొప్పుకోడానికి బలమైన కారణం పుట్టిపెరిగిన వూరు చూడొచ్చు పాతస్నేహితులని పలకరించి రావచ్చుననే దానితో




పాటు మచ్చలు పూర్తిగా మటుమాయమ య్యాయి కనుక చిత్రను కలుసుకుని ముఖం చూపించొచ్చు. నిస్సంకోచంగా మాట్లాడొచ్చు. ఆ దేవత ఆనాడు చూపిన కరుణ తననెంతవాడిని చేసిందో ఆమెకి చెప్పి, ఆమెకి కృతజ్ఞతలు తెలియజేయ వచ్చు.

కృతజ్ఞతలు తెలియజేయడమేనా? ఇంకేమీ లేదా? మనసు మారాం చేసింది తన సంగతేమిటన్నట్లు. నిజమే. ఆమెపట్ల తనకున్నది కేవలమూ కృతజ్ఞత మాత్రమే కాదు. ఇంకా ఏదో... ప్రేమ? భక్తి? ఆరా ధన? అభిమానం? అనురాగం? గౌరవం? ఏమో అది ఏదయితేనేం. తన కామె కావాలనిపిస్తోంది శాశ్వతంగా, తన జీవితంలో భాగంగా. తన ప్రతిపాదన నామె ముందుంచాలి. తన అభిమతాన్నీ, అభీష్టాన్నీ, మనసునీ, హృదయాన్నీ, సర్వ స్వాన్నీ ఆమెకు నివేదించుకోవాలి.

ఎలా ఉందో చిత్ర? ఎలా ఉందో వూరు? అయ్యర్, నాయర్, మురారి, అనం తరామయ్య వీరందరూ ఎలా ఉన్నారో?

ఏ వూరి వీధుల్లో తను పాటలు పాడు కుంటూ, అడుక్కుంటూ తిరిగేవాడో, ఆ వూరిలోనే తనకి గౌరవం! ఏ వూరిలో తను స్ట్రీట్ సింగరో- ఆ వూరికి సినీగాయకుడిగా తన సందర్శన. ఏ ప్రజల ముందు తను చేతులు కట్టుకుని నిలుచునేవాడో, వారిచేత తనకి సత్కార సన్మానాభినందనలు! ఏ వూరిలో తను అనాధో, అనామకుడో ఆ వూరిలోనే ప్రసిద్ధుడిగా వేదికనలంకరిం చడం! తనకెందరో అభిమానులు.

ఇదంతా ఒకెత్తు. చిత్రని కలుసుకోవడ మొకెత్తు. తను నిజంగా వెళ్తున్నది చిత్ర కోసమే.

★ ★ ★

ఉదయం ఎనిమిదవుతోంది.

అప్పటికే వేణుమాధవ్ స్నానమూ అవీ చేసి తయారై ఉన్నాడు తన గదిలో. మాధవి మేలుకుందా?

మేలుకునుంటే ఫరవాలేదు. లేకపోతే తను ఆమె నిద్రను భంగం చేసినవాడవు తాడు. అదేం బాగుంటుంది? తన కథ టేపులో వింటూ ఆమె రాత్రి ఎంతవరకు మేలుకుని ఉందో? అతను మెల్లగా కుర్చీ లోంచి లేచాడు. నిశ్శబ్దంగా నడుచుకుంటూ ఆమె గదినీ తన గదినీ వేరుచేసే ద్వారం వద్దకు వెళ్ళాడు. తలుపుమీద మృదువుగా వేళ్లతో తట్టాడు- సంకోచిస్తూనే. మరునిము షంలో తలుపు తెరుచుకుంది.

"మీరా? బజర్ కొట్టలేకపోయారా? "

"నిద్రలో ఉంటే భంగమవుతుందని" అంటూ చూపు వాల్చుకున్నాడు.

ఆమె స్నానంచేసి పువ్వంత ఫ్రెష్‌గా, మంచులో తడిసిన గులాబీలా పట్టుచీర కట్టుకుని, జుత్తు ముడివేసుకుని, బొట్టు పెట్టుకుని, అందంగా కనపడుతోంది.

"లోపలికి రండి" ఆహ్వానించిందామె.

"కాఫీ చెప్పేదా!" అన్నాడతను లోపలికి వచ్చి

"థాంక్స్" అందామె. అతను సర్వీసెస్‌కి ఆర్డర్ చేశాడు ఇంటర్ కమ్‌లో.

"మాడమ్... మీరు నా కథ విన్నారను కుంటాను" మెల్లగా అన్నాడతను.

"ఊc..."

"అయితే మనం కాఫీ తాగాక మాట్లాడు కోగలమా? నేనూ మీ కథ పూర్తిగా చది వాను"

"దేనిగురించి మాట్లాడుకోవాలి? " ఆమె అడుగుతూండగానే కాఫీలు వచ్చాయి. పాట్ కాఫీ. బోయ్ కాఫీలు చేసి ఇచ్చి మరీ వెళ్ళాడు.

"చెప్పండి" అందామె కుర్చీలో సర్దుకుకూర్చుని. అతను తడబాటు పడ్డాడు.

"మీరు నా కథనుంచి నా మనస్సేమిటో తెలుసుకునే ఉంటారు"

"ఔను. చాలా ఆశ్చర్యపోయాను కూడా"

"ఆశ్చర్యమెందుకూ? "

"ఆకాశం- ధూళిధూసరితమయిన నేల కోసం వొంగుతూందంటే ఆశ్చర్యం కాదూ? మలినమయిన మంది కాళ్లకింద నలిగిన పూవుని ప్రభువు పాదాలు. ఆహా... ప్రభువు శిరస్సే తన నలంకరించిరమ్మంటే నమ్మశక్యంగా ఉంటుందా? "

"ఏమిటి మీరనేది? " అతను వినలేనట్లు చూశాడామెవేపు.

"నా మనసులోనిది" భారంగా నవ్విందామె.

"మాడమ్. నేను మిమ్మల్నేం కోరదలుచుకున్నానో సూటిగా చెబుతాను"

"స్వయంగా చెబుతారా? లేక ఇదీ టేపులో వినిపిస్తారా? నిజమే మరి. మీరు మాట్లాడితే నోటి ముత్యాలు రాలుతాయేమో... గాయకులు కదా"

అతను సిగ్గుపడ్డాడు. "నేను మిమ్మల్ని ప్రార్థించవలసింది- రికార్డ్ చేసుకున్నాను. నోటిముత్యాలు రాలతాయని కాదు. మీముందు నోరు తడబడి, మనసు తొణికిసలాడి చెప్పదలుచుకున్నది సరిగా చెప్పలేక పోతానేమో అని. రికార్డింగైతే ఎన్నోసార్లు రిహార్సల్స్ వేసుకోవచ్చు సరిగా వచ్చిందనిపించేవరకూ ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లూ తుడిచేసి మళ్ళీ రికార్డ్ చేసుకోవచ్చు"

"నా ముందు మీరెందుకు తడబడాలి? అన్నివేలమంది ముందు కచేరీలు చేస్తారే. నిజానికి మీరు పెద్ద సినీగాయకులూ, నేనేమో అతిసామాన్యురాలినీ కనక నేనే మీ ముందు తడబడాలి న్యాయంగా"

"బహుశా... ఒకరు ఎవరినైతే ఆరాధిస్తారో, ఎవరినైతే వారే తమ జీవితమూ, జీవిత సర్వస్వమూ అని భావిస్తారో వారి ముందు తడబడతారనుకుంటాను"

"నా కథ తెలుసుకున్నాక కూడా మీరు నన్నింకా ఆరాధిస్తున్నారా!"

"అవును మాడమ్"

"మాధవ్! నా అనుమానం మీకు నాపట్ల ఉండినది ఆరాధనా, ప్రేమా కాదనే"

"మరేమిటి? " వెర్రిమొహం వేసి కంగారు పడిపోయాడు.

"మీకు కృతజ్ఞతాభావం చాలా ఎక్కువ. అందుకు నిదర్శనం మీరు రాత్రి వేదికమీద ఎందరెందరికో రుణపడివున్నానని చెప్పడమూ కృతజ్ఞతలు తెలపడమే. నా పట్ల కూడా మీకు కృతజ్ఞతాభావమే ఉండి ఉంటుంది. దానినే మీరు మరోలా భావిస్తుండి ఉంటారు- నేను స్త్రీని కనుక మీ వయసుకి దగ్గరదాన్ని కనుక"

"మాధవీ! మీరలా అంటే ఇదని నేను వాదించనూ లేను, నిరూపించనూ లేను. కాని ఒకటి మాత్రం నిజం" అన్నాడతను ఉద్వేగంగా.

"ఏమిటి? "

"నా ఊహలలో, కలలో మీతో నా జీవితం పంచుకోవాలని. పంచుకుంటున్నట్లు. అలాగ మరిదానిని కృతజ్ఞత అనాలో, ప్రేమని అనాలో మీరే చెప్పండి. మీతో నేను అభిలషించేది సహజీవనం. నా బతుకుబాటలో మీ తోడూ చేయి. నేను కోరుకునేది మీతో వివాహం" అన్నాడతను కొంచెం సిగ్గుపడుతూ. "మీరంగీకరిస్తే అనుగ్రహిస్తే... నేనదృష్టవంతుడిననుకుంటాను"

"నాతో వివాహం!" పేలవంగా నవ్వింది. "మీరు నిజంగా నా కథ చదివే అడుగుతున్నారా యిలాగ? "





"రాత్రంతా నేను చేసిన పని అది"

"నేను వేశ్యనని తెలిసే కోరారా, అటు వంటి కోరిక? "

"ఎందుకు మీరే మిమ్మల్నిలా కించపరచు కుంటారు? "

"ఇందులో కించపరచుకునేందుకేముందీ? అది కటికనిజం. ఆ నిజానికెన్నో సాక్ష్యాలు. అంతెందుకూ? నేను వెలకి అమ్ముడుపోయే వేశ్యని కనుకనే కదా మీరు నన్ను మీతో తీసుకురాగలిగారిక్కడికి? " సూటిగా అడిగింది.

"మాధవీ! నా భావనలో మీరు వేశ్యకానే కాదు. దేవతే"

"నేను వేశ్యనికానా? !" అతని అమాయకత్వానికి నవ్వింది.

"మీరు వేశ్యకాదు" అతని కంఠం కంచు గంటలాగే మోగింది. ఒక్కసారతని ముఖం గంభీరంగా మారిపోయింది. ఆమెకతని వైఖరికి నవ్వొచ్చింది. "మీరు కాదంటే సరిపోతుందా? ముంజేతి కంకణానికద్దమెందు కన్నట్టు... నేను వేశ్యనని ఎవరో చెప్పవలసిన పనేముంది, నేనే స్వయంగా చెబుతూంటే..."

"మీరు పొరబడుతున్నారు" కచ్చితంగా అన్నాడు. అతని కంఠంలో మొండితనం లాటి స్థిరత్వం, అతని ముఖంలో పట్టుదల, అందులోనే పసితనపు అమాయకత్వం.

"సరే. సరయినదేదో ఎలాగో మీరే చెప్పండి. వింటాను" అందామె నవ్వాపుకుంటూనూ ఒడంబడికకి వచ్చినట్లూనూ.

"మీరు వేశ్యకాదు, ఎందుకంటే" తన వాదాన్ని నిరూపించుకునే లాయర్లా మొదలుపెట్టాడు.

"మహాబలిపురం గెస్ట్‌హౌస్ అదే కాటేజీలో మూడు పశువులు మీమీద అత్యాచారం చేశాయి. మీరు వాళ్ళని వాంఛించలేదు. వారికి మీ శీలమర్పించడం మీకిష్టం కాదు. అది మీ అభీష్టానికి వ్యతిరేకంగా జరిగింది. ఔనా? కాదా? " సూటిగా ప్రశ్నించాడు.

"ఔను..." అందామె నిజం అంగీకరిస్తూ.

"బ్లూఫిలిమ్ ఆఫరొచ్చింది. అది మీ యిష్టాయిష్టాలమీద ఆధారపడింది. అంగీకరించడమూ మానడమూ మీ ఆధీనమే. ఎప్పుడైతే మీ ప్రమేయమూ యిష్టాయిష్టాల కవకాశామూ ఉన్నాయో అప్పుడు మీరు తిరస్కరించారు"

"నిజమే"

"అంటే... చెడిపోడం మీకు యిష్టంకాద నేగా? " క్రాస్ ఎగ్జామ్‌నేషన్ చేస్తున్నట్లే అడిగాడు. ఔనని అంగీకరిస్తున్నట్లామె తలూపింది.

"మద్రాసులోనే కంపానియన్‌గా వెళ్ళి పెద్దమొత్తం సంపాదించే అవకాశం మీకొచ్చింది. కానీ మీరు దానిని తిరస్కరించారు" ఔనా అన్నట్లు చూశాడతను.

ఔనన్నట్లు బుర్రూపిందామె అతని వాద నాపటిమకి ఆశ్చర్యపోతూ. కళాకారుడైన యితనికి ప్రాపంచిక విషయాలలో యింత సునిశిత దృష్టీ, పరిశీలనా ప్రతిభానా!

"అక్కడ జీవించడానికి వ్యభిచారం తప్ప నాన్యః పంథా అని తెలియగానే మీరా వూరే వదిలివేశారు. అంతేతప్ప అక్కడుండి వ్యభిచరిస్తూ పొట్టపోసుకుందామనుకోలేదు, మీకు మీదంటూ ఏవూరూ లేకపోయినా..."

కాదనలేకపోయిందామె.

"ఈ వూరు చేరాక మాణిక్యంలాటి వేశ్య మాతతో ఉంటూకూడా ఆమె ఒకవేపు వృత్తిని చేపట్టమని సలహా యిస్తున్నా మీరు మరొక రకపు ఉపాధికోసం ప్రయత్నించారు. వ్యభిచరించకుండా మరెలాగయినా బతికేందుకు వీలుందేమోనని చిత్తశుద్ధితో



ప్రయత్నించారు. ఔనా? "

"నిజమే"

"ట్యుటోరియల్ కాలేజీలో టీచరు. బిస్కట్ కంపెనీలో దినకూలీ కార్మికురాలు. రికార్డింగ్ డ్యాన్సర్. ఎన్నోవిధాల ప్రయత్నించారు సవ్యంగా జీవించేమార్గంకోసం. దుర దృష్టవశాత్తూ అవేవీ మీకు పూర్తిగా తిండి పెట్టేవి కావు. ఇక గత్యంతరంలేక మాణిక్యానికింకా రుణపడలేక చాలా అయిష్టంగా మీ అభీష్టానికి వ్యతిరేకంగా మీరెంతో అసహ్యించుకునే... ద్వేషించే వ్యభిచార వృత్తికి తలవగ్గారు. అంతేతప్ప ఆ వృత్తిమీద యిష్టంతో ఎంతమాత్రమూ కాదు. ఒకవిధంగా అది మీమీద రుద్దబడింది బలవంతంగా. ఔనా, కాదా? "

"ఔను" తలాడించిందామె.

"ఒక పెళ్ళి సంబంధం రాగానే ఎంతో సంబరపడిపోయారు. మీకు వైవాహిక జీవితంపట్ల ఉండిన కాంక్షకీ గౌరవానికీ విశ్వాసానికీ అది నిదర్శనం. మిమ్మల్ని చేసుకుంటానని ముందుకొచ్చిన మగవాడే కాని మంచివాడై ఉండి ఉంటే అతన్ని పెళ్ళి చేసుకుని యిల్లాలిగా జీవించే వారే తప్ప ఎంత మాత్రమూ వ్యభిచారంవేపు వచ్చేవారేకాదు. ఎటొచ్చీ సవ్యమైన మగాడు దొరకనందునే మీరు వృత్తిలోకి దిగారు"

"ఔను"

"వృత్తిలో కూడా తామరాకుమీది నీటి బిందువులాగే ఉన్నారు. ధనసంపాదనామార్గంగానే తప్ప మీరు మీ వృత్తిని యిష్టపడలేదు. వృత్తిచేయడంవల్ల కలుగుతున్న అసంతృప్తి బారినుంచి తప్పించుకుందుకే మీరు పుస్తకాలనాశ్రయించారు. భగవద్గీతా పాఠకురాలూ కృష్ణభక్తురాలూ అయ్యారు. వేదాంతాన్నీ వైరాగ్యాన్నీ మీ జీవితంలోకీ మనసులోకీ తెచ్చుకున్నారు. మీ వృత్తి మీకు సంతృప్తినివ్వలేదనడానికిదే సాక్ష్యం"

ఆమె ఏమీ అనలేదు. ఆమె మౌనాన్ని సంపూర్ణాంగీకారంగా తీసుకున్నాడు మాధవ్.

"ఏది అనివార్యమో అది చేయకతప్పదెవరికైనా. మనం యిష్టపడి చేయని పని తాలూకు ఫలాఫలాలకు మనం బాధ్యులమూ కాము, అవి మననంటనూ అంటవు. వృత్తి మీ యిష్టమై అనుసరించింది కాక బలవంతంగా మీపై రుద్దబడింది కనుక అది మీకు చెందదు. దాని మంచి చెడులకు మీరు బాధ్యులు కారు. అందుకే మీరు వేశ్యకారు. కనీసం నా దృష్టిలో"

"పోనీ మీ తృప్తికోసం... అలాగే అనుకుందాం. అయితే ఏమిటి? " నిజంగా తెలియనట్లే అడిగింది. నిజమయిన సమస్య అప్పుడెదురయిందతనికి. అతని ముఖంలోకి సిగ్గొచ్చేసింది. గొంతులో ఏదో అడ్డుపడ్డట్లయింది. ఎ.సి. గదే అయినా శరీరం చిరు చెమటలు కమ్మింది. నాలుక పొడారిపోయినట్లయింది. తల వంచేసుకుని ఎలాగో అన్నాడు, "నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలని కోరుకుంటున్నాను" మనసులోమాట చెప్పేసరికి అతనికెంతో తేలికగా అనిపించింది. ఆమె ఏం చెబుతుందో అని అతని గుండెలు దడదడలాడసాగాయి.

"మీరు వంటిమీద స్పృహే ఉండీ... వాస్తవ దృష్టితోనే కోరారా అలాగా? "

"మాధవీ...!"

"లేకపోతే ఏమిటి? నేనొక వేశ్యని. సమాజంలో పరువుప్రతిష్టలు లేనిదాన్ని. అధోజగత్తుకు చెందిన క్షుద్రజీవిని. హీనపు ణ్యాని. నలుగురిచేతా చిన్నచూపు చూడబడే పణ్యాంగనని. మీరో? సుప్రసిద్ధ గాయకులు. కళాకారులు. సమాజంలో ఉన్నతవర్గానికి చెందినవారు. మీ కళతో ప్రజాసేవ చేస్తున్న కళారాధకులు. ఎక్కడికెళ్ళినా నలు




గురినుంచీ అభిమాన హారతులూ గౌరవ నైవేద్యాలూ అందుకునేవారు. నేను నలు గురి అవహేళనలకూ పాత్రురాలిని. సంఘంలో పేరుప్రఖ్యాతులు కల మీరు నాలాంటి భ్రష్టురాలిని పెళ్ళి చేసుకుంటే ఏం జరుగుతుందో తెలుసా?" ఒక క్షణం ఆగి మళ్ళీ చెప్పసాగింది. "మీకు తలవం పులు వస్తాయి. మీరింతవరకూ సంపాదిం చుకున్న గౌరవమర్యాదలు నశిస్తాయి. నేను మీ జీవితంలో ప్రవేశిస్తే మీ జీవితంకూడా అధఃపతనమౌతుంది. మాధవ్! ఇప్పుడు మీరంటే నాకు గౌరవమూ, అభిమానమూ. మీ గానమంటే ఆరాధన. మీ కోరికనంగీక రిస్తే మీ నాశనానికి నేను దారి చూపడమే ఔతుంది. వద్దు మాధవ్. ఈ వేశ్యను వివాహం చేసుకుని సర్వనాశనం కావద్దు" బతిమాలుతున్నట్లే అందామె కళ్లలో నీళ్లతో.

అతను ఒక నిట్టూర్పు విడిచాడు. "మీరొక విషయం... ఒక నిజం... ఎందుకు గ్రహించరు?"

"ఏమిటది?"

నేనెందరు వేశ్యలని సమీపించలేదు? ఎందరికి వారు కోరిన డబ్బిస్తాననలేదు? కాని వారిలో ఏ ఒక్కరూ నా కోరిక తీర్చ డానికంగీకరించలేదు. కానీ వేశ్యాసామ్రాజ్ఞి అనదగిన మీరు నా కోరిక తీర్చారు. స్త్రీ అనే మిస్టరీని సాధించేందుకు నాతో సహకరిం చారు. అలాగని మీరు వేశ్యలా డబ్బు తీసు కున్నారా నానుంచి? లేదు. కేవలమూ మానవత్వంతో దయతో కరుణతో ఒక జీవిని కాపాడదామనే సదుద్దేశంతో త్యాగ బుద్ధితో మానవసేవాదృక్పథంతో మాత్రమే నన్నంగీకరించారు. ఎందరో స్త్రీలు అసహ్యిం చుకున్న భయపడి దూరంగా తొలగిన నన్ను ప్రేమతో ముద్దులు పెట్టుకున్నారు. అభిమానానురాగాలతో నా వికృత శరీరాన్ని కౌగలించుకున్నారు. ఎంత త్యాగనిరతి ఉండాలి. అలా చేసేందుకు? మీ గురించీ మీ రేపటి గురించీ ఆలోచించుకోకుండా మీరు నా కోర్కె తీర్చారు. నా జీవితాన్ని నిలబెట్టారు. మాధవీ! ఆవేళ మీరు నిలబెట్టి ఉండకపోతే నా జీవితమేమయ్యేది? నదిలో కలిసిపోయుండేది. కానీ నేను బతి కాను. అంటే యీ జీవితం దీన్ని దక్కించిన మీదే"

అతని ఉద్రేకానికామె ఆశ్చర్యపోయింది.

"మీరు నేనేదో గొప్పవాడినన్నారు కదూ? మీకంటె చాలా ఎత్తులో ఉన్నానన్నారు కదూ?

నా పుట్టుకేమిటి? అవాంఛిత శిశువుగా.

నా పెరుగుదలేమిటి? అనాథగా.

నా బతుకులోని తొలి అధ్యాయాలేమిటి? వీధి గాయకుడిగా... స్ట్రీట్ సింగర్‌గా. తరు వాత బతుకు అధ్యాయాలు మలుపు తిరిగి నేను సినీ గాయకుడిని కావడం నిజమే. కానీ నేను మద్రాసు వెళ్ళడానికి కారకులె వరు? నా జేబులో అయిదువందలుంచిన మీరు. 'అన్నివిధాలా ప్రయోజకులవమని 'గుడ్‌లక్' చెప్పిన మీ స్ఫూర్తితోనే నేను నా ఆరోగ్య జీవితంలోనూ గాయకజీవితం లోనూ విజయాలు సాధించాను. ఇవాళ నేను పద్మాన్నయితే నా మొదలు బురద లోనే ఉంది. ఇది కాదనలేని నిజం. నా గత జీవితంలో నికృష్టపు అధ్యాయాలు తక్కువేమీలేవు. యౌవనంలోనే బలవం తంగా అంతంకావలసిన నా జీవితాన్ని మీరాదుకోబట్టి యీ జీవిత గ్రంథంలోకి మంచి అధ్యాయాలు చేరే అవకాశం కలి గింది. నా జీవితమే మీ ప్రసాదం. మీరు ఔనన్నా కాదన్నా నా విశ్వాసం మాత్రం యిదే. మీ ప్రసాదమైన నా జీవితం మీ ప్రవేశంతో పతనమవడమేమిటి? నేటి నా సంపాదనకూ పేరు ప్రఖ్యాతులకూ అన్ని టికీ కారణం మీరై ఉండగా మీవలన నేనవి కోల్పోడమేమిటి? మీ సాహచర్యమూ సాన్ని

హిత్యమూ నాకు అదనపు వరాలే ఔతాయి కానీ అన్యథా కాజాలవు. అయినా యీ సంపదా, పేరుప్రఖ్యాతులూ జీవితంకంటె ఎక్కువ కావుగా? ఏది జీవితానందమిచ్చేదో అదేకదా అన్నిటికంటే విలువైనది? నాకు మీకంటె యివేవీ ఎక్కువకావు. నా జీవితమూ గానమూ కూడా మీకే అంకింతం మాధవీ, మీరు స్వీకరించినా తిరస్కరించినా. జీవితమే అశాశ్వతమూ క్షణభంగురమూ. ఈ సమాజస్థాయీ, పేరు ప్రఖ్యాతులూ మరింత అశాశ్వతాలు"

విభ్రాంతితో అతన్ని చూస్తూ ఉండిపోయిందామె నోరు పెగలనట్లు. అతని కంఠంలో, మాటలలో ఏదో మంత్రశక్తి తనని వివశురాలిని చేస్తోంది.

"మీరు మీకు కూడా అన్యాయం చేసుకోవడమే నన్ను కాదంటే..."

తుళ్లిపడిందామె "అదెలా?"

"మీకు మొదటినుంచీ ఒక కోరికుండేది అంతరంగంలో. పెళ్లి చేసుకుని యిల్లాలిగా జీవించాలని. ఈ అతి సహజమయిన సామాన్యమయిన కోరికే దురదృష్టవశాత్తూ మీకందరానిదైపోయింది. అయినా అంతశ్చేతనలో అది అలాగే మిగిలిఉంది. అందుకే మీకు చిన్నయిల్లూ, దానిలో భర్తా పిల్లలతో మీరు గడుపుతున్నట్టూ పదేపదే వచ్చిన ఆ కల. దానిని నిజం చేయగలిగే అవకాశాన్ని అదృష్టాన్నీ నాకు ప్రసాదించి నన్ను ధన్యుణ్ణి చేయండి దేవతా! నాదీ అలాటి కలే. మీ కలని నిజం చేస్తే దానితోపాటే నా కలా నిజమౌతుంది" వేడుకుంటున్నట్లే అన్నాడతను.

ఆమె ప్రతిమలాగే ఉండిపోయింది.

"మీకు నా మీద అనుమానమా? నేను పేరు ప్రఖ్యాతులు సంపాదించి, ఐశ్వర్యం సంపాదించి గొప్పవాడినైపోయానని, మిమ్మల్ని వివాహం చేసుకున్నాక సరిగా చూడనేమో అనే సందేహమా?

మాధవీ! ఆ వేళ మీ దివ్య సౌందర్య దర్శనం అద్భుతమయిన అనుభవం. ఈనాటికీ అదే! నా జీవితంలోకి మరో స్త్రీ రాలేదు. నేనే రానివ్వలేదు. వివాహమయ్యాక కూడా నిన్ను దేవతలాగే చూసుకుంటానని ప్రమాణం చేస్తున్నాను"

"నాది ఒక మనవి వింటారా దయచేసి?"

"తప్పకుండా చెప్పండి" అన్నాడతను ఆత్రంగా.

"మీరు నా కథ చదివారుకదా"

"ఔను"

"దానిలో నా మనసులో జీవితంపట్ల దృక్పథంలో వచ్చిన మార్పుల గురించి మీరర్థం చేసుకునే ఉంటారు. అంటే... నాలో వేదాంతమూ వైరాగ్యమూ భక్తీ ఉదయించడమూ, ఆధ్యాత్మికత వేపు మనసు మొగ్గుచూపడమూ అవీ..."

"ఊం"

"దానినిబట్టి నేను విరాగిణినని ఊహించలేదా?"

"ఐతే"

"విరాగిణికి వివాహేచ్ఛ ఏముంటుందీ?"

"అదా!" అతను తేలిగ్గా నవ్వాడు. "మాధవీ! గానం చేయడం కోసమని నేనూ భగవద్గీత పఠించాను. అర్థం బాగా తెలిస్తేనే పదోచ్చారణ, విరుపు మొదలయినవి చక్కగా వస్తాయని టీకా టిప్పణులతో శ్రద్ధగా చదవాను గీతా శ్లోకాలని. అలా చదవడం వల్ల కాబోలు గీతాపాఠం నా మనసునీ ప్రభావితం చేసింది. శ్రీకృష్ణ భగవానుడు ఈ సృష్టంతా మాయ అని చెబుతూనే మనుషులు సంసారంలో ఉండే కర్మ సన్యాసంద్వారా తరించవచ్చని చెప్పలేదూ? జీవితమూ వైరాగ్యమూ భక్తీ పరస్పర శత్రువులుకావు. సరికదా ఒక దానిపై ఒకటి





ఆధారపడి ఉండేవే అని అర్థమయింది నాకు. అది సరయినది అని పెద్దవారు అన్నారు కూడా. సంగీతం కూడా భక్తి మార్గమే. ఒక సంగీతకారుడికి భక్తురాల యిన భార్య అనుకూలురాలేకాని అనర్హు రాలు కాదు. అలా లభించడం అతనికదృ ష్టమే ఔతుంది"

ఇక ఇతన్ని జయించడం తన తరం కాద నిపించేసిందామెకి. తమ వివాహానికి ప్రతి కూలంగా తను ఏం చెప్పినా ఆ విషయం వివాహాన్ని బలపరిచేదిగానే నిరూపిస్తు న్నాడు బుద్ధి చాతుర్యంతో.

"మీరింతగా పట్టుపడుతుంటే నేనేమీ చెప్పలేకపోతున్నాను. అదీగాక ఇలాటి పెద్ద విషయంలో నిర్ణయం చెప్పవలసిన దాన్ని నేను కాను కూడా" అంది.

"మరెవరు? "

"మా అమ్మ మాణిక్యం"

"నిజంగా ఆమె అదృష్టవంతురాలు. ఎంత ఉన్నత స్థానమిచ్చారూ ఆమెకి కన్న తల్లికాక పోయినా. మీరు చెప్పింది అత్యంత సమంజసం పదండి. ఇప్పుడే వెళ్దాం. ఆవి డతో మాట్లాడదాం"

"నాకు మరోలా అనిపిస్తోంది"

"ఎలా? "

"నేను ముందుగా విషయం ఆమెకి చెబు తాను. అప్పుడు మీరొచ్చి మాట్లాడితే బాగుంటుంది"

"అదీ నిజమే"

"నేనింటికి వెళ్తాను"

"అలాగే కారుపంపమని టెలిఫోన్ చేస్తాను"

"అది వచ్చేలోగా నేనీ బట్టలు వదిలి నా బట్టలు వేసుకుంటాను"

"మీకివి నచ్చలేదా? "

"నచ్చలేదని కాదు"

"మరి? "

"..."

"ఇప్పుడు మీరు కట్టుకున్నది అష్టలక్ష్మి ఆలయం వారిచ్చిన చీర. అంటే లక్ష్మీదేవి ప్రసాదమే. దీనిని ధరించడం వల్లనే మీరు నా ప్రతిపాదన నంగీకరించారని నా సెంటి మెంటు"

"సరే"

అతను సర్వీసెన్‌కి ఫోను చేశాడు. కారు వచ్చేలోగానే మంజుల వచ్చింది.

"గుడ్‌మాణింగ్ సర్... గుడ్‌మాణింగ్ మాడమ్"

"మంజులా! వీరిని ఇంటివద్ద దిగవిడచి రావూ? ప్లీజ్"

"విత్‌ప్లెషర్ సర్. మీవంటి సినీ గాయకు లకి సేవ చేయగలగడం నా భాగ్యం" మాధ విని వెంట బెట్టుకుని వెళ్లిందామె.



"అదమ్మా విషయం. నీ అభిప్రాయం...

అహ నిర్ణయం చెప్పు" అంది మాధవి నిన్న సాయంత్రం తను మాధవ్‌తో వెళ్లింది మొదలు ఉదయం వరకూ జరిగిందంతా వివరంగా చెప్పి.

"ఇంటికొచ్చిన యింతసేపటికా ఇలాటి శుభవార్త చెప్పడం? వస్తూనే చెప్పొద్దూ?" అలిగినట్లే అంది మాణిక్యం.

"అది కాదమ్మా..." ఏదో చెప్పబోయింది మాధవి.

అంతలోనే మాణిక్యం ఆమెను కౌగలించుకుని, "ఎంత చల్లని కబురు చెప్పావమ్మా. నువ్వు చాలా అదృష్టవంతురాలివి. వృత్తి చేసే వేశ్యకిలాటి గొప్ప సంబంధం రావడమా? పెట్టిపుట్టావు తల్లీ!"

"అంటే... నన్ను అతన్ని పెళ్ళి చేసుకోమంటావా?"

"పెళ్లి చేసుకోక? మొదటినుంచీ నీ మనసు పెళ్లిమీదేగా? కోరుకున్న సిరి వస్తుంటే వద్దంటారేమిటి ఎవరయినా?"

"అయితే అతనికి నా అంగీకారం చెప్పేసేదా?"

"ఇంతవరకూ చెప్పలేదా?" ఆశ్చర్యపోయింది మాణిక్యం.

"నిన్నడక్కుండా ఎలా చెబుతానూ? నీవు కదా నిర్ణయించవలసింది"

"అమ్మా! మాధవీ! నాకెంత విలువ ఇస్తున్నావూ? నేనెవరిననమ్మా ఇంత పెద్ద పీట వేస్తున్నావ్ నాకూ నా మాటకీ?" ఆనందం పట్టలేక కన్నీరు పెట్టేస్తోందామె.

"కొత్తగా వింతగా అడుగుతావేం? నువ్వు మా అమ్మవి. అమ్మకి చెప్పకుండా ఇలాటి విషయాల్లో స్వతంత్రిస్తానా? తప్పు కాదూ"

"నా తల్లే... నా అమ్మే. నా బంగారు కొండే. చేసుకో తల్లీ. తప్పకుండా చేసుకో. అతను రాగానే ఇష్టమే అని చెప్పెయ్"

"అలాగే అమ్మా"

ఒక్క నిముషం వారిమధ్య నిశ్శబ్దం. అప్పుడు మెల్లగా, విచారంగా అంది మాణిక్యం.

"నువ్వు అతనితో వెళ్లిపోతావు. నీ వరకూ అది బాగానే ఉంటుంది. కాని నేనే మళ్ళీ ఒంటరినైపోతాను. నీతో చాలా అలవాటయిపోయి నిన్ను విడిచి ఒంటరిగా ఉండటమంటే బాధా, భయమూ వేస్తున్నాయమ్మాయీ"

"నిన్ను విడచి దూరంగా ఉండడం నాకు మాత్రం బాధ కాదూ?"

"కాని... తప్పదుకదా"

"తప్పుతుంది" అన్నాడు అప్పుడు అక్కడికి వచ్చిన మాధవ్.

"మాణిక్యంగారూ! మీరు కూడా మాతో వచ్చెయ్యాల్సిందే. మీరు రావడం మాకానందదాయకమే కాని అభ్యంతరకరం కాదు. మీలాటి పెద్ద దిక్కుంటే మాకెంతో హాయిగా ఉంటుంది. ఏం మాధవీ?"

"నిజమేనమ్మా"

"కన్నకూతురు కాకపోయినా ఈ అమ్మాయి నన్నెంత నెత్తిన పెట్టుకుంటుందీ! పూర్వజన్మలో ఏం పుణ్యం చేసుకున్నానో"

"మాధవ్! ఇకనుంచి నేను లలితనే. చిత్ర, మాధవి ఇవన్నీ మధ్యలో ఎత్తిన అవతారాలు. అందుచేత ఇకపై నన్ను లలితా అనే పిలవం"

"తప్పకుండా" అన్నాడతనామె చేతినందుకుంటూ.

"ఈడూ జోడూ ముచ్చటైన జంట. చూడ్డానికి రెండు కళ్లు చాలవు" అనుకుంటూ వారి మధ్యనుంచి వెళ్ళిపోయింది మాణిక్యం.







# చతుర ప్రపంచం

## వాటర్ పోలో

పోలో ఆటని గుర్రాలమీద కూర్చుని ఆడతారు. అసలు ఇండియాలో మహారాజులకోసం పుట్టిన ఈ ఆటని, ఆ తర్వాత ఇండియాని పాలించిన బ్రిటిష్‌వారు తమ స్వంతం చేసేసుకున్నారు. అంతే కాదు ఈ ఆటని ఆధారంగా చేసుకుని వాటర్‌పోలో ఆటని కూడా సృష్టించారు.

పేరునిబట్టి వాటర్‌పోలో ఆట నీళ్లల్లో ఆడతారని గ్రహించచ్చు. ఇరవై బై ముప్ఫై మీటర్ల వైశాల్యం గల కొలనులో ఆడే ఈ ఆటలోని ఇరుపక్షాల్లో, మొత్తం పధ్నాలుగురు ఆటగాళ్ళుంటారు. అంటే, ఒక్కోవైపునా ఏడుగురు ఆటగాళ్ళుంటారు.

నీళ్లల్లో ఈదుతూ, బంతిని తీసుకెళ్ళి గోల్‌చేయడంద్వారా ఈ ఆటని ఆడతారు. గోల్స్ 3 మీటర్ల వెడల్పు, 90 సెంటీ మీటర్ల ఎత్తులో వుంటాయి.

ఓ ఆట పూర్తవడానికి పీరియడ్‌కి 7 నిముషాల చొప్పున మొత్తం నాలుగు పీరియడ్స్- అంటే 28 నిముషాలసేపు పడుతుంది.

ఏడు నిముషాలు కాగానే వాచీని ఆపేస్తారు. మళ్ళీ ఆటని మొదలుపెట్టాక ఆ వాచీని తిరిగి స్టార్ట్ చేస్తారు. అలా 28 నిముషాల ఆట పూర్తవడానికి విశ్రాంతి సమయం కలిపి మొత్తం గంటసేపు పడుతుంది. బంతి పట్టుకున్న ప్రత్యర్థిని నీళ్ళల్లో ముంచచ్చనే నియమం కూడా వుంది.




రిఫరి ఒడ్డున నిలబడి ఆటని గమనిస్తాడు. ఫౌల్ చేస్తే ఎదురు పక్షం ఆటగాళ్ళు గోల్‌కి నాలుగు మీటర్ల దూరంనించి బంతిని గోల్‌చేసే శిక్షని విధిస్తాడు. అయితే నీళ్ళపైన ఏం జరుగుతోందో మాత్రమే రిఫరి చూడగలడు. కాబట్టి సాధారణంగా ఆటగాళ్ళు ప్రత్యర్థులని నడుంపట్టుకుని ఆపడంలాంటి ఫౌల్ గేమ్స్ నీళ్ళకింద చేస్తూంటారు. అలాగే కాళ్లతో కాళ్ళని పెనవేసి ప్రత్యర్థిని కదలకుండా చేస్తూంటారు.

ప్రతీ ఆటగాడు ఒకదానిమీద ఇంకొకటి

చొప్పున రెండు స్విమ్మింగ్ ట్రంక్స్‌ని ధరిస్తారు. ప్రత్యర్థుల వల్ల ఒకటి చిరిగిపోయినా ఇంకొకటి వుంటుందని ఈ ఏర్పాటు.

ప్రపంచంలో పోలో ఆటని బాగా ఆడే దేశాలు హంగరి, యుగొస్లావియా, ఇటలి, క్యూబా, జర్మని, సోవియట్ యూనియన్, ఇంగ్లండ్.

## భూగర్భ రైలు

**భూ**మిలోపల మట్టిని తొలిచి అండర్ గ్రౌండ్‌లో రైలు మార్గాన్నివేసే ప్రక్రియను కనుగొన్నది బ్రిటన్‌కి చెందిన చార్లెస్ పియర్సన్. లండన్ నగరంలోని రోడ్లమీద వాహనాల రద్దీని తగ్గించడానికి చార్లెస్ ప్రపంచంలోని తొలి అండర్‌గ్రౌండ్ రైల్వేని నిర్మించాడు. ఫేరింగ్‌టన్ స్ట్రీట్‌నించి బిషప్స్‌రోడ్‌దాకా ఆరు కిలోమీటర్ల దూరం ఈ అండర్‌గ్రౌండ్ రైల్వేని వేయడానికి 20 ఏళ్ళు పట్టిందతనికి. జనవరి 10, 1863న ఈ అండర్ గ్రౌండ్ రైలు మొదలయింది.




ఈ విధానాన్ని క్రమేపీ ప్రపంచంలోని ఇతర పట్టణాల్లో కూడా అవలంభించారు. లండన్ అండర్ గ్రౌండ్‌ని ట్యూబ్‌గా వ్యవహరిస్తే అమెరికాలో సబ్‌వే అని పిలుస్తారు. టోక్యో, న్యూయార్క్, ప్యారిస్, రోమ్‌లలో కూడా నిత్యం పట్టణ ప్రయాణీకులని ఓ చోటనుంచి ఇంకోచోటకి తరలించడానికి అండర్ గ్రౌండ్ రైల్వేలున్నాయి.

ఇండియాలో ఒకే ఒక పట్టణంలో అండర్ గ్రౌండ్ రైల్వేలైనుంది. అది కలకత్తాలోని మెట్రోట్రాన్స్‌పోర్ట్ ప్రాజక్ట్ (యం.టి.పి) ఆధ్వర్యంలో కలకత్తాలో నిర్మించబడింది. డమ్‌డమ్‌నుంచి టోలీగంజ్ దాకా గల ఈ మెట్రో పొడవు 16.43 కిలోమీటర్లు. ఈ దూరం ప్రయాణించడానికి కేవలం 33 నిమిషాలు మాత్రమే పడుతుంది.

మ్యాగ్నెటిక్ స్ట్రిప్‌గల టిక్కెట్లని ప్రయాణీకులు ఆటోమాటిక్ యంత్రాలలో నాణాలు వేసి కనుక్కొని గేటుదగ్గర యంత్రంలోని స్లాట్‌లో వాటిని వేస్తే ఆ యంత్రం మేగ్నటిక్ కోడ్‌ను చదివి ఆ టిక్కెట్‌తో ఎంత దూరం ప్రయాణించవచ్చో ప్రింట్ చేస్తుంది. అలాగే ప్రయాణం పూర్తయ్యాక రైల్వే స్టేషన్‌లోంచి బయటకి రావాలంటే ఈ టిక్కెట్‌ని గేటుకున్న యంత్రంలోవేసి బయటకి రావాలి. టిక్కెట్ లేనివారు స్టేషన్‌లోంచి బయటకు రాలేరు.

అక్టోబర్ 24, 1984న మొదటి మెట్రో లైనర్ ఎస్ప్లనీడ్‌నుంచి భవానీపూర్‌దాకా నడవడంతో కలకత్తాలో అండర్ గ్రౌండ్ రైల్వే శకం మొదలయింది.

## పౌరసత్వం అమ్మేదేశం

ఆదేశానికి ఆర్మీకానీ, నేవీకానీ లేవు. కేవలం పదుగురు పోలీసులు, ఓ పోలీసు కుక్కమాత్రం వున్న ఆ దేశంలో ఒక్క కమ్యూనిస్ట్ కూడా లేడు. 1917 నుంచి చెప్పుకోతగ్గ పెద్ద నేరాలు ఆదేశంలో జరగలేదు. ఓ పర్వతం పక్కనే లోయలోవున్న ఆ




దేశం పేరు లైక్‌టెన్‌స్టెయిన్. స్విట్జర్లాండ్‌కి, ఆస్ట్రియాకి మధ్యవున్న ఈ చిన్న దేశం పొడవు 17 మైళ్లు. వెడల్పు $3^1/_2$మైళ్లు. 11023 జనాభాగల ఈ దేశంలో 2548 విదేశస్థులు కూడా వున్నారు.

రాజు జోసెఫ్ III పాలించే ఈ దేశంలోని ప్రజలు ఎంతో శాంతిగా, హాయిగా, ఆనందంగా జీవిస్తున్నారు. ఈ రాజుగారికి ప్రజలనుంచి కప్పం ఏదీ అందదు. కోటలో జీవించే ఈ రాజుగారి కుటుంబ సభ్యులకు కట్టుడుపళ్లు తయారుచేసి అమ్మే వ్యాపారముంది.

ఈ పళ్లు ప్రపంచం మొత్తానికి ఎగుమతి అవుతాయి. అదే ఆ రాజుగారి ఆదాయం. రాజుకి ఫ్రెంచి భాష వస్తుంది. ఇంగ్లీషురాదు. దేశానికి పార్లమెంటరీ సిస్టం, ప్రధానమంత్రి వున్నారు. ఆయన ఆఫీసుకి ఇంటికి నడిచే వెడతారు. యం.పి.ల సంఖ్య మొత్తం 15. ప్రధానమంత్రి ఉపప్రధానమంత్రి... వీరిద్దరే అన్ని శాఖలకీ మంత్రులుగా పనిచేస్తారు. ప్రత్యేకంగా వేరే మంత్రులు ఈ దేశానికి వుండరు. 97 శాతం మంది క్యాథలిక్ క్రిస్టియన్లు. దేశంలో మొత్తం 15 గ్రామాలున్నాయి. ప్రతివాళ్లూ కష్టపడి పనిచేస్తారు.

ఆవులు వాళ్ల సంపద. అవి కొండలకవతలకెళ్లి మేయడానికి ఆ కొండలలోంచి రెండు సొరంగాలు తవ్వారు. బార్‌లలో ఎక్కువగా తాగి గొడవచేస్తే మర్నాటి దినపత్రికలో అతని పేరు, హెచ్చరిక చోటు చేసుకుంటాయి.

ట్యాక్స్‌లు తక్కువ. తపాలా బిళ్లలను అన్ని దేశాలకీ అమ్మడంద్వారాను, విదేశీ కంపెనీలని తమ దేశంలో రిజిష్టర్ చేయడంద్వారాను తమదేశ పౌరసత్వాన్ని అమ్మడంద్వారాను ఫారిన్ ఎక్స్ఛేంజ్‌ని సంపాదిస్తారు. ఈ పౌరసత్వాన్ని ఏటా ఇద్దరికో ముగ్గురికో ఇస్తారు. వాళ్లని ఎంతో జాగ్రత్తగా ఎంపిక చేస్తారు. వాటికన్ సిటీని వదిలేస్తే ఇది ప్రపంచంలో అతి చిన్నదేశం.

## అన్నివయసులవారినీ అలరించే ఔషధం

రుచిగా, కమ్మగా వుండే పాలకూర భోజనంలో వుంటేనే అది పూర్తి భోజనం కింద లెఖ్ఖ అంటున్నారు పౌష్టికాహార శాస్త్రవేత్తలు. ఇందులో వున్నన్ని ఎమినోయాసిడ్లు, ఐరన్, విటమిన్‌లు. ప్రొటీన్లు... మొదలైనవి మాంసం, చేపలు, గుడ్లలో కూడా లేవు. బెటాకెరోటిన్ సమృద్ధిగా వుంది పాలకూరలో. ఇది శరీరపు ఎదుగుదలకి, చక్కని కంటిచూపుకి దోహదం చేస్తుంది. 100 గ్రా




ముల పాలకూరలో 10.9 మిల్లీగ్రాముల ఐరన్ వుంది. రక్తంలో హెమోగ్లోబిన్, ఎర్రరక్త కణాలు అభివృద్ధి చెందడానికి దోహదం చేస్తుందీ ఐరన్. అందుకే రక్తహీనతతో బాధ పడేవాళ్ళకి పాలకూర దివ్యౌషధం అంటారు.

గర్భిణీలలో ఫొలిక్‌యాసిడ్ లోపంవల్ల ఏర్పడే రక్తహీనతకి కూడా పాలకూర మహత్తరమైన మందులా పనిచేస్తుంది. ఇందులో కాల్షియం కూడా ఎక్కువగానే వుంది. 100 గ్రాముల పాలకూరలో 73 మిల్లీగ్రాముల కాల్షియం వుంది. ఇది శరీరాన్ని క్షార సంబంధితంగా వుంచుతుంది. అన్ని వయసుల వారికీ కూడా ఇది మంచిదే. పాలిచ్చే తల్లులలో పాలు సమృద్ధిగా వుండేలా చేస్తుంది. ఉడకబెట్టిన పాలకూరకన్న పచ్చిదానిలో ఎక్కువ ప్రొటీన్లు, విటమిన్లు వుంటాయి. మెంతికూర, పుదీనాల్లా దీనిని కూడా ఎండబెట్టి ఒరుగు చేసుకుని నిలవబెట్టుకోవచ్చు.

పళ్లనొప్పులు, చిగుళ్లనుంచి రక్తం కారడంలాంటి సమస్యలొచ్చినప్పుడు పచ్చి పాలకూర రసం ఎంతో మంచిదంటున్నారు వైద్యులు. శ్వాసకోస రుగ్మతలకి కూడా ఔషధంగా పనిచేస్తుంది. ఉదయం లేవగానే పచ్చిపాలకూర రసం, కొద్దిగా క్యారెట్ రసంతో కలిపి రోజూ తాగితే ఓ బలవర్ధకమైన టానిక్‌లా పనిచేస్తుంది. కానీ మూత్ర పిండాల్లో రాళ్లున్నవారు లేదా మూత్రపిండానికి సంబంధించిన జబ్బులున్నవారు మాత్రం పాలకూర తినకూడదంటున్నారు. మలబద్ధకమున్నవారు మాత్రం పాలకూర తప్పనిసరిగా తినాలి.

పాలకూర సూప్ చేసుకోవాలనుకునేవాళ్లు ఆకును శుభ్రంగా కడిగి, సగానికి కోసి దానికి తగినన్ని నీళ్లు పోసి వుడికించి, ఆ నీటిని తీసుకుని అందులో కొంచెం ఉప్పు, మిరియాలపొడి కలిపి తాగాలి. ఇంకా దానికి రుచిని అభిరుచిని బట్టి లవంగాలు, వెల్లుల్లిల్లాంటివి కూడా చేర్చుకోవచ్చు. ★




# 'శీతాకాలం సూర్యుడు' పై సమీక్షలు

మే 'చతుర' లో ప్రచురితమయిన అక్కినపల్లి సుబ్బారావు రచన 'శీతాకాలం సూర్యుడు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## చల్లని శైలి

*(ప్రథమ బహుమతి రూ: 100-/ పొందిన సమీక్ష)*

అక్కినపల్లి సుబ్బారావుగారి 'శీతాకాలం సూర్యుడు' మనస్సు లోలోపలి పొరలలోనికి జొరబడి, ఆలోచనల ప్రకంపనలు రేకెత్తించే నవల.

'శీతాకాలం సూర్యుడు' ప్రజ్వలించడు. నునువెచ్చని కిరణాలతో తాకి మనస్సును రంపపుకోత కోసే చలిగాలులను పోగొట్టే ప్రయత్నం చేస్తాడు. 'శీతాకాలం సూర్యుడు' జగన్నాధం పాత్రకు, కధాకధనానికి తగిన పేరు.

మంచీ చెడులమధ్య పొర ఎంతటి పలుచటిదో, ఎప్పుడు ఎలాగ మంచీ చెడులు కలగాపులగం అవుతాయో, ఒక దానిస్థానం యింకొకటి ఆక్రమిస్తుందో జీవితంలోని అనుభవాల ద్వారా నేర్చుకోవలసిందేగానీ, ఏ గ్రంధం, ఏ చట్టం ఏ మతం చెప్పగలదు? అలాగే మనం తీసికొన్న నిర్ణయం సరియైనదో కాదో ఎవరూ ఎప్పటికీ నిక్కచ్చిగా చెప్పలేరేమోనని నాకూ జగన్నాథం లాగ అనిపిస్తుంది.

రామస్వామి విషయంలోగాని, కెప్టెన్ శ్రీనాధ్‌తో జరిగిన వాదనలోగాని, ఛాయ విషయంలోగాని జగన్నాధం ఆలోచన తీరు ఈ విషయమే తెల్పుతుంది. తను చంచలను వివాహమాడేందుకు వెనుకాడిన విషయం కూడ అంతే. సరియైనదో కాదో ఎప్పటికీ తేల్చుకోలేనిదే.

అమెరికా జీవితంలోని క్రమబద్ధీకరణ, యాంత్రికతతోపాటు, దానిలోని నిజాయితీ, సౌకర్యమూ ఇండియాలోని అనేక అసౌకర్యాలతోపాటు, కొద్దో గొప్పో మిగిలి వున్న ఆర్ద్రత, అనుబంధం, మనస్సుకు హత్తుకొనేలాగ చిత్రించారు.

ఇతరుల అవసరానికి ఆదుకొనే ఆదర్శం, అవకాశం జగన్నాథానికి ఇండియాలోనే దొరుకుతుంది. అది అతనిలోని వెలితిని పూడుస్తుంది. ఒంటరితనాన్ని తగ్గిస్తుంది. మనిషి ఏకకాలంలో భూత, వర్తమాన కాలాలలో నివసిస్తూ రెండింటి మధ్యా ఆలోచనలతో, విశ్లేషణలతో బేరీజు వేసికొంటూ బ్రతికే విధానాన్ని చక్కగా రూపొందించారు. "స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్" ప్రక్రియను ఎంతో నేర్పుగా, ఆకట్టుకొనేవిధంగా వాడుకొన్న సుబ్బారావుగారి శైలి నచ్చింది.

—సుసిక్

హైదరాబాద్-500 016.

## అమెరికా సూర్యుడు

*(రెండవ బహుమతి రూ: 75-/ పొందిన సమీక్ష)*

మంచి కథావస్తువు తీసుకుని చక్కని శైలిలో కథని నడిపించారు రచయిత.

అమెరికాలోని వాతావరణాన్ని, అక్కడి సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని కళ్ళక్కట్టినట్లు వివరించారు. ఆ దేశాలలో ఆర్థిక భద్రత ఉన్నా మనుషుల ప్రాణాలకు విలువలేకపో

వడం, ఒకరినొకరు పట్టించుకోకపోవడం, మానవ సంబంధాలన్నీ ఆర్థిక పరమైనవి కావడం బాధాకరం. స్కూల్ పిల్లల్లో కూడా పెచ్చరిల్లుతున్న హింసాప్రవృత్తికి తలొక రకమైన భాష్యం చెప్పుకుని సమాధాన పడడం మనసుని కలచివేసింది. ప్రతి సంఘటనలోనూ రెండు దేశాలమధ్య వైరుధ్యం బాగా కనిపించింది. చివరికి చావులో కూడా ఎంతో తేడా ఉంది. అమెరికాలో మనిషి 'సంఘంలో ఒక జీవి' తప్ప 'సంఘజీవి' కాదు అన్న మాట అక్షరసత్యం. ఇండియాలోని తనదైన ప్రపంచాన్ని వదులుకుని అమెరికాలో ఒంటరితనాన్ని అనుభవిస్తూ ఇండియా తిరిగి వచ్చిన జగన్నాథాన్ని ఇక్కడ కూడా మారిన పరిస్థితులు ఇబ్బంది పెట్టాయి. అమెరికాతో పోల్చుకుంటే పరిశుభ్రతలో మనం ఎంతో వెనుకబడి ఉండటానికి తప్పనిసరిగా మన దారిద్ర్యం, జనాభా, నిరక్షరాస్యత కారణాలు. లోపభూయిష్టమైన మన చట్టాల్ని కూడా ఎత్తిచూపారు.

అయితే సున్నితమైన మానవ సంబంధాలు, పరస్పర సహాయ సహకారాలు, శ్రమజీవన సౌందర్యం, మన పురాతన సంస్కృతి ఇవే మనల్ని అన్ని దేశాల్లోనూ అత్యున్నత స్థానంలో నిలబెట్టాయి. డాలర్ల మోజులో అమెరికాకు పరుగులు తీస్తున్న మన యువతరం, వాళ్ళు పంపించేడాలర్లని, అక్కడి సంస్కృతిని వంట పట్టించుకుంటున్న ఇక్కడి జనం మనదైన జీవనవిధానాన్ని మరిచిపోతే అతిత్వరలోనే మనదేశం మరో అమెరికా కాక తప్పదు.

మన మనస్తత్వాన్ని, మంచితనాన్ని విడచి పెట్టకుండా, రాజీపడకుండా జీవించగల్గితే ఏ ప్రదేశాన్నయినా స్వర్గతుల్యం చేసుకోవచ్చనటానికి మంచి ఉదాహరణలు సాయి, చంద్రికలు. చంచల లాంటి డేరింగ్ వుమన్ భర్తను మార్చుకోలేక ఆ జీవితంలోనే తృప్తిని వెతుక్కోవటం చూస్తుంటే మన స్త్రీలు ఎక్కడికి వెళ్ళినా మారరేమో అనిపిస్తుంది.

కూతురి భవిష్యత్తుకోసం తాను కష్టపడి అమెరికా వెళ్ళి ఆ వయసులో కూడా ఉద్యోగంకోసం విఫలయత్నాలు చేసే సగటు తండ్రి రామస్వామి, తండ్రిమీద ప్రేమ ఉన్నా ఆయనతో కాలక్షేపం చేసే టైమ్‌లేక అక్కడి యాంత్రికతలో అసంతృప్తిని మోస్తూ నిరంతరం అభద్రతా భావంతో కొట్టుమిట్టాడుతూనే జీవితంతో రాజీపడే నరేంద్ర, పద్మలను చూస్తే జాలివేస్తుంది. తనకంటూ కొన్ని నిశ్చితాభిప్రాయాలతో, కార్యసాధనలో ఏ అడ్డంకికీ వెరవని ఛాయ లాంటి ఆత్మస్థైర్యంగల అమ్మాయి నేటి యువతరానికి ప్రతినిధి.

మొత్తానికి మండువేసవిలో వచ్చిన 'శీతాకాలం సూర్యుడు' పాఠకుల మనసుల్ని ఎంతగానో ఉత్తేజపరిచాడు. ప్రాక్పశ్చిమాల తారతమ్యాలను పుస్తకరూపంలోకి తెచ్చిన ఈ నవల చతుర నవలా మకుటంలో ఆణిముత్యం.

–ఎ. రాధాశ్రీనివాస్
గుంతకల్-515 801.

# డబుల్ స్టాండర్డ్స్

*(మూడవ బహుమతి రూ: 50-/ పొందిన సమీక్ష)*

'శీతాకాలం సూర్యుడు' ద్వారా అంతనొప్పించని, నులివెచ్చని, సున్నితమైన హెచ్చరికలను 'జగన్నాథం' పాత్రద్వారా పాఠకులకు అందచేసిన రచయిత శ్రీ అక్కినపల్లి సుబ్బారావుగార్కి కృతజ్ఞతలు.

పోటీ ప్రపంచంలో ఉన్న స్థానాన్ని నిలబెట్టుకుంటూ, పాకుడు బండలకు లోకువకాకుండా ఉన్న శక్తియుక్తులన్నీ పాదాలనద్ద కేంద్రీకరించుకొని నిటారుగా నిలబడడమే జీవితధ్యేయం అన్న పంథాలో అమెరికాలో జీవిస్తున్నారు అనేక ప్రవాసాంధ్రులు. అంత




'బాలన్స్‌డ్‌వాక్'గా గడపవలసిన జీవితంలో ఏ ఒక్క ఈగ వచ్చి మీదవాలినా దాని ఉనికీ, ఆఖరికి దాని బరువూ... రెండూ కూడా ప్రాణసంకటాలు అవుతున్నాయి.

'డబుల్ స్టాండర్స్'ని అనుసరిస్తూ ఎదుటివాళ్ళకి నీతులు చెపుతూ, తమదాకా వచ్చేసరికి ఉక్కిరిబిక్కిరి అయిపోతూ ఉన్న కొంత మంది పరిచయస్థుల మధ్య అయిదేళ్ళు గడపగల్గి, జీవిత సత్యాన్ని తెల్సుకొని, తనదంటూ ఒక పథాన్ని ఎంచుకొని, తామరాకుమీద నీటిబొట్టులా, ఒక తాత్వికుడిగా తన దేశానికి తిరిగి రాగల్గిన జగన్నాథం ఒక స్థితప్రజ్ఞుడు.

ఈ ప్రపంచంలో అతి బలహీనుడు 'స్థాన బలిమి పోగొట్టుకున్నవాడు'

—మంగళంపల్లి వెంకటసీతారామయ్య,
దుండిగల్, హైద్రాబాద్-43.

## వేసవికాలం సూర్యుడు కూడా...

*(నాలుగవ బహుమతి రూ: 50-/ పొందిన సమీక్ష)*

జీవితపు అన్ని దశలలోనూ వృద్ధాప్యం గడ్డుదశ. ఈ దశలోనే అర్థంచేసుకొనే మనుషులు అవసరం. ఉద్యోగంనుండి విరమించినవారికి ఇది మరీ అవసరం. ఉద్యోగవిరమణ తరువాత చుట్టూ ఉన్న మనుషుల దృక్పథమేమో కాని ఉద్యోగ విరమణ చేసినవారిలోనే దృక్పథం మారిపోతుంది. ఇన్నాళ్ళూ ఒక హోదాలో గుర్తింపు పొందిన వీరు అది కోల్పోయేసరికి మళ్ళీ తమకి ఎటువంటి హోదా లభించే అవకాశం లేదన్న చేదునిజం జీర్ణించుకోలేక తమని తామే చిన్నచూపు చూసుకుంటారు. లేని న్యూనతాభావానికి స్వాగతం పలుకుతారు. తాము ఎందుకూ కొరగాము అన్న అభిప్రాయం స్థిరపడిపోతుంది.

సహజత్వానికి దగ్గరగా, కృత్రిమత్వానికి దూరంగా సాగిన అక్కినపల్లి సుబ్బారావు గారి 'శీతాకాలం సూర్యుడు'లో ప్రధాన పాత్ర జగన్నాథంలో కూడా పై భావనలు కొన్నాళ్ళపాటు రాజ్యమేలినా తరువాత తన కాళ్లపై తాను నిలబడేందుకు స్వతంత్రంగా నిర్ణయం తీసుకుని, ఎంతో సౌఖ్యంగా అమెరికాలో తన కొడుకు దగ్గర ఉండే అవకాశాన్ని వదులుకుని ఇండియాకు తిరుగు ప్రయాణమవుతాడు. అమెరికాలో కొడుకు, కోడలు బాగా చూసుకుంటున్నా అక్కడి మితిమీరిన యాంత్రికత జగన్నాథాన్ని ఏకాకిని చేస్తుంది. అందుకే ఇండియా వచ్చిన తరువాత కొడుకు తిరిగి అమెరికా రమ్మని ఆహ్వానించినా మన్నించడు. వృద్ధాప్యంలో జ్ఞాపకాలు, గతస్మృతులే తోడు, నీడలుగా ఉంటాయి. ఈ విషయం వర్తమానాన్ని గతంతో బేరీజు వేసే జగన్నాథం పాత్రలో కనపడుతుంది.

అమెరికా, ఇండియాల జీవన సరళులలో ఉండే తేడాలను రచయిత ఆయా దేశాల సామాజిక, ఆర్థిక పరిస్థితులతో చక్కగా సమన్వయపరచి కళ్ళకు కట్టినట్లు చూపారు. మితిమీరిన యాంత్రికత మనిషిలోని సున్నితభావాలను మరుగుపరుస్తుంది. అమెరికాలో అదే జరిగింది. ఇండియాలో అవినీతి, కులతత్వం, లంచగొండితనం ఎంతగా పెరిగినా మనుషులమధ్య సంబంధాలు ఇంకా యాంత్రికం కాలేదు, ఆ సంబంధాలలో మానవతా పరిమళం గుబాళిస్తూనేఉంది. ఈ విషయాన్ని చక్కని ఉదాహరణలతో రక్తికట్టేలా చెప్పారు రచయిత. దేశం కాని దేశంలో ఎంత సంపాదించినా ఆలోచనలు సరైనదారిలో ఉన్నప్పుడు ఆ మనిషి జన్మభూమికి, తోటి మనుషులకి ఉపయోగకారిగా ఉండగలడని పరోక్షంగానైనా స్పష్టంగా చెప్పింది ఈ నవల. ఎంత మంది మహానుభావులు చెప్పినా, ఎన్ని పుస్తకాలు చదివినా సొంతంగా అనుభవం అయితే కాని జ్ఞానోదయం కానట్టు, జగ

న్నాథం చివరికి తనకెదురైన సంఘటనలతో జీవితం యొక్క పరమార్థం పరోపకారం అని నమ్ముతాడు. ఇలా నమ్మినవారికి శీతాకాలం సూర్యుడే కాదు వేసవికాలం సూర్యుడు కూడా సౌఖ్యంగా ఉంటాడు.

–సుగుణ
శ్రీకాకుళం-532 001.

## అంతర్మథనం

*(అయిదవ బహుమతి రూ: 50–/ పొందిన సమీక్ష)*

**మ**నదేశ సంస్కృతికీ, అమెరికా సంస్కృతికీ, ఇరుదేశాలలో ఆచార వ్యవహారాలకు, క్రమశిక్షణకుగల తేడాలను జగన్నాథం 'అంతర్మథనం' ద్వారా, పటుత్వకథనంతో సజీవంగా మలచిన మే నెల నవల 'శీతాకాలం సూర్యుడు' అత్యద్భుతంగా వుందని చెప్పక తప్పదు.

'వ్యామోహం' వల్లనయితేనేమి, అందివచ్చిన అవకాశాలను అందిపుచ్చుకొనడంవల్లనయితే నేమి, అనతికాలంలో అత్యధికంగా సంపాయించి భవిష్యత్తును సుందరంగా మలచుకోవచ్చునన్న ఆశవల్లనయితేనేమి, మనదేశంలోని 'ప్రతిభ' అమెరికావంటి అభివృద్ధిచెందిన దేశాలకు వలసపోతోంది. దీనికి ప్రధాన కారణం మనదేశంలోని 'వ్యవస్థ'లో నున్న లోపాలే! 'పైరవీ' చేసేవానికే మనదేశంలో పెద్దపీట వేయబడుతోంది. తెలివితేటలు అణగదొక్కబడుతున్నాయి. అందుకే మమత, మమకారాలకు దూరంగా, అయినవారిని వదలిపెట్టి యువత పరాయిదేశంలో తన మనుగడచూసుకుంటోంది. మనదేశంలో వలె 'టాలెంటు'లేనివారిని అమెరికా ప్రోత్సహించదు. సీతారాం మూడో బావమరిది ఈ కోవకు చెందిన వ్యక్తేనని చిన్న సంభాషణద్వారా రచయిత సున్నితంగా స్పృశించారు.

ఎప్పుడో పుష్కరంక్రితం ఏభై రూపాయల ఫీజుతో తన భవిష్యత్తు కుంటుపడకుండా చేశాడని 'సాయి' జగన్నాథం మీద చూపిన కృతజ్ఞతాభావాన్ని ఎంతో అద్భుతంగా చిత్రికపట్టారు రచయిత. నాలుగు దశాబ్దాల క్రితం చంచల ప్రేమను జగన్నాథం తన పిరికితనంతో ఎలా జారవిడుచుకున్నదీ, కులాంతర వివాహం చేసుకున్న చెల్లెలిమీద విముఖత ఏర్పరచుకున్న రామస్వామి, ఆమె అమెరికా వెళ్ళాక, ఆమె సహాయం తీసుకున్న వైనం ఎంతో సహజ సంఘటనలుగా మలిచారు రచయిత.

కొన్ని సంప్రదాయాలు 'వేలంటైన్ డే' వంటివి మనం అమెరికానుంచి అరువు తెచ్చుకున్నాం. అయితే, ఆ దేశంలో పాటించిన 'సివిక్ సెన్స్' మనం పాటించలేకపోతున్నాం. మర్యాద, మన్నన, ఉద్యోగ బాధ్యతలు వంటివి ఆ దేశానికీ, మనదేశానికి మధ్య ఎంతో తేడా వున్న విషయాలను సైతం వదలలేదు రచయిత. కార్లు, డాలర్లు వంటి వాటిమధ్య విలాసవంతమైన జీవితాన్నిచ్చే అమెరికా 'యాంత్రికత'నుకూడా ఇస్తుందని రచయిత భావన. అందుకే, అక్కడ 'మనిషి' మరణాన్ని కూడా తేలిగ్గా తీసుకుంటారని ఒక వైరాగ్యపు సన్నివేశాన్ని సృష్టించారు.

ఎన్నో సహజ సంఘటనలతో, వినూత్నరీతిలో, విభిన్నంగా రచించిన రచయితకూ, ఈ నవల ప్రచురించిన చతురకూ అభినందన చందనాలు.

–పి. రవీంద్ర,
సూర్యాపేట-508 213.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ !!






ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.



Mango Avakaya, Mango Thokku, Cut Mango, Tender (Vadu) Mango, Sweet Mango Chutney, Amla, Gongura, Drumstick, Lime, Tomato, Mixed Vegetable




**Pickles**
**ఏ పచ్చడంటే**
**ఆ పచ్చడి సంసిద్ధం**



Bitter Gourd, Green Tamarind, Ginger, Sweet Ginger, Mango Ginger, Garlic, Onion, Red Chilli, Green Chilli (Sliced), Green Chilli (Paste), Gongura & Red Chilli, Green Tamarind & Red Chilli

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,**(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.